# అన్నపూర్ణాదేవి లేఖలు

(కీ. శే. శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి
తనభర్తకు వ్రాసిన లేఖలు)

"నన్ను మరచినను దేశమును మరువవలదు.
నేను స్థిరము గాదు"
—అన్నపూర్ణాదేవి.

ప్రకాశకుడు :
బాపినీడు

ఇందలి మొదటి 13½ ఫారములు
లోధ్ర ముద్రణాలయము నందును,
మిగిలిన దంతయూ
ఆంధ్రపత్రికా ముద్రణాలయమునందును
ముద్రిత మయినది.
25-6-33

వెల రు. 1-0-0] 




ఈ గ్రంథమును గొనువారు అన్నపూర్ణాదేవి స్మారకచిహ్నములుగా నడుపఁబడుచున్న సంస్థలకు సాహాయ్యము చేయుటయేగాక ఆమెచేసిన దేశసేవను, త్యాగమును ప్రశంసించినవా రగుదురు.

ఈపుస్తకము ప్రతులు కావలసినవారు ఈక్రింది చిరునామాకు వ్రాయవలయును—

కార్యదర్శి,

అన్నపూర్ణాదేవి స్మారకసంఘము, ఏలూరు,

పశ్చిమగోదావరిజిల్లా.

లేక

మాగంటి బాపినీడుగారు,

ఏలూరు.

అన్నపూర్ణకు బదులుగా

నాకుఁ దోడునీడయయి యుండుట కంగీకరించిన

# శకుంతలకుఁ

బరిణయ సమయమున

నొసంగిన

# పారితోషికము

అనుకూల దాంపత్యము

కలిగి

దేశసేవాపరాయణు లయిన

యువతీయువకులకు

ప్రేమపూర్వక మయిన

కానుక

# విషయసూచిక

# తొలిపలుకు

స్వవిషయములు ప్రకటింపవలెనన్న, మహాత్ముని వంటి లోకోత్తర పురుషుని ఆత్మకథగా వలె, లేక వీరేశలింగము పంతులు గారివంటి అసామాన్యపురుషుని స్వీయచరిత్రము బోలు అసాధారణ గ్రంథమైన కావలసియుండును. గ్రంథరచనలో స్వీయవిషయములు బహిర్గతమొనర్చుట దుర్ఘటము, అస్వాభావికము, అహంకారము. అందులో సతీపతుల ప్రేమలేఖల సంగతి చెప్పవలసిన దేమున్నది? ఆదర్శదంపతులని అంపరు అభినందించిన వారి లేఖలు వారి కాలము దాటిన పిమ్మట బయలుపరచుటకు సంకోచింపఁబనిలేదు. అదృష్టమో, దురదృష్టమో గాని, ఇందులో ఒకరు అస్తమించిరి. అస్తమించిన అర్ధాంగి బ్రతికిన కొలదికాలము బళే యనిపించుకొని పుణ్యజీవితయై ధన్యురాలయ్యెను. ఇక ఈదీనుఁడు ఈ స్థితియం దుండె. దేశీయులందరిని ఆకర్షింపగల్గిన ఆదర్శజీవి అన్నపూర్ణ. నాస్థితిలో నున్న యితరులకు జాబులు ప్రకటించుటకు సంకోచము సహజము. దంపతులలో నొకరి లేఖలనే చదువుటచే చదువరులకంపలి ప్రాణ్యాపక సంపర్కములు తెలియక, దురభిప్రాయమునకు అవకాశము గలదు. ఇట్టి యాపేక్షలు గొనువారికే సాధారణముగ దీనాభిప్రాయపడుట కద్దు. మరి కొందరు స్వవిషయముల ప్రకటించుట ఆత్మస్తుతియని తలంచవచ్చును. ఇది కేవల సాహసమని మరికొందరు యూహింపవచ్చును. అయినను హితోత్తములు ప్రమురించి ఆంధ్రులపాత్రంజేయుటకు ఈ క్రింద వివరించిన కారణములచే అవసరమగు విధియను విశ్వాసముతో దేశీయులకు సమర్పించుచున్నాను:

౧. ఏనాడు దేవి దేశారాధనమునందు ప్రాణసమర్పణకాపించి వదో, అప్పటినుండియు, ఆ అన్నపూర్ణ నాఅన్నపూర్ణయేగాక, మన అందరి అన్నపూర్ణ అయినది. ఆమె సుస్తులు, ఆభరణములు, ఆరోగ్యము, ప్రాణము, దేశమునకు సమర్పింపఁబడినపుడు ఆమె గ్రంథములు, ఉత్తరములు దేశసంపత్తి గాకుండు టెట్లు? తాను లేనిలోపము చే తన తల్లియగు కలగరపిచ్చమ్మగారిని, తన మూడేండ్ల ముద్దుబిడ్డయిన ఝాన్సీని కూడ కారాగృహమునకు బంపియుండె.

౨. నీవు సామాన్యజీవియైనప్పటికి ఆదర్శఅర్ధాంగి అట్టిది, గాదు. "ఎంతయో ధైర్యము, చిత్తశుద్ధి, దేశభక్తి గలిగి, నిశ్చల భక్తితో ఫలాపేక్ష వదలి దేశసేవచేసి, భారతపురంధ్రులలో తనకుగల పుత్రికలలో అత్యుత్తమురాలని భావించుకొను భాగ్యము" తనకు గలదని మహాత్ముఁడు వ్రాసెను. స్త్రీలలో ఇంతవర కిట్టి ప్రశంస పొందినవా రెవరును లేరు. ఇది ఆంధ్రనారీమణుల మహాభాగ్యము. ఇట్టి అత్యుత్తమురాలి మనోవికాస మెట్టిదో తెలిసికొనుట పురుషుల కెట్లున్నను స్త్రీలకు అవసరము. కారణము: ఈజాబులలో విద్యాకాంక్ష, వాతావరణ ప్రభావము, పండితుల స్నేహము, దేశారాధకుల సహవాసము, దేశసేవకయి వజ్రసంకల్పము, త్యాగము, చివరకు ఆత్మసమర్పణము, తన కథ తానే చెప్పుకొనును.

3. భార్యాభర్తల ఆదర్శజీవితము, దాంపత్య సౌఖ్యము స్నేహము, ప్రేమ కనబడుటయేగాక, సదుద్దేశము లున్న ఆదరించి ప్రోత్సాహపరచిన స్త్రీరత్నములలో ఉత్తమురాండ్రయ్యెదరో సజీవమగు దృష్టాంత మిందు గలదు.

౪. స్త్రీలకు స్వాతంత్ర్య మియ్యరాదని పూర్వాచారపరాయణులు ఘోషించినను హిందూగృహమందు ముఖ్యవిషయములందు నిర్ణయవచనము గృహలక్ష్మిదే. ఒకప్పుడు శక్తిస్వరూపిణియగు స్త్రీ అట్టిశక్తి దుర్వినియోగముచేయుటగూడ కలదు. ఇచట సద్వినియోగముచే సంఘమునకు దేశమునకెంతమంగళప్రదమో తెలుపుచున్నది. (I wish that many wives will acquire by their purity, single-minded devotion, the gentle but commanding influence, Annapurna Devi acquired over her husband) “ఆమెనుబోలు, భారతనారీమణు లెల్లరు పవిత్రస్వభావులై, పతివ్రతలై అనురాగబలముననే తమ భర్తల ననుకూలురుగను, సన్మార్గప్రవర్తకులుగను గావింపవలయు”నని మహాత్ముడు చెప్పినట్లు హితోపదేశము చేసికొనుచున్నట్లు తలంపకయు, పరస్పరజీవితములం దెట్లు మార్పుకలుగునో ఇవి ఈకాలపుయువతీయువకులకు మార్గదర్శకములు అగునని యోచించి, వారిముందు ఉంచబడినవి.

౫. స్త్రీలహక్కులు, భార్యాభర్తల ధర్మములు, విదేశవిషయములు సామాన్య హిందూస్త్రీకి సహజమగు కోపము, అసూయ, బలహీనత, స్త్రీహృదయము, మానవస్వభావము ఇందు వ్యక్తీకరింపఁబడినవి.

ఇంతకంటె ప్రచురణకు మూడు ముఖ్యకారణములు కలవు:

(౧) ఇంగ్లీషు, బెంగాలీ, హిందీభాషలలో నున్నట్లు తెలుగు భాషలో లేఖలు లేవు. ఒకవేళ నున్నను నిజమైనవి, ఆదర్శమైనవి గావు. దేవి భాషాసేవ కివి యూతగ నుండవచ్చును.

(౨) భారతిలోను, ఆంధ్రయువతీసంఘమువారు ప్రచురించుచున్న "అన్నపూర్ణాదేవి గ్రంథములయందలి వేంకటసీతమ్మగారి అన్నపూర్ణాదేవి జీవితమునందును, త్రివేణిలోని వ్యాసములందును దేవిజీవితము ఆంధ్రలోకమునకు కొంతవరకుఁ బరిచితమయినదిగాని ఈపత్రములలో నామె నిజహృదయము విస్పష్టముగా ప్రకటితమగును. ఈయుత్తరములు వ్రాయునపుడు ఎప్పుడైనను ప్రచురణమునకు వచ్చునని కలలోనైన దేవి భావించియుండదు. అందుచే ఆమె నిజవృత్తాంతము ఆమెవల్లనే విను భాగ్యము మనకు కల్గినది.

(3) ఆంధ్రదేశమందు ౧౯౨౦ మొదలు ౧౯౨3 వరకు రాజకీయాందోళనచే ఆంధ్రుల హృదయ మెట్లు మథించబడెనో, గాంధితత్త్వ మెట్లు యువతీయువకుల నాకర్షించి, మహాయుద్ధమునందు దుమికించెనో, ఫ్రూస్ట్రుచ్చినట్లు ఈయుత్తరములలో చిత్రింపబడెను. ఈవికాసచిత్రపటము ఆంధ్రులయెదుటఁ బెట్టు భాగ్యమునకు నోచిన నేను ధన్యుఁడను.

ఈ లేఖలలో ఇంతవిలువ యున్నదని, అన్నపూర్ణ అస్తమించిన పిమ్మట దుఃఖసముద్రములో మునిగియున్నప్పుడు, మనస్సు కుదుటబడక మనశ్శాంతికై కట్టలువిప్పి మరల చదువువరకు నాకును తెలియలేదు. ఈలేఖలు చించివేయక దాచిపెట్టినది ఈ ఆస్పృష్టహీనుని, ఈ మనశ్శాంతికొరకు గాబోలు.

అమెరికాలో నున్నపుడు వ్రాసిన పదునొకసంవత్సరములతో పాటు కలకత్తాలో బ్రాహ్మబాలికాశరణాలయమున ౧౯౧౪ సం॥ చదువుచున్నప్పటి లేఖలు, మదరాసునందు మెట్రిక్యులేషనులో

గాంధియుద్యమము — అందామె స్థానము.

తత్ఫలితము.

సర్వతోముఖమగు నామె లౌకిక, ఆధ్యాత్మికహృదయమును ఆంధ్రపాఠకలోకమునకు బరిచితముచేయు సంకల్పముతో నేను ఆమె లేఖల భాషగాని, భావములుగాని లేశమేని సంస్కరింప బూనికొనలేదు.

లేఖలప్రచురణ కనేకమంది తోడ్పడిరి. కొంతమంది స్నేహితులు ప్రచురణార్హమని ప్రచురణకు ప్రోత్సహించిరి.

గౌడవాఙ్మయబ్రహ్మ శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు ఉత్తరములన్నియు ప్రతులువ్రాసిపెట్టియు, ఏయేభాగములు వదలివేయవలెనో సలహానిచ్చియు విశేషముగ దోడ్పడిరి. శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారు కడమాట వ్రాసి సహజమగు స్త్రీవిద్యాభిమానమును, స్వతంత్ర భావప్రియత్వమును, మాదంపతులయందుండు వాత్సల్యమును నెల్లడించిరి. విశాఖపట్నములో అన్నపూర్ణాదేవి స్నేహితురాండ్రును, స్త్రీవిద్యాభిమానులగు నారీమణులు కొందరును ప్రచురణకై కొంతధనమును వసూలుజేసి సహాయమును జేసిరి. ఇంకను కొంతమంది ఆంతరంగికమిత్రులు ఇతరసహాయముల చాలజేసిరి. వారి పేరులను బ్రకటించుటకు వారికిని నాకును ఇష్టములేదు. వీరందరికి వందనము లర్పించుచున్నాను.

పూజనీయులగు దేశోద్ధారక శ్రీనాగేశ్వరరావుగారు సహజౌదార్యముతో ఈప్రచురణమునకు మిక్కిలి సాహాయ్యము జేసిరి. బ్లాకులను జేయించుటకును, పరిశిష్టమును ముద్రించుటకును గ్రంథమున

కింక ననేకములగు మెరుగులు గలుగుటకును వారే కారకులు. వారికి నాకృతజ్ఞతాపూర్వకవందనములు.

ఈ లేఖల నాంధ్రదేశ మాదరించినచో మిగిలినవి (నేను వ్రాసినవి కలసి) సేకరించి ద్వితీయముద్రణమున బ్రచురింపబ్రయత్నించెద.

ఇట్లు విన్నవించు:
మాగంటి బాపినీడు.

# బాపినీడుగారికి మహాత్ముడు వ్రాసిన లేఖ

---

ఈ దుఃఖకరమగు విషయమును గురించి నాకేమియు తెలియదు. ఆ క్రిందటి రోజుననే ఆమె యెట్లున్నదని దేశభక్తునికి వ్రాసితిని. ఆమె మామూలు వలె జబ్బుగానున్నదని ఆయన నాకు తెలిపెను. ఇట్టి స్థితిలో తంతిని చూచుకొని నిర్ఘాంతపోతిని.

మీకు ప్రియమైన భార్య పోయినయెడల, నాకు ప్రియతర మైన కుమార్తెయే పోయినది.

మీరు ప్రగాఢముగా ప్రేమించిన అన్నపూర్ణ మరణింపలేదని మీరును నావలె విశ్వాసము కలిగియుండవలెను. ఆమె శరీరధారిణియై మనల ప్రబోధింపజాలనుగాన, ఆమె వినాశమగు ఆత్మనల్లనే పూర్వముకంటె ఎక్కువ జాగరూకతతో మన బాధ్యతలను జ్ఞాపక ముంచుకొనవలసి యున్నది. మీరు ఆమెమార్గము నవలంబించి ఆమెకుగల అనేక పవిత్రాశయముల నెఱవేర్చెదరని యాశించుచున్నాను.

౧౯—౧౦—౨౭. ఎం. కె. గాంధి.

# 'మహాత్ముని ప్రశంస'

---

ప్రప్రథమమున ౧౯౨౧-వ సంవత్సరములో బెజవాడయందు జరిగిన స్త్రీమహాజనసభయందు ఖద్దరువస్త్రములను ధరించిన యీపిల్ల యొక్క తెరయే సభానిర్వహణభారమును వహించి క్రమమును నెల కొల్పుచు ఓపికతోను, నిశ్చయముతోను దిరుగుచుండఁ గాంచితిని. తన విలువగల యాభరణముల నన్నిటిని బంగారుగాజులను బరువయిన బంగారు గొలుసును ఇచ్చివేయుటయందు నాకు జ్ఞప్తియున్నంత వఱకు ఈమెయే ప్రథమురాలు. ఆ యాభరణములను నా కందించు నప్పుడు 'నీతల్లిదండ్రులు దీనికనుమతించిరా' యని యామెను నే నడిగితిని. 'నాతల్లిదండ్రులు నాస్వేచ్ఛ నరికట్టరు. నాయిష్టము వచ్చినట్లు నన్ను సలుపనిత్తురు.' అని యామె సమాధానమును జెప్పెను. అన్నపూర్ణాదేవి ఆంగ్లభాషను ప్రావాహికముగ మాటాడఁ గలిగెను. కలకత్తాయం దామె విద్యనభ్యసించెను. గొప్పదగు నా స్త్రీసమాజములో విరాళములను ప్రోవుచేయుటకు దిరుగుచు నాభరణములను, ద్రవ్యమును దెచ్చియిచ్చినది. అప్పటినుండియు నుద్యమములో నామె సంబంధమును గలిగియున్నది. అంతియకాదు, ఉద్యమమునకు ఆత్మార్పణము గావించినది.

ఒక విశ్వాసముగల భక్తురాలు పోయినకంటె గూడను నా కామె మృతివలన నెక్కువ నష్టము వాటిల్లిన దనుట నిశ్చయము.

భారతదేశమునం దంతటను నా యదృష్టవశమువలన నాకుఁ గల్గిన చాలమంది కొమారితెలలో నొకతె పోయినది. వారిలో నీమె యత్యుత్తమురాలు. ఈమె దృఢవిశ్వాసముతో పొగడ్తనుగాని, బహూకరణమును గాని అభిలషింపకయే కృషి సల్పుచుండెడిది. పవిత్రతవలనను, పాతివ్రత్యమువలనను అన్నపూర్ణాదేవి తన భర్తపయి నెట్లు మృదువయిన యధికారమును సంపాదింపఁగలిగెనో యట్లే అనేకగృహిణులు తమ భర్తలపయి నట్టి యధికారమును సంపాదింపవలెనని నేను గోరుచున్నాను. మాతృదేశమునకు సేవ సల్పుటవలనఁ దన శరీరమును అన్నపూర్ణాదేవి క్షీణింపఁజేసికొనినందులకు బాపినీడుగారు నన్ను మృదువుగా మందలించుటను నేను మెచ్చుకొనుచున్నాను. ప్రాచీనకాలమున మనదేశ మనుభవించుచుండినట్లు అనేకులు చెప్పు స్వాతంత్ర్యమును మన దేశము తిరిగి పొందుటకుఁగాను అనేకులగు యువతీయువకులు ఈమెమార్గము ననుసరించి తమ జీవితములను నిజధర్మాచరణమునకు ధారవోయక తప్పదని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను.

---

# అన్నపూర్ణాదేవి లేఖలు



## ప్రథమ లేఖానువాదము

బ్రాహ్మ బాలికాపాఠశాల
కలకత్తా
**16-8-1914**

నా ప్రియమైనమామా,

నీ యభిమానసూచకమగు జాబును చాలసంతోషముతో నందుకొంటిని. కాని నేను ముందుగ జవాబు వ్రాయలేకపోతిని. నేను కులాసాగానున్నాను. నేను నాచదువును జాగరూకతతోఁ జూచుకొనుచున్నాను. నేను యెమ్. యస్. చౌదరిగారి కొకజాబు వ్రాసెదను. ఇప్పుడు నేనొక వారపత్రిక నందుకొనుచున్నాను. ఇంగ్లండు జర్మనీదేశముల కొకయుద్ధము జరుగునను సంగతి నీకు తెలియునని నే భావించుచున్నాను. వస్తువులధర హెచ్చయినది. నీవెట్టులఁ జదువుకొనుచున్నావు? దయచేసి త్వరలో జవాబువ్రాయవలెను. నీజవాబున కెదురుచూచుచున్నాను. నేనిప్పుడభినందనములతో నుత్తరము ముగించవలసియున్నది. పరిహాసపట్నమునుంచి యేమైనను జాబులందుచుండెనా. ప్రేమతో నేనుందును

ఇట్లు ప్రేమగల మేనకోడలు,
అన్నపూర్ణ.

ఏలూరు
12-7-1916

## రెండవ లేఖానువాదము

ప్రియమైన మామా,

మీరు దయతో వ్రాసిన లేఖ చేరినది. సంతోషము. కాని మీరు జ్వరపీడితులై యున్నారని వినుటకు విచారించు చున్నాను. మీరిప్పుడెట్లున్నారు? నేటివఱకు నేను నానేత్రము లకుఁ జికిత్స చేయుచునేయున్నాను. 'మే' పాఠశాలజీత మామె కిచ్చివేసితిని. 'జూన్' మాసము జీతముకూడ మన మీాయవల సియుండుననియే తలఁచెదను. ఆమెకు దానినిగూర్చి పిదప వ్రా యుదును. అమ్మమ్మ కుశలము. మేమందరము మీాకొఱకై యాతురపడుచున్నారము. మాకే లేఖలు వ్రాయుచుండుడు. ఆరోగ్యమునుగూర్చి శ్రద్ధవహింపుడు. "ఆరోగ్యమేమహాభా గ్యము" మీాసంతోషవార్త తెలుపుచున్నందులకు మేమందర ము సంతసించుచున్నారము. అమ్మ యెప్పటివలెనే యున్నది. జ్వరము సయితము వచ్చుచున్నది. ఆమె యిపుడు కొంచెము బాగున్నది. నాయన కొంచెము బాగుగనేయున్నాడు. ఆయన కూడ జబ్బుపడియుండెను. నేను క్షేమము. కొన్ని దినములైన పిదప విశేషము లన్నియు వ్రాసెదను. మేమందరము మీా జ వాబుకయి ప్రతీక్షించుచున్నాము. మీానూతన ద్వితీయ వత్స రమెట్లు గడపుచున్నారు? మీారు కళాశాలకుఁ బోవుచున్నారా?

మీాయొక్క ప్రియమైన
అన్నపూర్ణ

## మూడవ లేఖ

**Bentic High School,**
**Veperi, Madras.**
**12-7-18**

నేనిప్పుడెక్కడనున్న సంగతి మీకు బహుశా తెలిసి యుండదు. నేను సోమవారము బయలుదేరి మంగళవారము రోజున సీమహాపురము చేరితిని. తత్క్షణమే మాంబళము వెళ్లితిని. బుధవారము క్రిస్టి కేర్ హైస్కూలునకు వెళ్లితిని. కాని యా రోజునం బరీక్ష చేయనందునవలన నాహాస్టలులో రెండు రోజు లుండవలసివచ్చెను. పరీక్షచేసి ఫిట్ కాలేదని చెప్పినందువలన నితర స్కూళ్ల ప్రయత్నము చేయవలసివచ్చినది. క్రిస్టియన్ పాఠశాలల భోజనము సరిగానుండదని మైసూరు ప్రయాణమైతిమి. మైసూరులో స్కూలుఫైనలుకు చరిత్ర, మఱియు సర్థశాస్త్రము తీసికొనవలసివచ్చినందున మరలం దిరిగివచ్చినాను. ఇప్పుడక్కడ కుట్టుపని మఱియు తెలుగు అభిమాన విషయములుగా స్కూలు ఫైనలుకుం జదువుచున్నాను. ఇక్కడ నందరు క్రిష్టియన్సు. శ్రీ సుబ్బుకృష్ణయ్యగారితో వివాహము కాంబోవు పత్నియొక్క మరదండ్రు నలువు రిచ్చట నున్నారు. వారికి నాకు వేఱుగ భోజనము పెట్టుచున్నారు. ఈసంవత్సరము పరీక్ష యేమగునో భయముగనున్నది. ఇక్కడ నందరి యుత్తరములు చించి చూచెదరు. ఎవరి చేతులలోనైనంబడిన అందరు చూచెదరు. కనుక

జాగ్రత్త. నాకు ఎంగేజిమెంటు అయినదనియు, ఉత్తరములు చూడవద్దనియు చెప్పుఁడని శ్రీరాఘవచంద్రయ్యగారినిగోరితిని. ఆయనకుచెప్పగా నీయుత్తరములు ఎవరి చేతికి వెళ్లనీయమని యు నేను రూల్సు ప్రకారము చించి చూచెదననియుఁ జెప్పి నారు. మరియుఁ దెనుగులో వ్రాసికొన్నట్లయితే నాకేమియుఁ దెలియదు గనుక అట్లు వ్రాసుకొమ్మనిచెప్పినది. మనకింత సాయ ము చేసినందులకు దేవునికెన్నియో వందనము లర్పించు చు న్నాము. కనుక మీ రెక్కువ వ్రాయవలయునన్నవన్నియు తె నుఁగులో వ్రాసికొనవచ్చును. ఇన్నిరోజులనుండి మీఉత్తరము రాకపోవుటవలన నాకు చాల విచారముగానున్నది. కనుక మీ కుత్తరమందిన వెంటనే జవాబువ్రాయఁ గోరెదను. మీరిప్పు డెక్కడనున్నది వెంటనే యన్నిసంగతులు తెలియఁ గోరు చున్నాను. క్రిష్టమసు కిక్కడ నెవరు నుండరట. అప్పుడు ఏ లూరు రావలసియుండును. నాన్నగారు నిన్ననేవెళ్లినారు. ఇన్ని రోజులు నాకొంటకు కష్టపడవలసివచ్చినది. చాలా జబ్బుచేసినది. రాఘవచంద్రయ్యగారికికూడ జబ్బుచేసినది. విశ్రాంతి లేకుండా అధికముగాఁ దిరుగుటవలన చాలా బాధపడుచున్నారు. అంద రిని నేను కష్టపెట్టుదాననేకాని సంతోషపెట్టుదాననుగానైతిని. మీరుత్తరములు వ్రాసినపుడు కవరుపైన మీదగ్గరనుంచి వచ్చినట్లు వ్రాయ కోరెదను. అట్లయితే యెవరును చూడరు.

మీయుత్తరముకొఱ కెదురుచూచుచున్నాను. వెంటనే వ్రాయ కోరెదను.

ఇట్లు,

మీ ప్రియురాలు.

**Anne** (అన్న)

### 4-వ లేఖ.

**ఏలూరు,**

**14-8-18.**

ప్రియతమా,

మీకు నిన్న నొక యుత్తరము వ్రాసియుంటిని. అది అందియుండవచ్చును. మీకు నిన్ననే వ్రాసినప్పటికి మరల నీ రోజుననే వ్రాయుచున్నాను. నిన్న వ్రాసిన లేఖయందుండు సంగతులు మీరు విశదముగా నాలోచించుఁడు. తొందరపడి మఱల నన్ను నిందింప యత్నింపకుఁడు. ఇప్పుడే నా మనస్సు బాగుండలేదు. మరల నన్నవమానపరచుచు వ్రాసినయెడల నెట్లుండునో మీరే యాలోచింపుఁడు. నేను వ్రాసిన విషని యము కేవలము నా లాభముకొఱకే కాదు. ఇంద [illegible] లాభమును బొందుదురు. ఏ విధముగానైనా [illegible] గారిదగ్గర నము చేయఁగలిగితే మీబాకీ తీర్చుకొందు [illegible] షట్లాండల మాత్రము నా ముద్దు చెల్లింపండి [illegible] కొన్నాను. 6 చిత్త కేవలము నీనగలు నా సౌందర [illegible] నో యేకంపెనీలోనై నఁ

మీకు దేనికయిన అడ్డుపడును. నా యుద్దేశ్యములన్నియు మీ రెవరికి తెలియఁజేయవద్దు. మీ నాయనగారు మొదలయినవారికి నేను పెండ్లివిషయమయి తొందరచేయుచున్నట్లు యేమాత్రము వ్రాయవద్దు. మీ రేవిధముగ వ్రాసినను వారు నే నిందులకే చదువు మానివేసితినని యనుకొందురు. నా శరీరస్థితి బాగుగానుండకపోవుటవలన మానివేసినానని యనుకొనరు. నన్ను నమ్మరు. నేను చిక్కులలోఁ బడెదను. చదివితే తలపోటు యెక్కువగుటవల్లను, వృథాకాలయాపన చేయవలసి వచ్చుచున్నందువలనను నా మనస్సు యెప్పుడును మీమీఁదనే యుంటున్నది. మీరు సెలవులలో రాదలచుకొన్నారు గనుక తప్పక వివాహమాడ కోరెదను. తక్కిన స్థితిగతులు చూచిన నెంత త్వరితముగానయితే అంత మంచిదని తోచుచున్నది. నా చదువు యేలాగును అడుగంటినది. పెండ్లి చేసికొన్న నేమియు నష్టముండదు గదా! ఏదిఎట్లున్నను నేను చదువు మానివేసి వృథాకాలయాపన రాఘవుని పత్నిని కానని నమ్మఁడు. ఇప్పుడుకూడా నా చదువు అధికముగాఁ గొనుటకు నానావిధముల ప్రయత్నించినను నారిని నేను కష్టపెట్టుచుటలేదు. ఎప్పటికిని ఈ తలపోటిట్లేయుండి మీరు త్తరములు వ్రాసునీయ దేమోయని ఖేదపడుచున్నాను. వచ్చినట్లు వ్రాయ కోరెదను. వివాహసంస్కరణమును గురించి

మీ కేమి యుద్దేశ్యమో తెలియఁజేయగోరుచున్నాను. వివాహమును గుఱించి శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి యుద్దేశ్యమేమిటి? ఏ విధముగ నైతే బాగుండునని చెప్పినారు? ఆయననే ఆచార్యులుగ, పురోహితునిగ నియమించిన బాగుండునని తోచుచున్నది. మన కమ్మవాళ్లలో మరి నాయుళ్లలో నంత ప్రసిద్ధికెక్కినవారు లేరుగదా! మీ యుద్దేశ్యమును దెలియజేసినయెడల నా యుద్దేశ్యములు వివాహపుమార్పులను గురించి తెలియఁజేసెదను. మీరు నామాట వింటే నేను మీమాట వినెదను. ఒకరిమాట యొకరికి కలియకపోతే చిక్కులుండునని తెలిసికొనుఁడు. ఆడవాళ్లే మగవాళ్లమాట వినవలెనా? మగవాండ్రు ఆడవాండ్ర మాటలు వినకూడదా? జబ్బుగానుంటే మాత్రము చదువుకొనవద్దాయని మీ యన్నగారు అడిగినారు. ఈ తలపోటులో నెట్లు చదువుకొనుట? నేనీ సంగతిని వ్రాసితినని యెవరికిని జెప్పవద్దు. నాకంటె మీకు వివాహపు తొందర చాలరోజులనుండి యున్నదికదా! నా మాటలు విన్నందువలన నేవిధమయిన కష్టముండునని మీకు తోచిన వినవద్దు.

Anne (లు. గారిదగ్గర
వ. మట్టాండల
ఎకొన్నాను. 6 చిత్ర.
నో యేకం పెనీలో నైనల

## 5—వ లేఖ.

ఏలూరు,

22-8-18.

నా ప్రియమైన నీడూ,

మీరు వ్రాసిన యుత్తరమందినది. సంగతులు విశదమైనవి. మీకు తొందరపడి వ్రాసితిని. కాని తరువాత నేనే ఆలోచింపఁ దొడగితిని. మీరు పరీక్ష ప్యాసు కాగలిగియుంటే సెలవులలో రావద్దు, ప్యాసయ్యెదరని నమ్మకముంటే సెలవులలో నక్కడనే పట్టుదలతో చదువగోరెదను. వివాహమునకు పూర్వము విద్యలోనే గాక గానపాక శాస్త్రములయందు గూడ మీకు దగిన వధువుగా నుండ ప్రయత్నించెదను. జర్మనులు ఆఫ్గన్‌స్థాన్ వరకు వచ్చినారట. నిజమేనా? మీరు వెళ్లవలెనా? అన్ని సంగతులు వెంటనే తెలియపరచగోరుచున్నాను. మేమిప్పుడు చాటపఱ్ఱు వెళ్లుచున్నాము, తొందరగా వ్రాసినాను. బండి వచ్చుచున్నది, అందుచేత పెద్ద యుత్తరము వ్రా లేకపోయినాను, తరువాత ఇంకేమైన సంగతులున్నయె అధికముగ వ్రాసెదను,

రిని నేను కష్టపెట్ట

మీరు త్తరములు ప్ర

వచ్చినట్లు వ్రాయ కోరె

ఇట్లు మీ

(అన్న)

## 6 వ లేఖ

ఏలూరు,
3-9-18.

ప్రియుడా,

మీరు వ్రాసిన యుత్తరము యథాసమయమున అందినను వెంటనే వ్రాయనందుకు క్షమించగోరెదను. విశేషముగు పనితొందరవలన మీకు జాబు వ్రాయలేకపోతిని. నేనేమిచేయుచుంటినో వినిన మీరు మితిమీరిన సంతోషమునుపొందెదరు. బాలుర కుపయుక్తముగ నుండునట్లొక బాలరామాయణమును రచించితిని. స్కూళ్లలో పెట్టవచ్చునట. నాల్గవ తరగతినుంచి ఏడవతరగతి వరకు పనికి వచ్చునట. నిన్ననే వ్రాయుట ముగించితిని. మొదట కొంచెము వ్యాకరణపు తప్పులు వచ్చెనని వారు చెప్పిన తర్వాత నెక్కువ రాలేదు. అయినను నిదియే ప్రథమ ప్రయత్న మగుటవలన కొంచెము తప్పులున్నవి. ఎవరు నాకు సాయముచేసినను నొక్క వ్యాకరణముననే యని నమ్ముదు. అది అందరకు వచ్చు రేఫ, శకటరేఫలు, అర్ధబిందువులే. రాజాగారి పండితు లొకరు శుద్ధప్రతి వ్రాయుచున్నారు. తరువాత నేను వ్రాసి యచ్చుకు పంపించెదను. మా నాయనగారిదగ్గర డబ్బులేదు. ఏమిచెయ్యవలెనో తెలియుటలేదు. షట్కాండలలోను ఒక్కొక్క చిత్రపటము వేయదలచుకొన్నాను. 6 చిత్తరువులకు వెయ్యేసి చొప్పున నెంతయగునో యేకంపెనీలోనైన

దెలిసికొనుఁడు. వాళ్లు చిత్రములను బ్లాకులుచేసి మన కిచ్చిన యెడల నెంత దీసుకొనెదరో యడుగుఁడు. అలాగయిన మన యిష్టమువచ్చినపుడెల్ల మనమే యిక్కడ అచ్చు వేయించుకొన వచ్చును. మీ బెంగాలి స్నేహితుల నెవరినైన దీసికొని లేక భట్టాచార్య అండ్ కో., యెక్కడయినా వెళ్లి తెలుసుకొని యేసంగతి వెంటనే తెలియపర్చ గోరుచున్నాను. కవిత్వము, సంస్కృతము నేర్చుకొన్న త్వరగా వచ్చునని పండితులు చెప్పినారు. కవిత్వము నేర్చుకొన్న చాలాబాగుండును. పెండ్లి యయిన తర్వాత బాగుగ ఏమియు రాదు. అన్నియు యిప్పుడే నేర్చుకోవలెను.

(అన్న.)

## 7వ లేఖ

ఏలూరు,
26-9-18.

నాప్రియమైన సీతా,

మీయుత్తరము యథాకాలంబున నందినప్పటికి మనస్సు స్థిమితములేకను తీరికలేకను త్వరితముగ జవాబివ్వజాలకపోతిని. నాహృదయమందేదియో ఆఘాతము తగులుటవలన భారముగానున్నది. నాయూవందనును సహింపలేక యెవ్వరో నాకోరికలను భగ్నపరచ నుంకించుచున్నట్లున్నది. నాజీవనము నిష్ఫలమౌనని స్పష్టముగ తోచుచున్నది. మనస్సెంత చలత

చెందిననేమి? దైవలిఖితంబు నెవరు తప్పింపగలరు? నేను ఆజన్మ దురదృష్టవంతురాలను. మానవులు కోరిన కోర్కెలన్నియు నెఱవేఱకపోవుట సహజమయినప్పటికి నొకటిగాక నొకటైనను నెఱవేఱుచున్నదిగదా! నాకన్ననో యిదివరకు ప్రయత్నించినది సాగలేదు. ఇక భవిష్యత్తుజీవనము గురించి తలంచినచో యంతకంటెను నిరాశాజనకముగనున్నది. నావంటి నిర్భాగ్యురాలింక నెవరైనా లోకంబున నున్నారా? లేక నేనేనా? ఇప్పుడు నన్నింత ఖిన్నురాలను జేయుచున్న హేతువు పదిహేను మాసముల క్రింద తటస్థించిన నాకింత దుఃఖ ముండక పోయెడిది. యౌవన ప్రాప్తురాల నయినప్పటికిని నత్యంత సరళ బాలికవలెనుంటి. అట్లుండిన నాకెంత యాహ్లాదకరముగ నుండెడిది! ఇవన్నియు సంభవించుచుండ నేనెట్లు సౌఖ్యవంతురాలనగుదును? జరుగనున్నది జరుగును. ఎవరేమి చేయఁగలరు? విధికృత మెట్లున్నదో? మనకెన్ని యాటంకములు సంప్రాప్తించుచున్నప్పటికి అవన్నియు మన మేలుకొఱకే భగవంతుడు చేయుచున్నాడని మధ్య మధ్య మనస్సునకు తట్టుచున్నది. ఆత్మగౌరవము, నిజ సుఖములు జరుగకపోయినప్పటికి సంఘమునకు సహాయకారిణినైనె మంచిప్రవర్తన గలదాననైన వీనియన్నిటికి విచారింప పనికాదు. దైవము మంచిబుద్ధి ప్రసాదించి నన్ను గౌరవ పాత్రురాలనుగ చేసినచాలును. ఇదియే నామది కోరిక. నేనిదివరకు కోరినవి యిక సమకూరుటెట్లు?

చిత్రపటముల కింక నివ్వలేదా? ఇవ్వకే ప్రస్తుత మూరు కోండి. మనము ఆర్డరు యిస్తే వారము రోజులలో తయారు చేసి యివ్వగలరా? బజానా కావలిస్తే పంపించెదను. శ్రీరాఘవచంద్రయ్యగారు 3,4 తారీఖులలో వచ్చెదరు. 5—వ తేది మరల వెళ్లెదరు.

ఇట్లు మీప్రియమైన,
అన్నము.

## 8-వ లేఖ

ఏలూరు,
11-11-18

నాప్రియమైన సీడూ,

మీ సంతోషదాయకమగు లేఖ చేరినది. సంతోషించితిని. శ్రీయుతులు యం. సూర్యనారాయణ బి. ఏ. గారియొద్ద నుండి పుస్తకములు నాకు చేరినవి. నేను యెట్లుపట్టు బట్టయు దారమును నాసోదరి కిచ్చితిని. నేను గోరా రెండవ భాగము చదువుట ముగించితిని, కాని రవి బాబుయొక్క యున్నతాభిప్రాయములను నేను గ్రహింపఁ జాలనైతిని. కాని యది పెద్ద గ్రంథము. అది దేశభక్తి పరిపూర్ణమును హిందూమత సిద్ధాంతయుతమును నగుటచే నాంధ్రులకెంతయుఁ బ్రయోజనకారి యని తలంచెదను. నేను దీనిని మిక్కిలి ప్రేమించెదనుకాని దీని యందలి కొన్ని యున్నత భావములను నేను గ్రహింపలేకపోయితిని.

నాయుఁడుగారు తెనుఁగు యెందులకు మాట్లాడఁ జాల రో నాకాశ్చర్యముగ నున్నది. ఆయన కొన్ని వాక్యములనైన మాట్లాడలేఁడా? మాట్లాడఁ జాలకున్నఁ గొన్ని వాక్యములయిన మాట్లాడ ప్రియత్నించుట కష్టమా? అచట నాయుఁడుగారు, రామసామిగారు తప్ప నెవరును లేరా? నాయుడుగారు బ్రహ్మ మతావలంబులు. ఆయన మన పురోహితులుగానుండి వివాహ క్రతువు నడుపుట కంగీకరించిన మన హైందవ వివాహమునకు ప్రజలేమనుకొందురు? మన పురోహితుఁ డొక యాంధ్రబ్రాహ్మ ణేతరుఁడుగ నుండవలెనని నాకోరిక. ప్రస్తుతము విశేషము లే మియు లేవు. నాసోదరి కమల హారియన్ను తలనూనె కావలెన నుచున్నది. దాని వెల యిచట రూపాయి. ఆమె కది త్వర గాఁ బంపుడు. సర్కారుగారి తివాసీ విషయ మేమయినది. వారు రెండు పెద్ద తివాసీలు కోరుచున్నారా? వివరము వెం టనే మాకు తెలుపుఁడు. ఆయనకు నేను పిదప వ్రాయుదును. నా ప్రేమను గైకొనుఁడు.

మీ ప్రియమైన,

(అన్న)

## 9-వ లేఖ

(అనువాదము.)

20-12-18

ప్రియతమా!

మీ యుత్తరము చేరినది. మీ లేఖ చేరిన తత్క్షణమే మీకు జాబు వ్రాయవలెననుకొంటిని. కాని నేను కోరినట్లు

చేయఁజాలనైతి. ఇది నాయందలి దుర్బలత్వము. దీనినిగూర్చి నాకే తెలియకున్నది. ఉత్తరములు వ్రాయుటయందు నాకుగల సోమరితనమును విడిచి పుచ్చితిని. ఇపుడు నాకెట్టి సోమరితనము లేదు. నాజీవన సర్వస్వములగు మీయుత్తరములు వ్రాయుటకును నేనేల యాలసించుచున్నానో యాశ్చర్యముగానున్నది. నామనస్సు యిప్పుడు పుస్తకములు చదువుటకే కోరుచున్నది. పుస్తకములందు తప్ప మరి దేనియందాసక్తి లేదు. అయ్యో, కరుణించి హృదయపూర్వకముగా క్షమింపుఁడు. కోపమును జెందవలదు. కోపపడెదరా? నాయనుగ్రహమును మీరు కోరుచున్నట్లుగా మీ యుత్తరములో వెల్లడించియున్నారు. అయ్యో! అది యెన్నటికిని గానేరదు. స్త్రీలే మీ యనుగ్రహమునకయి నిరీక్షించుచుదురు గాని మీరు కాదు. అగునా? కాదా? మీరు నిజముగా నాయనుగ్రహమునే కోరుచున్నచో మీరు మిక్కిలి ఘనులు; నాకుఁ బ్రియులు. ఈక్రిస్టమసు సెలవులలో రాఘవ చంద్రయ్యగారు వత్తురు. మీరు మీ ప్రస్తుత పరీక్షయందుత్తీర్ణులైతిరా? మీ ముందుపరీక్ష వచ్చుచున్నది. పరీక్షకయి మీరు పాఠములు బాగుగ జదువుచున్నారా? నేనెల్లపుడును మీపరీక్షలనుగూర్చియే విచారించుచుందును. మీరీసంవత్సరము త్తీర్ణులు కానిచో మనము బోల్పూరులోఁ గలసియుండజాలము. నేనట వనేక విషయముల నేర్చుకొనఁ గోరుచున్నాను. యథాశక్తిఁ

ప్రయత్నింపుఁడు. నాకొరకును మన భవిష్యజ్జీవితమునుగూర్చి యు మీరు బాగుగఁ జదువండి. మీ రీపరీక్షలో నుత్తీర్ణులైనచో నపుడు నే నదృష్టవతినె. కేమెరా కొనవద్దు. మనకొకటి యున్నది. రెండవ దెందుకు? శ్రీ. గోపాలరావుగారియొద్దనుండి మనకు 100 పుస్తకములు రాఁగలవు. మీ స్నేహితులకు మీరు కానుకగా నొసంగుట కెన్ని పుస్తకములు కావలయును? నేను మీ స్నేహితులద్వారా పంపెదను.

ఇట్లు

మీ అన్న.

10-వ లేఖ

22-9-19

నా ప్రియమైన సీమా!

మీ లేఖ చేరినది. వందనములు. నా యారోగ్య మభివృద్ధిపొందుచున్నది నేను యీమాసాంతములో జనరలు వార్డున కరుగుచున్నాను. కాని మీరు నా పైకమును మా తండ్రిగారివద్ద నుంచవలదని తెలిపినారు. కాని తొలుతనే నేను నా తండ్రిగారి కిచ్చియుంటిని. మంచిది. నేనింక సేయను. శ్రీమతి యెస్తరుకన్య ప్రస్తుతము తిరుకోయిలూరులో లేదు. ఇకనుండియు నామె డెన్మార్కు మిషన్ సొసైటీ వారితో సంబంధమును గలిగియుండదు. ఈవారమందే యామె గాంధీగారి యాశ్రమములోఁ బని చేయుట కుత్తరదేశము వెళ్లుచున్నది.

ఆమె విలాసము:—

శ్రీమతి ఇ. ఫేరింగు కన్య,
సబర్మతీ ఆశ్రమము,

మీ అన్నె.

పరా:—మీ శాలువా, పక్కపాడి, కందువా రిజిష్టరుచేసి పోస్టుద్వారా పంపుచున్నాను.

## 11-వ లేఖ

ఆరోగ్యవరము, 8-10-19.

నా ప్రియమైన సీడూ,

మీ రెండుత్తరములు చేరినవి కాని నేనింతకంటె జవాబు దొలుత వ్రాయఁజాలనైతి. నా జాగునకు క్షమింపుఁడు, నేనొక వారమునుండి కొంచెము జ్వర పీడితనయి యున్నాను. నేనిపుడు బాగుగ నున్నాను. నాతండ్రిగారు నిన్ననే ఏలూరు వెళ్లియున్నారు. పరీక్షకయి మిక్కిలి పరిశ్రమతో మీరు చదువు చున్నందులకె నాకెంతయు సంతోషముగానున్నది. నేను చాల కాలము క్రిందనే మీకు రైల్వే పార్సలు పంపియుంటిని. అది మీకుఁ జేరెనా? నేను నాజీవితములో మీరు వ్రాసిన విషయ మును మరువను. మీకు దీర్ఘమగు లేఖల వ్రాయక మీచే మాట ననిపించుకొనుచున్నను, దానికంటె క్లుప్తమగు లేఖలను వ్రాయుటయే మంచిదని నాతలంపు. నన్ను నాశనముఁ జేసికొ

నుచున్నానని భావింపవలదు. పదిమందిచేఁ బరిహాసింపబడక స్తుతింపఁబడు దిన మొకనాడు నాకు రాగలదు. నాతప్పులెన్నడు లెక్కింపకుఁడు. నాయందాసక్తి లేనపుడు నాతప్పులకయి మీరు బాధ పడనలదు. నేను కేవల మొక్క యీశ్వరునిపైనే యాధారపడియుందును. ఆయన కరుణామయుఁడుగనున్న నేను శీఘ్రముగనో కొంచె మాలస్యముగనో విజయమును బడయఁ గలుగుదును. నేను లోకులను లెక్కింపను. కాని నాయభీష్టముల సిద్ధింపఁ జేసికొనుటకయి నేను ప్రయత్నింతును. మేము జనరలు వార్డునకు వెళ్లుటలేదు. ఇంకను వంటయిల్లు దొరకలేదు. శ్రీమతి యిస్తూరు కన్య తన చిరునామా నాకిచ్చినది, అంతకంటె నాకధిక మేమియుఁ దెలియదు.

మీ అన్న

నేనేమేని దోషము గావించియున్న క్షమింపుఁడు.

## 12-వ లేఖ

ఆరోగ్యవరము, 3-11-21

నా ప్రియమైన సీమా,

మీరు ప్రేమపూర్వకంబుగా వ్రాసిన జాబు వందనంబులతో నందుకొంటిని. నేను పార్శెలు యీదినంబున మరల బంపుచున్నాను. రోగులందరు చందాద్వారా రు400 పోగుచేసినారు. నేను బాగుగనున్నాను. ఇప్పుడు నేను 120 పౌనులున్నాను.

2

మేము మీ నాయనగారికి రెండు సంవత్సరములవరకు పెండ్లి చేసుకొనకూడదని డాక్టరు చెప్పినట్లు వ్రాయలేదు.

డాక్టరుగారు నన్ను రెండు సంవత్సరములవరకు వివాహమాడవలదని సలహా నిచ్చిరి. కాబట్టి నేను ఆకాశము వచ్చి భువిపై తిరిగిపడినను వివాహమాడనని సంకల్పించుకొంటిని. నాకిట్టి సదవకాశము కలిగినందులకు నే నదృష్టవతిని. కేవలము తృష్ణను దీర్చుకొనుటకుఁ గాక నేను జ్ఞాన మార్జించుటకే చదువ నెంచితిని. ఈవిషయమున నేనెవరిని దృప్తిపరచలేను. వివాహమును ద్వరలోఁ జేసికొని యీభయంకరమైన విరోధిని మరలఁ బొందుటచే నేమి ప్రయోజనము? దేవుఁడు నన్నాశీర్వదించును గాక! నేనింక బాధ పడలేను. తాత్కాలిక సౌఖ్యము నపేక్షించి శాశ్వతమగు పతనమును నేను కోరను. నేను యీ రెండు సంవత్సరములకాలము గాంధిగారి, టాగూరుగారి యాశ్రమములు నా కనుకూలముగనున్న నచట గడుప నెంచితిని. నన్ను, మిమ్ము మీరు పోషించుకొనఁ జాలునంత వరకు వేచియుందును. ఈవిధముగా మనము దీర్ఘకాలము జరుపజాలము. మీరు మీపెండ్లికిఁ దొలుత పూర్తిగా ధనము సంపాదింపుఁడు. ఆలోచింపకయే మీరు త్వరపడిన మీకు దేవుఁడిచ్చు సంతానమును భార్యను నెవరు పోషింతురు? స్వావలంబనము గల మనుష్యులగుటకే యత్నింపుఁడు. నేను మిమ్ము నిప్పు

డున్న బాలకునివలెఁ గాక స్వేచ్ఛగల వ్యక్తిగ నుంపఁగోరుచు న్నాను. స్వల్పమగు మొత్తపు పైకముతో నా నిర్వాహాము కాఁజాలదు. మిమ్ము శీఘ్రముగ వివాహమాడుట నా కసంభవము. కనీసము మీరీ రెండు సంవత్సరములేని యాగి యుండవలయును. ప్రియుఁడా! ఇట్లు వ్రాసినందులకు విచారింపవలదు నాప్రియుఁడా! నేనీవిషయమున మీకు సాయపడఁజాలనందులకు క్షమింపుఁడు. మీపరీక్షకై మిక్కిలి పరిశ్రమ చేయుఁడు. నేను మీకు వ్రాసిన యీవిషయములను, ముఖ్యముగా నేను గాంధీజీ యాశ్రమమున కరుగనున్న విషయము నెవరికిని దెలుపవలదు.

మీప్రియమైన

అన్న.

(అనువాదము.)

13-వ లేఖ

ఆరోగ్యవరము, చిత్తూరుజిల్లా.

16-11-19

నా ప్రియమైన నీమూ,

ఈమాసాంతములో నీ స్థలమును విడిచిపెట్టఁ గలుగుచున్నానని మీకుఁ దెలుపుట కెంతయు సంతసించుచున్నాను. నిన్న డాక్టరుగారు నా యారోగ్యమును బరీక్షించిరి. ఊపిరితిత్తులు సరిగనే యున్నవి. ఈ మాసాంతములో వెళ్లుమని

ఆయన నాకు సలహా నిచ్చెను. నా ప్రియుఁడా! నాయారోగ్య వృద్ధిని గూర్చి విని మీరు సంతృప్తులయితిరా? గోపాలరావు గారియొద్దనుండి నాకు పైకమును, పుస్తకమును రాలేదు. రాఘవచంద్రయ్యగారియొద్దనుండి యుత్తరములేదు. నేను డాక్టర్ డేవిడును వారి సతిని జూడఁజాల నందులకు విచారించుచున్నాను. వారు (Honey-moon) వినోదార్థము స్థలాంతరమున కరిగియున్నారు. వారు డిశంబరు 3-వ తేదీ లోపల రారు. నేనీ స్థలమును వీడినందులకె సంతసముగానున్నాను. మీరు శ్రీమతి యస్తరు కన్యకు వ్రాసియుంటిరా? నాజీవితమును వృథాగాఁ గడపుచు చాటపట్టులో నుండుట వాస్తవముగా చీకాకుగా నున్నది. నేనింటివద్దనున్న నా జీవితమును జెడగొట్టుకొనినదానినగుదునని నాతలంపు. నేను గాంధి ఆశ్రమమునకు వెళ్లువిషయమై మిక్కిలి శ్రద్ధను వహింతును; యస్తరు కన్యయు నన్నుగూర్చి శ్రద్ధఁబూనును. ప్రియుఁడా! నేనావిషయమునుగురించి సాధ్యమైనంత త్వరగాఁ దెలిసికొనఁ గోరుచున్నాను. నేను జనవరి మాసాంతములో ఏలూరు విడిచి పెట్టఁ గోరుచున్నాను. నా కాశ్రమమున కరుగు భాగ్యము లభించినచో నపుడు నేనితరులతో నుష్ణబాధను తప్పించుకొనుటకు కొండల కరుగుచున్నావని చెప్పెదను. తిరిగి చదువుకయి పోవుచున్నానని యితరులకుఁ దెలుప నాకు వాంఛ లేదు. వారు నన్ను బరిహాసింతురు. నేను దేనికయి పోవుచున్నానో దానియందు విజయముఁ బడ

యుదునో లేదో తెలియకున్నది. నేనక్కడ నుండుటకు గాంధి గారు సమ్మతించుచో నేను పైకమును బిచ్చమెత్తి సంపాదింప యత్నించెదను. నాదేశమును పిదప సేవించుటకై విద్యను సంపాదించుటకుగాను నేను విచారింపను. లేనిచో నేను రాజా భుజంగరావుగారిని నాచదువుకయి వడ్డీ లేకుండ రు. 1000-0-0 ఋణము నీయ నడుగుదును. నేనొకనాటి కామొత్తమును స్వయముగఁ జెల్లింపఁ గలను. నాకొరకయి మీరే యడుగుదురా? లేక నేనడుగనా? ఈవిషయములను నిర్ణయించుకొనిన పిదప నన్ను విడుచుటకును, ప్రియ మాతృభూమి కర్పించుటకును నా తల్లి దండ్రులను బ్రార్థించెదను. నాప్రియుఁడా! నా కీవిషయమున దోడ్పడుము. నేను ముమ్మాటికి నాజీవితమును వృథాగాఁ గడపఁ జాలను; గడప రాదు. తోడ్పడుము. దయచేసి డాక్టరు ముల్లరుగారికి వ్రాసి మీదేహారోగ్యము సరిగానున్నది లేనిది తెలిసి కొనుఁడు. ఇంకొక మాసమువర కుంట మంచిదేమో! దయయుంచి నేనాశ్రమమున కరుగు నుద్దేశ్యము నెవరికిని వ్రాయవలదు. నే నీవిషయమయి మిక్కిలి వ్యాకులచిత్తనయి యున్నాను. దేవుఁడు నన్నాశీర్వదించుఁ గాక! ప్రియుఁడా! తోడ్పడుము; తోడ్పడుము. యస్తరు కన్యవద్దనుండి మీకేదేని యుత్తరము వచ్చినదా? ఆమె నాయొద్దనుండి పైకమును స్వీకరింపనని తనయొక్క లేఖలలోఁ దెలిపియున్నను నేను పంపుటకే సంకల్పించితిని.

మీప్రియమైన

(అనువాదము.) అన్న.

## 14-వ లేఖ

మందిరము, చాటపఱ్ఱు
20—12—19

నేనింత శీఘ్రముగ జవాబు వ్రాయలేక పోయితిని. మేము 30 తేదీ కిచ్చటికిఁ జేరితిమి. నేను మీ ప్రియమైనమేన కోడలగు కమలితో గుంటూరులో నుంటిని. మేమందరము గలిసి 12వ తేదీకి దిరిగి వచ్చితిమి. పుస్తకముల నన్నింటిని సర్దుటలో నిమగ్నురాలనయి యున్నాను. కమలయొక్క వివాహము ఫిబ్రవరి 8 వ తేదీని జరుగునని మీకుఁ దెలియునని భావించుచున్నాను. యస్తూరు కన్య మిక్కిలి జబ్బుగానున్నది. ఆమె స్నేహితురాలామె జబ్బునుగూర్చి నాకుఁ దెలిపినది. ఆమెకూడ నాప్రదేశము నారోగ్యమునకు సరిపడదని నన్ను రావలదని సలహా యిచ్చినది. ఆమెకు డబ్బు పంపువిషయమై ఏమి చేయనగు? ఆమె నాయొద్దనుండి తీసికొన నిరాకరించెను; గాని పంపినచో మీడబ్బు ఆమెకు దోడ్పడవచ్చును. కాఁబట్టి యాడబ్బు నామెకు వెంటనే పంపుడు. మీ తల్లిదండ్రులకే విషయము తెలియదు. నాకుఁ గొన్ని బంగాళా నవలలును, శకుంతల, ప్రహ్లాద, సావిత్రివంటి బొమ్మలు గల చిన్న పుస్తకములు బిడ్డలకయి కావలెను. మన తెలుగునాటి బిడ్డలకయి నేను సుందరములగు చిత్తరువులుగల కొన్ని పుస్తకముల వ్రాయఁ గోరుచున్నాను. నేను టాగూరుగారి ఆశ్రమమునకు వెళ్లగోరుచు

న్నాను. దయయుంచి దాని వివరముల నన్నింటిని దెలిసికొన యత్నింపుఁడు. నేను మిమ్ము గలిసికొనినపుడే విషయములను గూర్చి విచారించెదను. మీచదువెట్లు సాగుచున్నది? మీరీ సంవత్సరమందు దప్పక యుత్తీర్ణులగుదురా? ఓ ప్రియమైన బాలుఁడా! నీవింక నెపుడు పెద్దవాడవగుదువు? మీకొక గొప్ప యుద్యోగము నన్ను పోషించుటకు లభింపనంతవరకు నేను వివాహమాడకుండుటకు నిశ్చయించుకొంటిని. కాఁబట్టి నన్ను సంతృప్తిపరచుటకేని ధనాఢ్యులగుటకు మీ శక్తికొలఁది యత్నింపుఁడు. సోదరీ వివాహసందర్భమున నేను కొన్ని పద్యముల రచింపఁ దలంచితిని. కాబట్టి కొన్ని వివాహ పత్రికలు దయచేసి పంపండి.

మీ ప్రియమైన,

అన్న.

## 15.వ లేఖ

మందిరము,

10–3–20.

ప్రియమైన నీడూ,

భావివిద్యకై విదేశముల కరుగుటకు మీకు విద్యార్థివేతనము లభించినందులకు హృదయపూర్వకములగు నభినందనములు. నే నీ సంతోషవార్త నెట్లు పరిగ్రహించినదియు మీ రూహించగలరు. మరియు నా యానందమును శబ్ద

ములతో వెల్లడించుట నాశక్తికసాధ్యము. మీరు బి. యే. యం దుత్తీర్ణులయిన నేనెంత యదృష్టవతిగనుందును ? వాస్తవముగా మీరు మిక్కిలి యదృష్టవంతులు. పరులకు మంచిగానుండునట్టియు, సాయపడునట్టియు వ్యక్తులకు దేవుడు తోడ్పడుచు వారిని ప్రేమించును. మీరిట్టి మనుష్యులశ్రేణిలో నొకరు. మీయొక్క సుగుణముల నేను గ్రహింపకుండుటెట్లు? గ్రహింపకుండుటయు నాకు మంచిదికాదు. మిమ్ము నా భర్తగాఁ బడసినందులకు గర్వపడుచున్నాను. మీయొక్క యర్ధాంగినిగను, మంచి భాగ్యలక్ష్మిగను నేను తగియుండలేదు. మంచిది. నేను మిమ్ము సంతోషపెట్టుటకై నను నింతకంటె మంచి బాలికగానుండఁ బ్రయత్నించెదను. దేవుడు మనలను ప్రియ మాతృభూమియగు భరతవర్షమునకయి త్యాగమొనరించుటకు దీర్ఘాయుష్మంతులను జేయుఁగాక! నేను సదా దీనిని గూర్చియే దేవుని బ్రార్థించుచుందును. నేను దీనితో శ్రీ కృష్ణారావుగారి యభిప్రాయమును బంపుచున్నాను. దుష్ప్రవర్తనముగల భాగ్యవంతుడగు వ్యక్తిని భర్తగఁ బడయుట కంటె సచ్చరిత్రుడగు దరిద్రునే పతిగఁ బడయుట మంచిది. యస్తూరువిషయ మేమి ? ఆమె డెన్మార్కు వెళ్లిపోయినదా ? సరళాదేవిగారి చిరునామా యేమయినది తెలుపఁ గోరుచున్నాను. మీ సలహా ననుసరించి నేను ఆమె పుస్తకమును దెనిగించుచున్నాను. నేను దాని నీ మాసాంతమునకుఁ బూర్తి



చేయఁగలను. ఆ పుస్తకము ... పుస్తక ముద్రణాధికారమును బడయుటెట్లో తెలుపవేడెదము. ... పుస్తకమునుగూర్చి "ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల" వారికి వ్రాసి తెలిసికొనుఁడు. నేనీ పాత్రమును సాధ్యమైనంత త్వరలో వారి కీయఁగోరుచున్నాను. అది ఏప్రిల్ మొదటివారము లోగాఁ బ్రచురింపఁబడవలయును. నేను సరళాదేవిగారి చిత్రపటము నందు ముద్రించుటకయి కోరుచున్నాను. అది కలకత్తాలో త్రివర్ణములోఁ జిత్రింపఁబడవలెను. 4/11/1

కొన్ని నగలను జేయుమని నందను అండుకో వారికి ఆర్డరు నిచ్చియుంటిని. మీరు మరువక తీసికొనిరావలయును. కంపెనీవారీయనియెడల వి. పి. చేయుమని చెప్పవలెను. ఎంత పైక మింక మన మీయవలెనో తెలియఁజేయుమని కోరుఁడు. నే నస్వస్థతగనుండు కాలమున గత సంవత్సరమునఁ దెచ్చినట్టి కేటలాగు నొకటి తేఁగోరెదను. విధుశేఖరశాస్త్రి ప్రణీతమగు వివాహమంగళము అను పుస్తకమున కాయనయొద్ద నుండి కాపీరైటు అడిగి తేవలయును. నేనది యనువదించితిని. అదియే యుత్తమమని తోఁచుచున్నది. హిందూధర్మప్రకారమదియే బాగని తోఁచుచున్నది. శ్రీ సరళాదేవికి వ్రాసిన యుత్తర మింకను బంపరయిరి. పుస్తకము ముగించితిని. ఆమె కాపీరైటుకయి యెదురు చూచుచున్నాను.

శము"నకు విధుశేఖర శాస్త్రినుండి తప్పక కాపీరైటు తీసి కొనిరాగోరెదను. మీరు మరువవలదు. శుభలేఖలకు 500 కవర్లు కాగితములు తీసికొనిరండి. కార్డులు 50 నేను పంపించు మాదిరివి యెక్కువ ఖరీదయిన, కొంచెము స్వల్పపు రకము తేవలెను. మీకీయనిచో నగలు తొందరగాఁ బంపుమనుఁడు.

ఇట్లు

**Anne** (అన్న)

కీ॥ శే॥ శ్రీమతి మాగంటి అన్నపూర్ణా దేవిగారి లేఖలు తమ భర్త బాపినీడుగారు అమెరికాలోనుండఁగా వ్రాసినవి.

## 1వ లేఖ.

చాటపఱ్ఱు,
ఏలూరు తాలూకా,
**14-8-20.**

ప్రియమైన నీడూ,

మీరు ప్రేమ దయాపూర్వకంబుగ లిఖించిన పత్రము నశ్రుపూరితములగు లోచనములతో కళాహీనమును విచారగ్రస్తమునునగు మోముతో వందన శతంబు లర్పించుచు నందుకొంటి. మీరత్యంత శ్రమతోడ నీధర్మపత్నిని జ్ఞప్తియందుంచుకొన్నందులకు భగవానుని కనేక వందనము లర్పించుచున్నాను.

మీరా లేఖను వ్రాయు సమయమున దేశజనని మిమ్ము జేరి యుండుటచే తన పుత్రుని పుత్రికను మనమునుండి దూరముగ నుండినఁ జూడనొల్లక యనేక ప్రయత్నములమూలమున నన్ను మీకడనుంచ గలిగెననునది వాస్తవమేమొ! లేక ఈ యన్న పూర్ణమీకడనుండి వేఱగుట దుర్లభమా? మీవియోగము నా కంత విచారకరముగ లేదు. మీరెందులకై భారతజనని నుండి విడువడి మహాసముద్రముల దాటి నవీన ప్రపంచమున కేగితిరో ఆమహోద్దేశ్యమును సర్వదా మనమునందుంచుకొని విజయులై పమ్మానమును బడసెదరో? లేదో? యను సంశయమున నా హృదయము దుఃఖపూరితమయ్యెను. ఏదేశము పరరాజులకుఁ గడు దూరముననుండి, శత్రువుల భయమొందఁ జేయుచు సర్వ దా జయపతాకమున నలరారి వీరపుత్రులచే సన్మానింపఁ బడు చుండెడిదో, అయ్యది యధోగతి పాలయి పరహస్తగతమయి హేయముగ నుండవలసి వచ్చెఁ గదా! దుర్బలులగు పుత్రులం బడసి జనని ఆక్రందనము సేయుచున్నది. ఆయాక్రందనము వీ నులఁ బడకుండ గాఢనిద్రయందు నిమగ్నులై, మైమరచి కాల యాపనము సేయుచున్నారు. సహస్రమున నొక సుపుత్త్రుఁడుం డిన నేమి ఫలము? శేషించినవారు వాంఛాశూన్యులయి జననిని భక్తిగౌరవములతోఁ బ్రేమింపక వ్యర్థభాషణముల (ఉపన్యాస ములు) మూలమునఁ గాలయాపన సేయుచున్నారు. మరికొం దరు వాక్చాతుర్యమున వారిగౌరవము కొరకుఁ బ్రయత్నించు

చున్నారు. పరోపకారము దేశాభిమానము వారికి అత్యంత దూరమునను్నవి. కార్యనిర్వాహణమునగాని, ధనసహాయముచేత గాని వారు దేశాభిమానము జూపరు. మీరేశాఖలో జేరిన వారు? మీసంఘము మీకడనుండి యెంతయో లాభముబొంద వలెనను కాంక్షతోనున్నది. సంఘమునకు, దేశమునకు మీ ప్రాణమీయఁగలరేమో యను తలంపున మీసహోదరులెంత గౌరవమున సన్మానించిరో యది సతతమును మది నుంచుడు. పుష్పహారముల వేసికొని పరదేశమున కేఁగినంతమాత్రమున గౌరవనీయులు కారు. దరిద్రుడైనను, పరదేశ సంచారి కాక పోయినను, మాతృ భూమికొరకై ప్రాణము సమర్పించువాఁడే ధన్యుడు.

మీరు దేశమునకు లాభకరమగు వ్యవసాయ శాస్త్రమును నభ్యసించుటకుఁ గుతూహలురై యరిగినందుల కెంతయు సంతసము. మిమ్ములను విడనాడియుండుట కెంతమాత్రము విచారములేదు. కాని నే నసహాయురాలనై వ్యర్థముగాఁ గాలము గడుపుచున్నందుల కెంతయు విచారము. నేనును పాశ్చాత్య దేశముల కరిగి మనకు నూతనమగు సంగతుల నరసి విశేష లాభము బొందునట్లు దేశసేవయందు జీవితమును వినియోగింప వలెనను వాంఛ యున్నది. ఎంతవరకు ఫలించునో తెలియదు. మీరు నావిద్య విషయమై శ్రద్ధవహించి ప్రోత్సాహముఁ జేయుచు శ్రమపడుటలేదు. ప్రోత్సాహమంత యనవసరమగు

నెడల ధన సహాయమునకుఁగూడఁ దోడ్పడుటలేదు. నాకెన్ని కోరికలున్నను నెట్లు నెఱవేఱును? విద్యార్థి వేతనము దొరకునను నాశ నాకు లేదు. ఈశ్వర కృప యెట్లున్నదో? మీ యుద్యమ మేమియు లేదు గదా!

రాణిగారిని సందర్శించితిని. శ్రీనాయుఁడుగారినిఁ జూడఁబోవ నాయన పిఠాపురము వచ్చిరని వింటిని. హరిశ్చంద్రుఁడుగారి కుత్తరము వ్రాసితిని. ఆయన కొంత సహాయము చేయఁగలరని నానమ్మకము. "నవవర్ష స్వప్నము"(దేవి బంగాళినుండియను వదించిన యొక గ్రంథము) ఆంధ్రపత్రిచారిణి కిచ్చెదను. సరోజినీదేవిగారు అక్టోబరులో వచ్చెదరు. మరల జనవరిలో నామె జ్యేష్ఠ పుత్రికను ఇంగ్లాండు తీసికొని వెళ్లెదరు. నాకెన్నఁ డట్టి యదృష్టము సంప్రాప్తించునో గదా! నాకేమియుఁ దోచుట లేదు. ఇంక నెక్కువ వ్రాయఁజాలను. రెండు మూడు దినములలో మరల వ్రాయుదును, అందరు క్షేమము. మీరు సంపూర్ణారోగ్యములో, సచ్చరిత్రులరై, ప్రయోజకులై దేశమునకుఁ దిరిగి వచ్చి దేశమాతకై మీదేహమును సమర్పించఁ గలరని మీసోదరీ సోదరులు:, బంధువులు వాంఛించుచు, భగవంతు నారాధించుచున్నారు.

అన్నపూర్ణ.

## 2-వ లేఖ

చాటపఱ్ఱు,
ఏలూరు తాలూకా,
18-8-20.

నా ప్రియమైన సీడూ,

మీ ప్రేమపూరితమగు జాబును వందనశతంబులతో నందుకొంటిని. మీ యుపదేశములకు మీ కనేక వందనములు. ఏ ఫోటోకు చట్టము కట్టించితిరి. మీరు భావించుచున్నంత ఉత్సాహముతోగాని కోరికలతోగాని నేను లేను. అంత యుచ్చ స్థానమున నన్నుంచుట మీ కనుచితము. భగవంతు డా సుదినము నెప్పుడు ప్రసాదించునో గదా! మీరు నన్నేమి బాధించితిరి. నిద్రాభంగము కేవలము విషయవాంఛలచే గలిగియుండలేదు. సంసార సంబంధమగు చింతలమూలమున ధనాభావమున విద్యాలోపమున జ్ఞానమభివృద్ధికాదను భయం బున ఆతురతచే రాత్రులు నిద్రాభంగమునఁ గడపితిని. ఎన్ని రాత్రు లాక్రందనముఁ జేసితినో, అయ్యది మీకు గోచరం బయ్యెనా? నే నెంత కష్టమనుభవించునను మిమ్ములం జూడ నీయనైతి. ధనముండిన మంచి వస్త్రముల ధరింపవచ్చును. ప్రపంచ సౌఖ్యములందు మత్తురాలనై యుండవలయుననుట నా ముఖ్యోద్దేశము గాదు. ప్రస్తుతము ధనము మూలమున విద్యయు నటుపిమ్మట ధర్మమును సంపాదించి దేశసేవయందు

శరీరము నర్పింపవలెననెడు కుతూహలము నాకు మెండు. ధన ముండిన దేశోపకారము బాగుగఁ జేయగలము. కేవలము ధనమే గాదు. భగవంతుఁడు ప్రసాదించిన ఉత్తమవాంఛ లుత్త మొత్తములయి యా నిర్వికారు డేనిమిత్తమున నీ లోక మునకుఁ బంపెనో దానిని సర్వదా మనో వాక్కాయ కర్మ ములతో సాధించుటకు శక్తినొసంగుటకై యట్లుండుటకు నాతని నారాధించుటయే నావాంఛ. నాకు ప్రపంచమంతయు ధనము తో నున్నదని విశ్వాసము. మీకన్ననో ధన మవసరము లేదు. ఒక పేదవాడు మనస్సు నిర్మలమై, పరోపకారాయత్తమై, సద్వాంఛలఁ గలిగి, తన ప్రాణము సమర్పించుటకు శక్తుఁడై యుండినను, అనేక సమయములయందు ఆతనికి ధనముఁగూడఁ గావలసియుండును. ధనాభావమున్న అవి యన్నియు నేమి లాభము? క్షుద్బాధచేఁ బీడింపఁబడువానికి ఆహార మవసరము గాని మీ యుపదేశములు తోడ్పడవు. ధనికున కీయుద్దేశ్యము లల్పములైనను ధనమువలనఁ గీర్తి మెండు. కాన ప్రథమము విత్తము సంపాదించుటయం దాసక్తు డవుగమ్మ.

శ్రీసరోజినీదేవి కొమార్తెకు జాబు వ్రాసితిని. ప్రత్యు త్తరము అనుకూలముగ వచ్చిన నామె కడకుఁ బోయెదను. పుస్తకములు హరిశ్చంద్రుని కడకుఁబంపుచున్నాను. నా ఫోటో వేయించను. సరళాదేవి ఫోటోకోసము నిబారునకు వ్రాసియుం టిని. ప్రస్తుతము నేను చదువుటలేదు. మీ రిచ్చుటనున్నప్పుడు

విద్యార్థి వేతనము విషయమై ప్రయత్నించక పోతిరి గదా! ఇప్పుడు నాకుఁ జాల కష్టముగానున్నది. * సర్కారుగారు యీ ప్రదేశములకు వచ్చినారు. రమ్మని వ్రాసితిని. మీనాయనగారు విచారముగా లేరు. వ్యవసాయ శాస్త్రము నభ్యసించుటవలన ధనార్జనమునకు వీలుగ నుండదని విచారపడిరి. మీరు కష్టపడి చదివి సమయానుకూలముగా ధనము సంపాదింపుఁడు. మీరు కోరిన వారికి ఫోటోలు పంపించెద. ఇంకను రాలేదు. నన్ను గష్ట పెట్టితిరని విచారింప వలదు. మీరు విజయులై శీఘ్రకాలమున నన్నుఁ జేరుటకుఁ బ్రయత్నింపుఁడు. నాకు విద్యార్థి వేతనము వచ్చునను నాశ లేదు. ఏమి చేయుటకుఁ దోఁచకున్నది. నన్ను విడనాడితిరి గదా! ఎన్ని యిక్కట్టు లున్నవో! పరదేశమున కెట్లు చేరఁగలను? ధనముండిన నీబాధ యుండెడిదా?

ఇట్లు

మీ అన్నపూర్ణ.

3 వ లేఖ.

చాటుపఱ్ఱు

28-5-20

ప్రియమైన నీడ్హూ,

ఈ యుత్తరమునకు పూర్వము నే వ్రాసిన లేఖలన్నియు మీకుఁ జేరియుండునని తలంచెదను. మీ రెట్లున్నారు? దయ

యుంచి మీ రాదేశమునుగూర్చి వివరముగాఁ దెలుపఁ గోరు చున్నాను. మీరు నివసించుచున్న ప్రదేశము మీకు ఆనంద దాయకముగ నున్నదా? మీరు కళాశాలలో నెప్పుడు ప్రవేశింతురు? గోపాలరావుగారి విషయమేమి? ఆయన యే పనియందు న్నాఁడు? మన దేశమున కంతదూరముగా నాదేశమును దేవుఁ డెందులకు సృజియించెనో తెలియదు. ఆదేశము మన యుత్తర ములకు సయితము కడుదూర మయినది. కాని మీరు సర్వదా నాహృదయ మందిరము నధిష్ఠించి యుండుటచే ఆదేశము నా మనస్సునకుఁ గడు సమీపముననే యున్నది. మీరే నాశాశ్వత జ్యోతి. భగవంతుఁడు లోకమునకొసంగు వెలుతురు పండ్రెండు గంటలే యుండును. కాని నా జ్యోతియగు మీరు 24 గంటలు ప్రకాశించుచుందురు. కాఁబట్టి ప్రకృతి సిద్ధమగు ప్రకాశమును మీరు మించియున్నారు. 23 వ తేదీని గాంధియు, మరియొక మహమ్మదీయ నాయకుఁడును బెజవాడ వచ్చిరి. ఒక గొప్ప సభ జరిగెను. వేలకొలఁదిగ నాంధ్రు లాసమావేశమున కేతెంచి యుండిరి. దీనినిగూర్చి వివరముగాఁ బిదప వ్రాయుదును.

నేను నా యాంగ్లభాషా జ్ఞానమును వృద్ధిఁ గావించు కొనుటకయి త్వరలో హైదరాబాదు వెళ్లుచున్నాను. నిబారను వద్దనుండి యుత్తరము వచ్చినది. హరిశ్చంద్రుని వద్దనుండి యుత్తరములు వచ్చుచునే యున్నవి. "నవవర్ష స్వప్నము"ను

బంపితిని. సరోజినీదేవి అక్టోబరులో హైదరాబాదు వచ్చును. పుస్తకములను ప్రచురించినపిదప నక్టోబరునుండి నేను విద్యార్థి వేతనమునకయి ప్రయత్నించెదను. సుందరములయిన చిన్న చిత్రపటములు నాకయి సేకరింపుఁడు. మేలయిన ఆల్బము (పటము లుంచుకొనునట్టి అట్టల పుస్తకము వంటిది) సంపాదింపుఁడు. సాధ్యమైన మనోహరములగు చిత్రపటములకయి మాసమునకు 4 రూపాయలు వెచ్చింపుడు. హరిశ్చంద్రుఁడు తన శక్తికొలఁది నాకు సాయమొనరింప వాగ్దానమొనరించెను. విద్యార్థి వేతనమునకయి నాశక్తికొలఁది యత్నించెదను. పైని భగవంతుఁడే యున్నాఁడు! విశేషములు తరువాతి యుత్తరమున వ్రాయుదును.

పద్మజ కొరకై బహుశా నేను హైదరాబాదు వెళ్లుదును. ఆమె తల్లి తిరిగి వచ్చువరకు నేనామెతోఁ గలసి చదువుదును. నేను మేధావంతురాలుగఁ బరిగణింపఁబడుదునో? లేదో? తెలియదు. ఇంకను చిత్ర పటములు చేరలేదు.

మీయొక్క—

అన్నె.

(అనువాదము.)

## 4వ లేఖ

చాటపఱ్ఱు,
1-9-20.

నా ప్రియమైన సీతా,

'ఏడను'నుండి మీ యుత్తరమును బడయనయితినని తెలుపుటకు విచారించుచున్నదాన. మీయొద్దనుండి జాబులను బడయకముందే నేనేమి వ్రాయుదును? మనము జాబులకొర కింత తడవు నిరీక్షింపవలసి వచ్చుచున్నప్పు డుత్తరముల ప్రయోజన మేమున్నది?

నే నిందులకై యెంతమాత్రము విచారింపఁగూడదు. స్వదేశమునిమిత్తమె మీరింత దూరమున కేగితిరి గాని యీ దేశీయు లెందరు మన దేశమున కరుదెంచి తమ బంధువులను వీడియుండుటలేదు? స్వదేశమునకై మీ రచటి కేగితిరి కాని స్వలాభమునకై కాదు గదా! పాశ్చాత్త్యులు స్వలాభము నకై యెన్ని కష్టములకో యోర్చి యన్యప్రదేశముల కేగుదురు. మరికొందరు స్వలాభ గౌరవములకై వచ్చి మన నిమిత్తము వచ్చితిమని నుడువువారల నెందరను గాంచుటలేదు! నావలె మిత్రులు, నెందరు స్త్రీలు వియోగమున నోర్చుకొనుట లేదు? అట్లయిన నే నెందులకు సహింపఁజాలను? సహింపఁగలను. ముమ్మాటికి సహింపఁగలను.

నా హృదయ మత్యంత చంచలావస్థయం దున్నది. శ్రీ సరోజినీకడ కేగుటకు ఆమె భర్తగారు రమ్మనిరి. ఆమె లేకపోయినను పద్మజతోఁ బఠించుచుండవచ్చునని నుడివి యుంటిరి కాదా ? ఆమె అక్టోబరులో వచ్చును. పదిదినముల కచ్చటికిఁబోయి ప్రారంభించవలెనని యున్నది. మా తండ్రి గారికి యిష్టములేదు. సంసారముతోనున్నవా రచటికి వెళ్లిన నిందలు వచ్చునని భయము. ఇది వాస్తవమేగాని లోకభయ ముండిన ముందుకార్యము లెట్లు సమకూడును ? పూర్వము విద్యోపార్జనమునకై నిందలపాలగుట నుచితమని యోచించి తిని. విద్యావంతులందరు కళంకితులై దూషింపఁబడుచుండుట లేదని తెలిసినను లోకనిందకై భయపడుచుంటిని. దేశోప కారము చేయువారిని మూఢజనులు నిందింపఁగడఁగుదురు. కీర్తికి, నపకీర్తి వెన్నంటియుండును. లోకము నిందించునని యా ధర్మము విడనాడఁదగునా? లేదు. ఆ ధర్మసంపాదనార్థము పలు గాకి లోకమును విడనాడ నిశ్చయించితిని. ప్రపంచమునంతను మానవులు తృప్తిపరచుట అసంభవము. మన కనుకూలముగ నన్నియు సృజించిన జీవనదాతనే కష్టసమయములయందు దూషించు జనులు, నరులను దూషించుట యొక వింతయా ? ఆ నిందకు నే నిప్పటినుండియే సిద్ధపడియున్నాను. నా శక్తి కొలఁది దానినుండి విముక్తురాలనై ప్రాణముకన్న మానమునే సర్వవిధములఁ గాపాడెదను. నా యుద్దేశ్యమును, నా వాం

ఛను గొనసాగించుకొనుటకు అవసరమైన నా దేహమునైన సమర్పింతునే కాని విడువను. నా ప్రాణము దేశమున కీయఁ గలనా లేదా యను సంశయము బాధించుచుండును.

నా కిచ్చట నేమియు బాగుండలేదు. నాకు విద్యార్థి వేతనము లభించునో లేదో! సరోజినీదేవికడ నే నెంతవరకుఁ జదువఁగలను? ఆమె కనుకూలముగనుండి ప్రవర్తింపఁగలనా? నా విద్యవలన నామెను సంతుష్టురాలనుగఁ జేయుచు నుత్తమ విషయముల గ్రహింపఁగలనా? యను సందేహములు నన్ను వేధించుచున్నవి. ఇదివర కెచ్చటికైఁ బోయి విద్య నభ్యసించుటకు వీలుగనుండునాయని భావించుచుండెడిదానను. ఇప్పుడది తీరినది. కొన్ని దినముల వాంఛలు సమకూడనియెడల నున్మాదినినిగాను గదా!

గతించిన నాల్గు మాసములు ప్రయత్నించిన విద్యార్థి వేతనము వచ్చియుండెడిదేమొ! నన్నేల మిమ్ము గూడిరానీయరైతిరి? నన్నుగూర్చి ప్రయత్నించుట మీకే శ్రమమైనచో నితరు లెంత శ్రమగా భావించెదరో యూహింపఁజాలకపోతిరా? ఆంధ్రప్రచారిణి "నవవర్ష స్వప్నము"ను అనుబంధ గ్రంథములలో వేసికొనెదరట. సరళాదేవి ఫోటోకూడ వేయించెదరట. వ్యయ మెక్కుడగునఁట. లాభ మేమాత్ర మీయరఁట. హరిశ్చంద్రుఁడు మీకు జాబులు వ్రాయుచున్నాఁడా? స్వంత

ముగ మూఁడు పుస్తకములు కావలసిన నచ్చోత్తించి పంపెద నని వ్రాసినాఁడు.

శీఘ్రకాలములో సరోజినీదేవి కడకుఁ బోయెదను. విద్యార్థివేతనమునకయి ప్రయత్నించెద. స్త్రీ పురుషులను సమాన సమర్థులనుగా భగవంతుఁడు సృజించినచో నా శక్తి కొలఁదిఁ బ్రయత్నించి విద్యార్థివేతనమును సంపాదింతును. వచ్చునో? రాదో? చూతము! దైవము తన బిడ్డల నేక భావముగఁ జూచుచున్నాఁడు గదా! ప్రయత్నించిన దోష మేమి? మీరు రచ్చట ప్రయత్నము చేయుఁడు. అట్లయిన నేను సిఫారసు పుత్తరములు సంపాదించి పంపెద. ఇచ్చట నందరు క్షేమము. మీ క్షేమమును వినుటకై యాతురుల మయియున్నారము.

మీ ప్రియమైన

(అనువాదము) అన్నె.

5వ లేఖ లేదు



6వ లేఖ

చాటపర్రు,
7-10-20

నా ప్రియమైన నీదూ,

నాల్గవ తేదీ మీ యుత్తరము నాకుఁ జేరినది. నేను కొన్ని దినములు గుంటూరులోనుండుటచే సకాలమున దాని

నందుకొనఁజాలనైతి. డాక్టరు కుగ్లరు నన్నుఁ బరీక్షచేసి నా యారోగ్యము మంచి స్థితియందేయున్నట్లు చెప్పినది. మీ యర్ధాంగికయు చిత్రపటములఁ బ్రోగుచేయునంతటి దయగల వారయి యున్నారని మీ యుత్తరమువలనఁ దెలిసి యపరిమితానంద భరితనైతిని. మీ యీ పనికయి మిమ్మభినందించెదను. నేనిక్కడ మంచి యాల్బము (పటములుంచుకొను పుస్తకము) సంపాదింపఁజాలనని మీకుఁ దెలియునుగదా! ఆల్బము లేకుండ నా చిత్రపటముల నిటకుఁ బంపిన నేమి ప్రయోజనము? నావద్దనున్నట్టి పెద్ద యాల్బమునందిది కొనవద్దు. ఇప్పటికి మీరెన్ని చిత్రపటములు నాకొరకు సంపాదించితిరో దయచేసి తెలుపఁగలరా? మిమ్ము నే ననుసరించుటకు విద్యార్థివేతనమును బడయకపోయినచో నా చిత్రపటములను బంపవచ్చును. మరల నేఁటినుండి నేను విద్యార్థివేతనముకొరకై ప్రయత్నించుచున్నాను. డాక్టరు కుగ్లరుగారు మునగాల రాజాగారి కొక యుత్తరమును, పిఠాపురము మహారాజాగారి కొక లేఖయు వ్రాసియిచ్చిరి.

మీరు నన్ను విడనాడిపోవుటచే నాకెంతయో కష్టముగానున్నది. మీరుండిన సిఫారసు పత్రములు సంపాదించుట మొదలయిన పను లింతకష్టముగా నుండెడివిగావు. ఇప్పుడెందరి నాశ్రయింపవలయునో యెవరికెరుక. ఇన్ని బాధల ననుభవించిన ఫలితము కలుగునో? లేదో? యెట్లు తెలియును.

నేను గుంటూరు వెళ్లితిననియు, శ్రీమతి పారు దొర సానితోఁ గొన్ని దినములటఁ గడపియుంటిననియు మీ కిదివరకే తెలిపియుంటిని. ఆమె నాయందు మిక్కిలి దయను, సద్భావమును గలిగియుండెను. ధార్మిక గ్రంథముల వ్రాయుమనియు నిత్యము మన మొనరింపని భగవత్ప్రార్థన చేయుచుండుమనియు నా దొరసాని నాకు సలహా యిచ్చుచుండెను.

మీకొరకుఁ బ్రతిదినము ప్రార్థనలు సేయుచుండును. మిమ్ముల నిరాటంకముగా గమ్యస్థానముఁ జేర్చుటకును, భగవదారాధనయందు ప్రీతికలవాఁడవై ముక్తిమార్గమును సంపాదించునట్లును, సచ్చరిత్రుఁడవై యుండునట్లును ప్రార్థనలు చేయుచుండెడిది.

శ్రీమతి సరోజినీ నాయుఁడుగారీ మాసములలో భారతదేశమునకు వత్తురు. ఆమె పుత్త్రిక తన కస్వస్థతగా నుండుటచే ఆరోగ్యమునకయి విశాఖపట్టణము వెళ్లినది. వారి వలనఁ గొంత జ్ఞానమును సంపాదించుటకు వారియొద్దకు నే నెన్నఁడు వెళ్లఁగలుగుదునో! నేనా దినమునకయి మిక్కిలి యాసక్తితో నిరీక్షించుచున్నాను. సరోజినిగారియొద్దకు వెళ్లువరకు నే నేమియుఁ జేయఁజాలను.

నేను నా యింగ్లీషుభాషా జ్ఞానము నెట్లు వృద్ధిగావించుకొందును? మంచి దస్తూరి నెట్లు వ్రాయనేర్తును? సంవత్స

రము వెంట సంవత్సరము గతించి పోవుచున్నది. నే నెంత పని చేయఁ గలిగితిని? నే నెంతగా దేశమును సేవించుచున్నాను? ఇన్ని సంవత్సరములనుండి నే నేమి నేర్చియుంటిని? ఈ ప్రపంచములో నే నొక క్షుద్రజీవిని.

రాట్నములు ప్రతి స్థలమునందును వ్యాపించుచున్నవి. దేశమున అసహాయోద్యమము ప్రబలుచున్నది. దేశనాయకులు జాతీయవిద్య కొరకుఁ ప్రయత్నించుచున్నారు. శాసనసభ్యులు కొందరు పదవులను త్యజించుచున్నారు. ప్రతి మానవుని హృదయమునందు స్వరాజ్యాభిలాషను గాంధి ప్రబలముఁ జేయుచున్నాఁడు.

నా ఆలస్యమునకు క్షమింపుఁడు. నా సోమరితనము వలననే యిది కలిగినది. మనకు మాసములోపల నొకరి యుత్తరము లొకరికిచేరినపు డింకొకవార మాలసించిన నష్టమేమి? విశేషములు తరువాత వ్రాయుదును. చిత్రపటములఁ బ్రోగుచేయండి. మీ స్నేహితునివద్దనుండి టెలిగ్రాము వచ్చినది. మీరు సుఖముగాఁ జేరినందులకు మిక్కిలి యానందించుచున్నాను.

మీ అన్న.

(అనువాదము)

## 7 వ లేఖ

చాటపఱ్ఱు,
17-11-20.

నా ప్రియమైన నీడూ,

నా యుత్తరములన్నియు నెప్పటి వప్పుడు మీకు చేరుచున్నవని తలంచెదను. సకాలముననే యుత్తరములు వ్రాయుటకు క్రిందటి సారియే నిశ్చయించితిని. ప్రస్తుతము నేను మరికొన్ని యుత్తరములు వ్రాయవలసి యుండుటచే మీకు విశేషముగా వ్రాయుట సాధ్యముగాకున్నది. విఖ్యాతులగు పురుషులనుండి నేను సిఫారసు ఉత్తరముల సంపాదింపఁ బ్రయత్నించుచున్నాను.

బొమ్మల కార్డులను సంపాదించితిరా? నాకొరకెన్ని చిత్రపటముల సంపాదించినారు? మీరు లేనందున నన్నియు నేనే ప్రయత్నింపవలసి వచ్చుచున్నది. విద్యార్థివేతనము సంపాదింపలేనను సంశయము కలుగుచున్నది. నేను విద్యార్థివేతనముకై వ్రాయక పూర్వమే యీవిషయ మందరికిఁ దెలిసిపోవుచున్నది. కారణము జాబుల నిమిత్తమై స్నేహితుల నాశ్రయించవలసి వచ్చుచున్నది. వారికడనుంచి పరులరయుచున్నారు. నా విద్యాభివృద్ధికై మీ రేమాత్రము కష్టపడుటలేదు. నేను విద్యార్జనముచేసి గౌరవము నార్జించినచో నీవును గౌరవాన్వితుఁడవై సంతసించెదవు. అంతియేకాని యెప్పుడును లేశమాత్రము శ్రమపడవు.

నేను అమెరికా రాఁదలఁచుట మిమ్ముఁగూడి సరస సల్లాపము లాడుటకొరకేయని యితరులు సందేహచిత్తులై యున్నారు. నా హృదయము మీకు విదితమే కదా? నా వాంఛ యదియా? మీరు పాశ్చాత్య దేశముల కరిగినను లేక పోయినను నే నరుగఁదలంచితిఁ గదా! లోకమును ఒప్పించుట కష్టతమము. నిరాటంకముగ శ్రమఁజెందక మూఢమతులు పరులదోషము లెన్నుటయందు మహానందముగల వారు. ప్రపంచ సుఖాన్వేషణపరాయణులు, శృంగారవిలాస సంపన్నులు వేఱొండు భావింతురా? నా మనంబు మిమ్ముఁ గూడుటకే లోలాయితమైన దోషమేమి? అదియుఁగాక నేను మిమ్ముఁగూడి విలాసమునఁ గాలము వ్యర్థముగఁ గడపినచో నన్నుఁ బోషింపఁబోవు ధనాఢ్యు లేమందురు? మన దేశము వచ్చినప్పుడు నా విద్య, సేవ మొదలగునవి దాగి యుండునా? స్వధనమైన నట్లుచేసినను పరుల ధనసహాయమునఁబోవు దరిద్రవిద్యార్థులా విధంబుగఁ జేసిన లోకమును మోసపుచ్చుటయే గదా? మోసముఁజేయ యత్నించినను నొకరిద్దరిని జేయఁగలము కాని దేశవాసులనందరిని జేయఁ గలమా? మీతో విలాసముగనుండుటయే నా వాంఛయైన నానందముతో మిమ్ములఁ బోనిచ్చి యుందునా? మీ మిత్రుఁడు యీ విధమున వ్రాసియున్నాఁడు.

ప్రియసోదరీ! నేను లోపముల వెదకుచున్నానని తప్పుగా భావింపకుందువేని నీవు అమెరికాకు వెళ్లుటకు ముఖ్య కారణమేదియో తెలుపఁగలవా? నీవు అమెరికాకు ఒక ప్రత్యేక విషయమును జదువుటకు వెళ్లుట లేదేమో యను నా తలంపు తప్పుకాదనుకొందును. నీ మనస్సులో నట్టి తలంపు లేనపుడు పరులెవరును నీకు విద్యార్థివేతనము నిచ్చుటకు ముందుకురారని గ్రహింపుము. ఈ విషయములో నన్ని యు తన్నితరులడిగినచో నేమి సమాధానము చెప్పవలయు నని జాబు వ్రాసి యడుగుచున్నాఁడు.

కొలంబియా శీతోష్ణస్థితి నాకు సరిపోయినదగుటచే డాక్టరు కుగ్లరు నన్నక్కడఁ జదువుమని ప్రోత్సహించినది. కాలిఫోర్నియా శీతోష్ణస్థితి చాల మంచిదని వింటిని. కాఁబట్టి నేను కొలంబియాలోఁ గాని కాలిఫోర్నియాలోఁ గాని చదువ నెంచితిని. బోస్టనులోఁ గాని న్యూయార్కు నగరమున గాని నే నుండఁజాలను. కారణమేమన ఇంగ్లాండుకంటె నీ ప్రదేశ ముల రెంటియందును చలి యధికము. దయచేసి కొలంబియా, కాలిఫోర్నియాలను గూర్చి వివరములు తెలుపఁగోరెదను. నేను ఇంగ్లీషు వాఙ్మయమును, పత్రికాసంపాదన కళను జదువ నిశ్చయించితిని. ఆంధ్ర సారస్వత పాఠ్యక్రమమును, పత్రికా సంపాదన కళాపాఠ్యక్రమ మెంతకాలము పట్టును? దయచేసి శీఘ్రమే విశ్వవిద్యాలయముల పేర్లు, వాని నియమములు

తెలుపఁగోరెదను. పైనిచెప్పిన విశ్వవిద్యాలయముల నిబంధన పుస్తకములఁ బంపుడు. అటనే నేయే గ్రంథములఁ జదువవలసియుండునదియుఁ దెలుపఁగోరెదను.

పిఠాపురం రాజాగారి వ్యాజ్య మాయన పక్షమైనది. తొందరగా వ్రాసినాను. దస్తూరీ బాగుండలేదు. హరిశ్చంద్రునకు సరియైన జవాబు వ్రాయండి. ఎవరును దేశముకంటె నెక్కువ గారు. నేనును గాను. మాతృభూమి తరువాతనే యందరమును. సరోజినీదేవి యింగ్లాండునుండి వచ్చినట్లు తెలియలేదు. ఆమె కొమార్తె పద్మజ విశాఖపట్నములో నున్నది. జబ్బుగానున్నది. నేను తొందరపడుచున్న కొలఁది వారికడకు వెళ్లుట దూరమగుచున్నది. కనికరమ్మ ఋషి అయినది. పాలు, పండ్లు ఆహారమఁట. ఎవరెట్లుండినను మీరు విచారింపవద్దు. భారతదేశమునం దెందరా విధముగ నున్నారో! భారతదేశహితమునకై యందరిని మరచి జ్ఞానమార్జించి దేశమునకు సేవఁజేయుఁడు. కొందరు స్నేహితులు నన్ను అమెరికా వెళ్లవలసినదనియు, అచటనుండిన మీరు జాగ్రత్త తీసికొందురనియు, భర్తయుండిన స్థలమున భార్య యుండవలెననియు శీతోష్ణస్థితికొరకు అమెరికా మంచి దనియు చెప్పుచున్నారు. వచ్చినను స్త్రీవసతి గృహములో నుండి మీకడకు వచ్చుచుండవలెను. లేనిచో విపత్తు. సం

దేహ పడెదరు. ఇవన్నియుఁ దరువాత నాలోచనీయములు. విద్యార్థివేతనము దొరకినఁ గదా యివన్నియు.

అన్నా.

(అనువాదము)

## 8వ లేఖ

చాటపఱ్ఱు,
**20-10-20.**

నా ప్రియమైన నీడూ,

**5** దినములు జ్వరము వచ్చినది. కడుపునొప్పిచే నస్వస్థతగానున్నాను. ఈ దినము వ్రాయలేకున్నను వ్రాయుచున్నాను. వారము దినములవరకు వీలుండదు. ఆ కారణముచే నీ దినముననే వ్రాయ సమకట్టితిని.

శ్రీ సరోజినీదేవిని అమెరికాకు ఉపన్యాసము లిచ్చుటకుఁ బిలుచుచున్నారట. ఈ నెలలలో నిచటకు రాలేదు. అక్కడికి వచ్చునేమో! నిన్నరాత్రి పద్మజను స్టేషనువద్దఁ జూచియుంటిని. 27వ తేదీ బుధవారము హైదరాబాదు వెళ్లుదును. సరోజినీదేవి వచ్చువరకు మేమిద్దరము కలిసి చదివెదము. నాకన్న నామె జ్ఞానవంతురాలు కదా! ఆమెకడ ననేక విషయముల నేర్చుకొనుటకు వీలుండును. 23, 24 తేదీలలో రాజమండ్రియందు జరుగు ఆస్తిక మహాసభకు సర్కారుగారు, నాయుడుగారును వచ్చెదరు. సర్కారుగారు

నన్నచటికి రమ్మనిరి. నాయుఁడుగారితో విద్యార్థివేతనము సంబంధము మాట్లాడుటకు రమ్మనిరి. పెద్దవారితో నెట్లు మాట్లాడవలయునో నాకు భయముగానున్నది. మీరు నా కొరకే విధములగు కష్టముల ననుభవింపనే యే వెళ్లితిరి గదా! ధనసాహాయ్యము చేయుదురన్న నదియులేదు. గొప్పవారికడ కంపి విద్యాభివృద్ధి చేయించెదనేమో యన్న నదియుఁ జేయ లేదు. ప్రస్తుతము నాకడ డబ్బులేదు. మీ కెనరికైన నోటు వ్రాసి డబ్బు యిప్పించవలెను. మీరు హరిశ్చంద్రునకు వ్రాయండి. ఒకవేళ విద్యార్థివేతనము దొరకనచో డబ్బు యిచ్చివచ్చెదను. మీ నాయనగారు గీయవలసిన డబ్బు నింక నీయలేదు.

సరోజనీదేవి యింటికి వంటమనిషిని దీసికొని వెళ్లవలె నంటే వారు తమ యింటనే భోజనము చేయవలెనని బలవంత పెట్టుచున్నారు. నా బిడ్డవలెఁ జూచుకొందును గాని వేఱు భావించవలదని ఆమె భర్తగారు చెప్పినారఁట. గొప్పవారి యిండ్ల కరిగిన బాగుగ గౌరవింపరనియు సేవకన్యాయం బుగఁ జూచెదరనియు మీరు నుడివితిరి. వీరావిధముగ నన్నుఁ జూడరు. మీరు విచారింపవలదు. వివాహమువలన నాకీ లాభము కన్పట్టుచున్నది. ఎచ్చోటికైన నేఁగి విద్యాభి వృద్ధిఁ జేసికొన వీలుగనున్నది. పరుండి వ్రాయుటచే వ్రాఁత

బాగుండలేదు. పెద్దబాబు వ్రాయలేనందులకు క్షమింపఁ గోరెదను.

మీ ప్రియమైన
అన్నా.

9 వ లేఖ

చాటపఱ్ఱు,
27-10-20.

నా ప్రియమైన నీడూ,

మీరు అమెరికా చేరిన తరువాత నుత్తర మొక్కటేని యు రాలేదు. కారణమేమి? మీరుండు స్థాన మెటనైన నిశ్చయమైనదా? ఏ విశ్వవిద్యాలయములో విద్యాభ్యాసము చేయుచున్నారు? ఆస్తిక మహాసభయందుఁ బాల్గొనుటకయి నేను రాజమండ్రి వెళ్లితిని. అక్కడ సర్కారుగారిని, నాయుడు గారిని తదితరులను చూచితిని. నేను నాయుఁడుగారితో విద్యార్థివేతనమును గూర్చి ప్రసంగించితిని. ఆయన రాజా గారితోఁ జెప్పెదునని వాగ్దాన మొనరించినారు. ఈ వ్యవహార మందు నే నెంతవరకు సఫలతను బడయఁగలనో చెప్పఁజాలను.

నేను నేఁ డిటనుండి బయలుదేరి హైదరాబాదు వెళ్లుచున్నాను. పద్మజ నన్నటకు రాఁగోరినది. కాబట్టి నేను నా యాంగ్లభాషా పరిచయమును వృద్ధిపరచుకొను తలంపుతో నట కేగుచున్నాను.

సిఫారసు యుత్తరములు మొదలయినవి యెచ్చట నుంచినారు ? దరఖాస్తు ఫారము యేవిధముగ వ్రాసియుంటిరి? అన్ని విషయములు శీఘ్రముగఁ దెలియజేయుఁడు. వలదు. వలదు. తెలియఁజేసినను నేమి లాభము ? రెండు మాసము లకుఁ దెలిసిన నేమి లాభము ? ఇంతలోఁ గార్యములు ముగియవచ్చును. మీరు లేకపోవుటచే నా కెక్కుడు బాధగా నున్నది. ఈ దినమే ప్రయాణమగుటచే నెక్కువ వ్రాయఁ జాలను. మీ కచ్చట నెట్లున్నది ? పాఠ్యక్రమము ఎన్ని సంవత్సరములు. కొలంబియా, కాలిఫోర్నియా విశ్వవిద్యా లయముల పుస్తకములు పంపఁగోరెదను. విశేషములు తరు వాత వ్రాసెదను. అక్కడెంతవరకు విద్య నభ్యసింపఁగలుగు దునో తెలియదు.

నా యడ్రసు:—

కేరాఫ్ సరోజినీ నాయుడుగారు,
" స్వర్ణనికేతనము "
హైదరాబాదు, (దక్కను)

## 10 వ లేఖ

"స్వర్ణనికేతనము"
హైదరాబాదు,
9-11-20.

నా ప్రియమైన సీతూ,

ప్రతిదినము మీ లేఖకొరకు నిరీక్షించుచున్నాను. జాబు లేదయ్యె. వారమున కొక జాబైనను వ్రాయలేరా ?

ప్రతిదినము వ్రాసెడివారు, వ్రాయుచున్న మీరు వారము నకు రెండైనను వ్రాయలేరా? మీకు నిజమైన ప్రేమయున్నఁ గదా? నే నీ జీవితములో విదేశమున కేఁగఁగలనను నమ్మ కము లేదు. మీరు ధనవంతులయిన నో నీవిధముగ నయ్యె డిది కాదు గదా!

ఎవరును నాకు విద్యార్థివేతనము యిచ్చునట్లు కాన్పిం చుటలేదు.

1. నేను మిమ్ముఁ గూడియుండుట కేతెంచుచున్నా ననియు,

2. ఆంగ్లసాహిత్యము అభ్యసింపవలెనన్న ఇంగ్లాండు మంచిది కాని అమెరికా యెందులకనియు,

3. అనారోగ్యముగలవా రింతిదూర మేగఁగూడ దనియు,

4. పరీక్షల కేఁగనిచో నిచ్చటనే విద్య నభ్యసింప రాదాయనియుఁ బ్రశ్నించుచుండ నాకెట్లు విద్యార్థివేతనము దొరకును?

కార్యమ్ములన్నియు విత్తముతోనే యున్నవి గదా! ధనము మూలమున నన్నియు లభించును. నే నిచ్చట కేతెం చిన విషయము తెలిసియేయుండవచ్చును. శ్రీ సరోజినీదేవి యింకను రాలేదు. ఎప్పుడు వచ్చునది తెలియదు. మీ

రిచ్చోట (India) నున్నచో నేనీ స్థలమునకు వచ్చియుండను గదా! మీరే నా విద్యాభివృద్ధిఁ జేసియుందురు గదా!

ఇక్కడ నవలలు చదువుచున్నాను. ఆంగ్ల కావ్యములు కూడ చదువుచున్నాను. కవిత్వము నేర్చుకొనవలెననియున్నది.

ఇతాకాలో స్త్రీ విశ్వవిద్యాలయ మున్నదా? కాలిఫోర్నియాలో మంచి విశ్వవిద్యాలయ మున్నదఁట గదా! అన్ని విషయములు వ్రాయుచుండుము. ఇచ్చట రెండు మూఁడు మాసము లుండవలెననియున్నది. విద్యార్థి వేతనము దొరికినచో ఏప్రిల్, మే నెలలలో బయలు దేరవలెననియున్నది. మొట్టమొదట పిఠాపురము రాజాగారి దగ్గరఁ బ్రయత్నించి తరువాతఁ బరులకడ భిక్షమెత్తెదను.

మీరున్న స్థలము చలిప్రదేశమా? నేను వచ్చినను వేఱు ప్రదేశమున నుండవలెను గదా! మన మిరువుర మేక స్థలముననుండిన విద్య నభ్యసింపఁగలమా? హా! యున్మాదినీ! నీవు ప్రథమము విదేశమున కేఁగినఁగదా యివియన్నియు. మొట్టమొదట దానికొఱకు ప్రయత్నింపుము. ధనసహాయము లేనిచో నెట్లేఁగఁగలవు? ఏమి చేయుటకు నాకుఁ దోచకున్నది. మీ రేమందురు? భారతవర్ష మేమయిన జ్ఞాపకమున్నదా, లేదా? కొలంబోలోనే మరచితిరా? అచ్చట స్త్రీలతో నెక్కువ కలసి మెలసి యుండవలదని నా వాంఛ. ఎక్కువ స్నేహభావముతో నున్నయెడల వారు మిమ్ము మోసము

చేయుదురు. శ్రద్ధగఁ బనిచేయుఁడు. సాధ్యమైనంత త్వరలో మాత్రు దేశమునకు వచ్చి దేశోపకారమును జేయఁగలరని నా నమ్మకము. మీ రెందుల కచ్చటి కేగితిరి ? నేను మిమ్మా నందముతో నెందులకుఁ బోనిచ్చితినో సర్వదా మనమునందుం చుకొని పాటుపడుఁడు. నన్ను మరచినను దేశమును మరువ వలదు. నేను స్థిరముగాను, యమధర్మరాజు నన్నెపుడు పిలి చిన నపుడు పోవలసినదాననే. దేశమునకు మీ జీవితము నర్పించిన నయ్యది స్థిరముగనుండును. మీ కీర్తి యెల్లకాల ముండును.

మీ ప్రేమాభిలాషిణి

అన్నా.

## 11 వ లేఖ

స్వర్ణనికేతనము
16-11-20

నా ప్రియమైన నీదూ,

మీరు వ్రాసిన జాబు చేరినది. అందుల కనేక వందన ములు. మీరు వ్రాయుచున్న జాబు లింకను మీ ప్రయా ణముఁ గూర్చియే. ప్రతి విషయము నేర్చుకొనుట మంచి దియే కాని యవి శుష్కములు. మీరు నా విషయమయి యే మాలోచించుచున్నారు ? అక్కడ విద్యార్థివేతనము యేమైననున్నదా? ప్రయత్నించిన వచ్చునా? ఏమో నా కేద్దియుఁ దోచుటలేదు. చిరుతప్రాయమువారందరు నాకన్న మిన్నగ

విద్య నభ్యసించుచుండఁగా గౌరవాన్వితలగుచుండ నేనిట్టి యధోగతియం దుంటినిగదా? నాకన్న సంవత్సరమున్నర చిన్నదైనను పద్మజ కెన్నియో విషయములు తెలియును. నా కెంతయో సిగ్గుగనున్నది. స్వతస్సిద్ధముగా ఆమె నాకన్న తెలివిగలది. మూఁడు సంవత్సరముల క్రిందట ప్రవేశపరీక్ష ప్యాసయిన తరువాత యఫ్. ఏ. చదువుచు బి. యే. క్లాసు ఉపన్యాసములలో పాల్గొనుచుండెడిదట. ఇప్పుడు ఎమ్. ఏకు తగియుండుననుకొందును. ఆంగ్ల సారస్వతము సత్యధికముగఁ జదివినదని నా నమ్మకము. ప్రతి మంగళవారము మీకు జాబు వ్రాయుమని జ్ఞాపకముచేసి వ్రాయుచుందును. ఆమె వలననే మీకు జాబు లందుచున్నవనియు నామెయే దానికిఁ గారకురాలనియు వ్రాయుమనినది. కాండీస్ అను తినుబడి పదార్థములు అక్కడ విశేషముగనుండునట. అవి తెప్పించుకొమ్మన్నది. అవి మీరు నా కంపెదరా? **Chewing gum** మిమ్ములను పయోగించవలదని చెప్పినది. దానివలన దంతము లూడిపోవునట. అమెరికనుల కది యెక్కువ ప్రీతిగ నుండునఁట. వారివలె మీ రద్దానికిఁ బ్రియులు కావలదు. మీరు మద్య పానమును నేర్చుకొంటిరో? లేదో? తెలుపఁగలరా?

మీ యుత్తరములో స్త్రీల విషయ మెక్కువ వ్రాసితిరి. వారి సౌందర్యము మీ కెందులకు? స్త్రీ సౌందర్యము మిమ్ములఁ జలింపఁజేసినట్లున్నది. పరస్త్రీ సౌందర్యమునకు

లోలాయితులయినఁ గీడు సంభవించును సుఁడీ! అత్యంత జాగరూకతతో మెలంగుఁడు. స్త్రీ పురుష భేద మచ్చట నుండదు. మోసపోకుఁడు.

నాయుఁడుగారు హరిశ్చంద్రునితో "రెండు సంవత్సరము లిచ్చటనే చదివి మీరు వచ్చుటకుఁ బూర్వము రెండు సంవత్సరములు మీయొద్ద అమెరికాలోనుండి చదువఁ గూడదా! ఆమె శరీరము గురించి నాకు భయముగనున్న"దని చెప్పినాడఁట. నాహితవ్యము యిచ్చటనే చదువవచ్చును. అంతదూర మెందులకని చెప్పినాడఁట. మీరు పంపెదనన్న చిత్రపటములు యింకను నా కందలేదు. మీరు అరేబియా, ఈజిప్టు మొదలగు దేశముల చిత్రములను పంపించెదనని వ్రాసినారు. అవి యేమయినవి? విమలకు మాత్రము పంపియుంటిరి. ఎన్ని పంపించినారు? నాకుఁ బంపినచో నామె తీసికొన్న మరల నిచ్చునా? అయ్యో! ఆ కార్డ్సు చూచినపుడు నాకని యే నేను భ్రమపడితిని. ఇప్పటికి నాకదియే నమ్మకము. 50కన్న నెక్కువ యున్నట్లున్నది. అక్కడి సంగతులు తెలియఁ జేయుచుండుడు. మీకు నా వందములు.

ఈ జ్ఞాన మదివరకు రెండు సంవత్సరములలో నొక సారియైన లేకపోయినది గదా? ఇపుడు వేసవి సెలవులలో నెక్కుడు శ్రమఁ దీసికొని యేల సంపాదింపవలయును? డిగ్రీ

వలదు. ఎక్కువ పరిశ్రమఁజేసి శరీరము పాడుచేయవలదు. పరదేశమునకుండి యధిక శ్రమయా ?

అన్నా.

12వ లేఖ.

"స్వర్ణనికేతనము"
24-11-20.

నా ప్రియమైన నీడూ,

కడచినవారము మీ యుత్తరము రానందుల కాశ్చర్య పడుచున్నాను. మీ యుత్తరములను బడయఁజాలనందులకు నేను మిక్కిలి విచారపడుచున్నాను. ఈ వారమేని మీ యుత్తరము రాఁగలదని యాసింపవచ్చునా ? మీరా ప్రదేశము చేరి రెండు మాసములయినది. రెండు జాబులు మాత్ర మందినవి. మీ రచ్చటికి వెళ్లి నన్ను మరచితిరా ? నేను మరణించితి ననుకొంటిరా ? ఈ విధముగ మృత్యు ముఖమున కేఁగిన సంతోషకారణ మగునేమొ తెలియుటలేదు. సుందర ముఖ పద్మముల చూడ చూడ నే ననహ్యామైతినా ? మీ రెంత సుందరాంగులని భ్రమించినను శ్వేతాంగులే కాని యుండగత్తె లెన్నటికిఁ గానేరరు. దుస్స్వప్నములఁ గాంచు చుంటి. నా మనస్సేమియు బాగుండలేదు. ఉత్తరములందక పోవుటచే దురాలోచనచే మనస్సు కలవర మొందుచున్నది. పది దినములనుండి చాటపట్టునుండి జాబులు వచ్చుటలేదు. మీకు తంతి పంపవలెనన్న నెంత ధనము వ్యయపరచవలెనో

గదా! అదియునుగాక మరల మీ రీయవలెను గదా? లేనిచో లాభమేమి? ఏమి వ్రాయుటకుఁ దోచకున్నది. ఏమి వ్రాసిన నేమి, 45 దినములకుఁ కందును గదా! మీకా జాబులు వ్రాయుట కష్టముగనున్నది. మీరు నన్ను స్నేహితులతో సమానముగ భావించుచున్నారా? స్నేహితులకు వ్రాసినపుడు నాకు వ్రాయ వలెనా? భోగసౌఖ్యములకే భార్య లవసరము కాని లేనిచో వా రెందుకు? భార్యలు మీ క్రీడార్థము వినియోగించుకొను కంటకములే గదా! వివాహ మెందులకయినదో? విద్యాభి వృద్ధికి వీలుగనుండుననియు, విద్యాసంపన్నులకడకుఁ బంపి పండి తురాలను జేసెదననియుఁ జెప్పి నన్ను మోసపుచ్చి యీ విధిఁ జేసితిరి కదా! విద్యకొరకు భ్రమజెంది మిమ్ము వివాహమాడి తిని. కాని యిప్పుడేమి లాభము? మీ రక్కడ, నే నిక్కడ మీకొరకు నాహృదయ మెంత కలవరపడుచున్నది? మీరు విద్య సంప్రాప్తిఁ జేసిన తరువాత వివాహమాడిన నెంత బాగుండెడిది? అన్ని విధముల నన్నుఁ గష్టములపాలు చేసితిరి. నా మనస్సేమియు బాగుండలేదు. మీకడనుండి పైసయైనను రానప్పు డేమి లాభము? ఇదివరకున్న వీలిపుడు లేదు. అది మీ తప్పిదము కాదు. స్వతంత్రుఁడు కాక ధనసంపాదనము లేని పురుషుని పెండ్లియాడుట నా యల్పబుద్ధి కాని వేఱు గాదు. ఈ యుత్తర మిట్లు వ్రాయుటకు నాకే కష్టముగ నున్నది. మీ కెట్లుండునో? ఈ యుత్తరమును చించివేయ

వలెనని బుద్ధి పుట్టుచున్నది. మనస్సు బాగుండక యివన్నియు నెట్లు వ్రాయఁగలిగితినో ? నన్ను క్షమింపుము.

ఇట్లు,
మీ ప్రియమైన
అన్నా.

## 13 వ లేఖ

" స్వర్ణనికేతనము "
**30-11-20.**

నా ప్రియమైన నీమా,

మీ యనుగ్రహ లేఖలకయి నిరీక్షించి నిరీక్షించి నేను విసిగిలిని. నా కుత్తరముల వ్రాయుట కాలమును వ్యర్థ పుచ్చుట యని తలంచెదరా ? మంచిది. మీ రట్లు తలంచు నెడల ఆ విషయము నాయొద్ద నెందులకు వెల్లడింపరు ? మీ యొద్దనుండి లేఖ వచ్చేవరకు నేను వ్రాయరాదని సంకల్పించి తిని. మీ క్రిందటి యుత్తరము 9-వ తేదీని చేరినది. 20 దిన ములు గతించినవి. ఉత్తరములు వచ్చు సూచన కానరాదు. అమెరికాకు వెళ్లిన పిమ్మట మీరు గొప్పవా రయిపోతిరని కాబోలును. మీవంటి గొప్పవారికి నావంటి సామాన్యులకు లేఖలు వ్రాయుట సాధ్యముకాదు. ఇది నిశ్చయము కాకేమి? మీ రొక సంపన్నులును, అభిమానపూరితులునునగు అమె రికా దేశీయులు. నే నొక పేద హైందవబాలికను. నేఁడు మీకును నాకును గొప్ప భేదము కలదు. మీ కండ్లకు నే

నొకదరిద్ర భారతీయ బాలికనుగాఁ గాన్పించినను నేను నా ప్రియ జన్మభూమికయి గర్వపడుచున్నాను. ఒకనాఁడీ భరత మాత గొప్ప సామ్రాజ్యములలో నొకటియై ప్రపంచమున కలంకారమైయుండెను. తన అయోగ్యులగు పుత్త్రిల కారణముచే నామె కీర్తి యంతరించినది.

మీ రెందులకు లేఖలు వ్రాయుట మానిరో అయ్యది నాకుఁ దెలియకున్నది. తంతివార్త పంపి వ్యర్థముగా ధనవ్యయము చేయ నా కిష్టములేదు. నేను తంతి నంపిన మరల మీ రీయవలయును గదా! దానికై 50 రూపాయలు నష్టమగును. ఈ వారము లేఖ రానిచోఁ దంతి నీయవలయునని యున్నది. ఇప్పుడు జాబులు రాకపోవుటవలన మీ రస్వస్థతతో నున్నారని కాదు. నా యదృష్టమేమి!

మీరే నా జీవితజ్యోతి. ఆ జ్యోతి బాగుగాఁ బ్రకాశింపనిచో నీ జీవితము నిష్ప్రయోజనము. అట్టిచో నా యీ జీవితపుష్పము సంపూర్ణవికాసము నొందక మొగ్గగానున్నపుడే మాడిపోయిన మంచిది.

మీ ప్రేమలేఖకయి కడు నాసక్తితో నిరీక్షించుచున్నాను. ఏప్రియలు, మే మాసములలో బయలుదేర నిశ్చయించితిని. ప్రతి దినము నేను మీ యుత్తరములకై మిక్కిలి యాసక్తితో నిరీక్షించుచున్నాను. ఏ విధముగనైన నొక

చీర నమ్మి తంతిఁ బంపఁగలను. గాని మీరు మరల నిచ్చుటకు దూరదేశమున కష్టపడెదరు. నేను దరిద్రురాలను. ఏ విధముగను ధనము వచ్చు నుపాయములేదు. నా హృదయము దుఃఖజ్వాలచే దగ్ధమగుచున్నది. ఇందువలన ఆది తలవని తలంపుగ నేననుకొనకుండనే నా లేఖలయం దచ్చటచ్చట బహిర్గతమగుచున్నది. కాని నా ఇక్కడి కోర్కెలన్నియు అస్థిరములు. స్థిరమగు సౌఖ్యము మీరే. మీరు సౌఖ్యముగా నున్నారని వినుటకై నను నా కిప్పు డదృష్టము లేకున్నది. వివాహమైనపుడు భార్యాభర్తలు దరిద్రులైననేమి? మీరుండిన మీతో భిక్షమెత్తుటయు నా యదృష్టమనియే భావింతును. పత్నికిఁ బతితప్ప వేఱు గతి యేమున్నది.

ఇట్లు
మీ ప్రియమైన
అన్నా.

## 14 వ లేఖ

"స్వర్ణనికేతనము"
10-12-20.

మహారాజశ్రీ మాగంటి బాపినీడుగారికి,

అయ్యా,

మీకడనుండి లేఖలు 40 దినములనుండి వచ్చుటలేదు. నాకు వ్రాయుటకు మీకే మాత్రము వాంఛలేనప్పటికి నేను

ప్రతివారము నా కర్తవ్యానుసారముగ వ్రాయుచున్నాను. మీ జాబులు వచ్చు తావులనుండి మీ క్షేమసమాచారముల నారయుచుంటి. మీరు ప్రతిజ్ఞాపూర్వముగఁ బలువురు ప్రజల సమ్ముఖమునఁ బెండ్లియాడిన ధర్మపత్నికే మీకు క్షేమము వ్రాయుటకు సమయాభావమైన నాకెట్లు వ్రాసెదరు? ఏల నేను జాబు వ్రాసి మిమ్ము శ్రమపెట్టవలెను? ప్రపంచ మెంత మాయామయము. పరదేశమునం దడుగిడునంతనే భార్య యున్నదని మరచితిరా? మృతిఁజెందిన దనుకొనుఁడు. మీరు జాబులు వ్రాయకపోవుటకు కారణము తెలియువరకు నేను వ్రాయుటమానను. మిమ్ముల విసివించుచుందును. పెద్ద యుత్తరము వ్రాయ నిచ్ఛయున్నప్పటికి మీకు సమయముం డదని వ్రాయుటలేదు.

ఇట్లు,
మీ అన్నా.

## 15 వ లేఖ

స్వర్ణనికేతనము,
14-12-20.

నా ప్రియమైన నీడూ,

సంతోషకరమగు మీ యుత్తరమును బొంది నే నెంత యానందించితినో మాటలతో వెల్లడించుట సాధ్యపడదు. మీ చెడ్డనడతను విమర్శించుచు నొక పెద్ద జాబు వ్రాయ నెంచితిని. అట్టి యుత్తరము రానందులకు కొంతవరకు మీ

రదృష్టవంతులే. ఇన్నాళ్లనుండి నా కెంత కోపముగానున్నదో మీారే యూహించుకొనవచ్చును.

నే నిదివరకే డాక్టరు కర్లిరును శీతోష్ణస్థితి విషయమై యడిగితిని. ఆమె కాలిఫోర్నియాలో గాని, కొలంబియా శీతోష్ణస్థితిని నేను సహింపఁగలనని చెప్పినది. మిమ్ములను గూడి సంతసముగ జీవితయాత్ర గడుపుటయే నా యుద్దేశ్యము గాదు. మన ధనమైన నట్లు చేసియుందునేమొ! పరుల సహాయముచే రానున్నప్పుడు జాగరూకతతో విద్య నభ్యసించి వారిని సంతృప్తిపరచవలెను గదా! అట్టి నా ధర్మము నే నెంతవరకు నెరవేర్చఁగలనో తెలియదు. మన మిరువుర మొక్క స్థలముననుండిన నుభయుల విద్య భంగమగు నని నా తలంపు.

ప్రథమము మీాకడ రెండు మాసములుండి ఆంగ్ల భాషాభివృద్ధి చేసికొన్న పిమ్మట నెచ్చటనైనఁ బ్రవేశించెదను. మొట్టమొదట లండను వెళ్లుమని వ్రాసితిరి. ఎచ్చట నుండవలెను? ఎవరు నాకు సహాయము చేసెదరు? మీా రక్కడ నుండి యింగ్లాండు వచ్చిన నెంత ధనము కావలసియుండును? శ్రీమతి సరోజినీ దేవిగా రచ్చటనే యున్నారు. నే నిచ్చటికి వచ్చి 45 దినములయినది. ఆమె త్వరలో వచ్చునట్లు లేదు. వచ్చినను నావంటి మూర్ఖులకు విద్య గఱపుట కామె కెక్కడ నవకాశముండును? అట్టి గొప్పవారివద్ద జ్ఞానమును బడయఁ గోరు వ్యక్తి సమస్తమును క్షుణ్ణముగా నెరిగియుండవలయును.

నే నిచ్చట పద్మజవద్ద నేమియుఁ దెలియని పశువువలెనున్నాను. మూర్ఖురాలనై యున్నాను. విద్యావిషయములందని నా యభిప్రాయము. ఇచ్చట నందరు గౌరముగఁ జూచుచున్నను, అంత గౌరవమునకుఁ బాత్రురాలను గాను.

నా దేశీయులతోఁడ నే మాట్లాడుటకు నధైర్యపడుచున్నపుడు, తెల్లవారితో సమానముగ మాట్లాడుట నాకు సాధ్యమగునా? స్త్రీలయెడ వర్తించునట్లు నే నెందులకుఁ బురుషులయెడ ప్రవర్తింపలేకున్నానో నాకే యాశ్చర్యముగా నున్నది. క్రొత్తవారితో నేమి మాటాడవలయునో నాకుఁ దెలియదు. నేను మీయొద్దకు రాకపూర్వమే యివియన్నియు నేర్చుకొనవలయును. నేసీ మర్యాదల నన్నింటిని నేర్చుకొనవలయునని నా శక్తికొలఁదిఁ బ్రయత్నించుచున్నను, యిప్పటివరకు నేర్చుకొనఁజాలనైతిని. ఇందు నా లోపమేమియు లేదని నా నమ్మకము. బాల్యమునుండియు నే నెట్లు పెంచఁబడితినో మీరే యెరుంగుదురు.

నేను మీయొద్దకు వచ్చినపుడు యింగ్లీషువేషమును ధరింపఁ దలఁపలేను. హిందూస్త్రీలై యుండి ఆంగ్లవేషమును ధరించు టెంత లజ్జాకరము?

నేను నా హైందవవేషమునే మిక్కిలి ప్రేమించెదను. ఉన్నిబట్టలను కొనుక్కొనుట తప్ప నాకు వారి వేషమునను కరించవలసిన యవసరములేదు. నేను ఇచటనుండి నా చీరలను దీసికొని రానిశ్చయించితిని.

తెనుగు భాషయం దక్కడక్కడ దొరలుచుండు తప్పులను పండితుల నడిగి తెలిసికొనవలయును. నేను జనవరి మొదటి వారములో నెలూరు వెళ్లుచున్నాను. స్వగృహమున నేను సంక్రాంతి పండుగ చేసికొనఁ గోరుచున్నాను. ఇంటివద్ద నుండి మీ కేమయినఁ గావలయునా? మీరు మీయొక్క యుత్తరములో నాకయి చిత్రపటములు సేకరించియుంచినానని వ్రాసియున్నారు. అవి యెచ్చటనున్నవి? మీరు మీ మేనకోడలికిఁ బంపఁగలిగినపుడు నాకేల పంపియుండలేదు. వివస్త్రలగు శ్వేతాంగనల చిత్తరువులను పిన్నలకు పంపుట నా కిష్టము లేదు. ఈసారి మీ రీ విధముగఁ జేయరని తలంచెదను. వారికి మనోహరములును, ఆహ్లాదకరములును బుద్ధిగరప సాధనములును అగు చిత్తరువులఁ బంపుటకే యత్నింపుడు. మీరు నాకు నుత్తరములు వ్రాయలేదని తెలిసి యందరును ఆశ్చర్యపడుచున్నారు. మిమ్ము గురించి నే నబద్ధములాడ నారంభించితిని. ఒక పోస్టుకార్డైని వ్రాయ మరువవలదు. నేను త్వరలోనే యిచ్చటినుండి బయలుదేర నిశ్చయించితిని. గుంటూరు శ్రీమతి పారు కన్యతో నొకమాసము గడపుటకు వాగ్దానము చేసియుంటిని. శ్రీమతి మెకాలె దొరసాని తనతో గొంత కాలముండుటకు నన్నాహ్వానించినది. నేను వారి యాచారమర్యాదలు నేర్చుకొనుటకయి తప్పక ఆమెయొద్దకు వెళ్లవలయును. ఇప్పుడు నేను గరిటెలు వగైరాలతో భుజింపఁ

గలను. నేను నా యింగ్లీషుభాషా జ్ఞానమును వృద్ధిఁజేసికొన యత్నించుచున్నాను. విద్యార్థివేతన మేమయినది? రావుగా రెచ్చటనున్నారు? ఆయన యెవరికి సాయ మొనరింపనున్నారు. ఎంత? అమెరికాయందలి విద్యార్థివేతనముల విషయ మేమయినది? నాయుఁడుగారికి గోపాలకృష్ణయ్యగారికి మీరేమి వ్రాసియున్నారు? వి. రామకృష్ణ, ఐ. సి. ఎస్. గా రెచ్చటనున్నారు? నేను విద్యార్థివేతనమునకై ప్రయత్నించుచున్నను, నేటివరకు నా కోరిక నెరవేరలేదు. ఒకవేళ నేను విద్యార్థివేతనము బడయఁజాలకపోయినచో నేను విదేశములకు వెళ్లుట సాధ్యపడదు గదా!

మీ మిత్రుడు హరిశ్చంద్రుడుగారు మీకు సాయము చేయుదురని నేను నమ్మను. నే నాయనవద్దనుండి గొప్ప సాయము లభింపఁగలదని నమ్మితినిగాని తుదకునిరాశచెందితిని. ప్రస్తుతము ఆయనవద్దనుండి నాకు నుత్తరములుకూడ వచ్చుటలేదు. నా మూఁడుత్తరముల కాయన జవాబు వ్రాయవలసియున్నాఁడు. కాఁబట్టి నే నిపుడాయనకు వ్రాయఁదలఁపలేదు. నా పుస్తకములఁగూర్చి నా కేమియు తెలియదు. నేను వ్రాతప్రతులను పంపి చాల కాలమైనది. ఇంకను ప్రచురింపఁబడలేదు.

పెన్సిలుతో వ్రాసినందులకు క్షమింపుడు. మీ దస్తూరి నాకు తెలియదేమోయని భయపడుచున్నాను. కమల

విషయము, ఆమె యిపుడు తన యత్తవారింటివద్ద నున్నది. ఇంతట శెలవు. 9 గంటల 30 నిమిషములు.

ఇట్లు,
మీ ప్రియమైన,
అన్నా.

## 16 వ లేఖ

"స్వర్ణనికేతనము",
హైదరాబాదు,
21-12-20.

నా ప్రియమైన నీదూ,

మీ వద్దనుండి జాబులు లేవు. జాబులు వ్రాయుటకేల యింత సోమరితనము? ప్రతిదినము మీ ప్రేమపూరితమగు లేఖ కొరకు నిరీక్షించుచుండ నిరాశయే కలుగుచున్నది. నావిషయ మేమి యాలోచించితిరి? రావుగారు ఎంతసాయముచేయఁగలరు? నేను జనవరి మొదటి వారములో ఏలూరు వెళ్లవలయునని యున్నది. పరదేశముననుండి జాబు వ్రాయకున్న మాకెంత కలవరముగనుండును! నేనిదివరకు ప్రతివారములో జాబులు వ్రాయుచుంటిని. మీకెందుల కందలేదో తెలియకున్నది. మీ రెవరెవరికి విద్యార్థివేతనమును గురించి జాబులు వ్రాసినది దయచేసి నాకు వ్రాయుఁడు. నేను క్షేమముగనేయున్నాను. నాయనగారింకను వర్తకము ప్రారంభించలేదు. డబ్బుకయి

చాల కష్టపడుచున్నారు. ఇరువంకల సహాయము లేదు. మిమ్ములను పెండ్లియాడి నాకేమి లాభము ? ధనసహాయము లేదు గదా ! ఋణవిముక్తులమైనను బాగుండెడిది. మీ వ్యవహార మేమయినది.

రాత్రి జాబు వ్రాసియుంచుట మరచితిని. ఇప్పుడు వ్రాయుటకు సమయములేదు. పోస్టువేళ అయినది. తొందరగా వ్రాసితిని.

ఇట్లు,
మీ ప్రియమైన,
అన్నా.

17 వ లేఖ

"స్వర్ణనికేతనము",
హైదరాబాదు,
30-12-30.

నా ప్రియమైన నీడూ,

ఈ వారములో మీవద్దనుండి మూడు ఉత్తరములు వచ్చినవి. అది నిజముగా నా యదృష్టమే. నవంబరు 13-వ తేదీ లేఖ యిచ్చటికి 26-వ తేదీకి చేరెను. నవంబరు 17-వ తేదీ మీరు వ్రాసిన జాబు 25-వ తేదీకి చేరినది.

మీకు డబ్బు చాల నవసరముగానున్నదని విని మిక్కిలి విచారించితిని. మీ కెంతో సాయముచేయ మనసు

ఆతురతనొందుచున్నది. కాని నేనేమి చేయఁగలను? తంతికి మీకారెంత చెల్లించవలసియుండును? మీరు మూఁడు తంతులకు వెచ్చించిన పైకము నాకు 15 దినముల ఖర్చునకు సరిపోవచ్చును. పోనిమ్ము. నేను మీ ఆర్థికవిషయములలో జోక్యము కలిగించుకొనను. నేను త్వరలో ఏలూరు వెళ్లుచున్నాను. ఏలూరు వెళ్లిన పిమ్మటనే నంతియు నిశ్చయించుకొందును. కె. వి. రెడ్డి నాయుఁడుగారు మంత్రియయినారు. రామచంద్రరావుగారు కాలేదు. నేను దరిద్రురాలనని మీరు వ్రాసియుంటిరి.

భార్యలు ధనాఢ్యలయి యుందురని యాసించితిరా? పత్ని ధనము ద్వారా పతి జీవితయాత్ర గడపుటయా? పత్ని యందు మీకు ప్రేమయా, లేక యామె ధనమునందా? ధనము, ధనమాత్రముచేతనే పురుషుల కానందము కలుగును కాబోలును.

నిజమే. హిందూసతులు ధనాఢ్యలయి యుండవలసినదే. కారణమేమన వారి భర్తలు నిష్ప్రయోజకులు. ఈ కట్టుబాటు కేవలము నిర్భాగ్యులగు హిందూ సుందరీమణుల కేగలదు. మీరు అమెరికా వెళ్లిన ప్రయోజన మించుకేనియు కలుగలేదని నా కాశ్చర్యముకలుగుచున్నది. ఇంకను మీరు జ్ఞానశూన్యులగు నిచ్చటి కొందరివలె సంకుచితహృదయులును దురాశాపరులునగు పురుషశ్రేణిలోనే కలిసియున్నారు. పత్ని

దరిద్రావస్థయం దున్నయెడల పతి దరిద్రుఁడై యుండవలెను. నా తల్లి దండ్రు లెట్లుండిననేమి? మీ యవస్థ యెట్లున్నదో యాలోచించుకొనుడు. మేము ధనసంపన్నులమైనది కానిది మీ కెరుకలేదా? ఇప్పుడే కనుగొంటిరా? మీకు కన్యా శుల్కమన్న నింత వాంఛయున్నదా? పరులకు హితోపదే శము చేయుటయే భారతవర్ష యువకుల కర్తవ్యమా, లేక దానిని కార్యరూపమున నిర్వహించుటయా? మీరింత బుద్ధి హీనులని నే నెన్న డనుకొనియుండలేదే? మీ యీ ధన తృష్ణను పూర్వమే వ్యక్తీకరించిన కమ్మ జననీజనకు లొకరు మీకుఁ దమ పుత్రిక నమ్మియుండెడివారు గదా! ఆ ధనమును మీరు పరదేశమున బాగుగ వ్యయపరచ వీలుండెడిది.

ఇప్పుడా యోచనలన్నియు వ్యర్థము. మీకు వలయు ద్రవ్యసహాయము నాకడనుండి పొందలేదని నన్ను నీచురాలిఁగఁ దలంచుచుంటిరా?

నేను తెలివితక్కువదాననని యెరుంగుదును? ధనము లేనిదాననని యెరుంగుదును; నేను అందము లేనిదాననని యెరుంగుదును. నేను పరిశుద్ధురాలనుగాననికూడ నాకు తెలి యును. నేను ఆత్మసమర్పణశక్తి లేనిదాననియు, పరుల కెట్టి యుపకారమును చేయఁజాలనిదాననియు, నేను మీ ధర్మ పత్నిగ నుండుటకే తగియుండలేవనియు నాకు తెలియకపోలేదు.

ఐనను నేను మీరు తలంచునంతటి క్షుద్రురాలనుగాను. మీ యభిలాషకుఁ బ్రతికూలముగా నన్ను వివాహమాడ మిమ్మె వరు నిర్బంధించిరి? మీరు నన్ను వివాహమాడకున్న నే నవివాహితనై యుండెడిదానననియే మీ నమ్మకము కాఁబో లును. మన సంఘములో యోగ్యుఁడు, ధీమంతుఁడు, సం పన్నుఁడునగు వ్యక్తి లభించునని నేను తలంచనుగాని, హిందూదేశమున మీకంటె ధనాఢ్యుఁడు, ధీమంతుఁడు ఉన్నత విద్యాధికుఁడునగు వ్యక్తిని నేను బడయఁగలిగియుందు నని మాత్రము నే నెరుంగుదును.

ఈ విషయమున మీరు నాతో నేకీభవించరా? నే నింతకుఁ బూర్వ మెప్పుడును మీరు కట్నము స్వీకరించనందుల కును సంపన్నయగు భార్యను బడయనందులకును మిక్కిలి విచారపడుచున్నారని భావించియుండలేదు. నే నెప్పటికయి నను స్వయముగా ధనమును సంపాదించి నా యీ ప్రస్తుత ధనాభావలోపమును పూర్తిచేయవచ్చును. మీ యభిలాషను బూర్తిచేయుటకు నా శక్తికొలఁది యత్నించెదను.

నా భావివిద్యకయి మీరు విశేషమగు శ్రమఁబుచ్చు కొనుచున్నారని తెలియుట కెంతయు సంతసించుచున్నాను. మీ రిట్లు చేయుదురేని నేను మీకుఁ గృతజ్ఞురాలనయి యుండవలయునని తలంచెదను. మీకుఁ బంపుటకు నావద్ద

నట్టి సిఫారసు పత్రములును లేవు. విద్యార్థివేతనమునకయి ప్రయత్నించుచున్నాను. ఇతరులనుండి నేను సాయమును బడయఁగలుగుదునో లేదో నాకుఁ దెలియదు.

నా విద్యాసంబంధములగు విషయములన్నియు అక్కడకు వెళ్లిన తరువాత నిశ్చయింతును. మా కుటుంబముపై మీరేమియు నాశపెట్టుకొనవలదు. నేను నా దేశసోదరీమణుల కెవ్విధముగను సాయపడఁగలుగుదునని తలంపఁజాలక పోయితిని. అమెరికాలో నే ననుకొన్నంత విద్యను బడయఁజాలకపోవుదునేమొ యని సందియము కలుగుచున్నది. రామయ్య గాని, నారాయణరావు గాని నాతో అమెరికా వత్తురని యాశింపవలదు. బంధువులకంటె మిత్రులే యధికముగా సాయపడుదురు. నేను నా స్నేహితులనుండి గొప్ప సాయమును బడయుదును. కాఁబట్టి నేను బంధువులకంటె స్నేహితులనే యెక్కువగా విశ్వసింతును. ఇట్లు,

మీ ప్రియమైన

అన్నా.

## 18వ లేఖ

"స్వర్ణనికేతనము"
హైదరాబాదు,
7-1-21.

ప్రియమైన సీదూ,

ఈవారము మీయొద్దనుండి లేఖయే రాలేదు. 10, 11వ తేదులలో నే నిచ్చటనుండి బయలుదేరుటకు నుద్దేశించి

తిని. హరిశ్చంద్రుడుగారి యొద్దనుండి మీరు పైకమును బొందియుందురని తలంచెదను. ఆయనకు శేషగిరిరావుగారు పిదప జెల్లించుటకు వాగ్దానమొనరించియున్నాడు. ప్రస్తుతము తన స్వంతపైకమును ఆయన మీకుఁ బంపుట ఆయన దయయనియే చెప్పవలెను. ఏ రాజానుండియు నేను సాయముఁ బడయఁగలనను ఆశలేదు. యాచించుటకు ప్రస్తుతము సిగ్గుఁ జెందుచున్నాను. నా యాచనకు మీరే కారకులు. మీరు స్వంతభూములను గలిగియుండియు మీ భార్యయొక్క చదువు కొరకేల విక్రయింపరు? మీ సొమ్మునుగూర్చి మీకంత యాశక్తియున్నపుడు పరులనుండి సాయము నెట్లాశింపగలరు? యాచింపకయే స్వయముగ సమస్తము నేర్పాటు చేసికొన సంకల్పించితిని. నేను ఏప్రిలియలులో అమెరికాకు బయలుదేర నిశ్చయించుకొంటిని. ప్రవేశపరీక్షలోఁ గూర్చుండుట కేమేమి నేను చదువవలయునో దయచేసి తెలుపఁగలరా? గణితశాస్త్రము, ప్రకృతిశాస్త్రము, రసాయనశాస్త్రము, భూగోళశాస్త్రములను గూర్చి బాధపడుట నాకు ప్రస్తుతము సాధ్యము గాదని తలంచెదను. ఈ విషయములన్నియు మరచిపోయితిని. వీనినిపుడు చదువవలసిన-చో నేను ప్రవేశపరీక్షయందును, బి.ఏ. యందును గూర్చుండఁ గోరుటలేదు. నే వచటికి వచ్చిన పిదప సమస్తము నిశ్చయము కాఁగలదని తలంచెదను. జూను, ఆగస్టు మాసములో నేను నా యింగ్లీషు నభివృద్ధి చేసికొనఁ

గలను. మీరు నాకు సాయపడఁగలుగుదురని యాశించు చున్నాను. మీ క్రిస్టమసు సెలవుల నెచటఁ గడిపితిరి? మనకుఁ దోడ్పడ వాగ్దానము వెలువరించిన సంపన్నుని సాయమువిషయ మేమైనది? నన్ను గుఱించి మీరుగాని మనవారుగాని యోచించుచుండ నేను చూడఁజాలను. మీ కష్టములన్నింటికి నేనే కారకురాలను. నా శక్తికి మించియుం డినను నే నచటికిఁబోయి చదువుకొనవలయునని గొప్ప యాశను గలిగియున్నందులకు నన్ను నేనే నిందించుకొందును.

ఇట్లు,

తమ ప్రియమైన,

అన్నా.

## 19వ లేఖ

చాటపర్రు,
26-1-21.

నా ప్రియమైన నీమూ,

మీ రెండు యుత్తరములు చేరినవి. 19-వ తేదీని నే నిక్కడకుఁ జేరితిని. 24-వ తేదీని పిఠాపురము రాజాగారికి విజ్ఞప్తి పంపుకొంటిని. వారినుండి యేవిధమగు సాయము కలుగునని నే ననుకొనను. ఇపుడు నే నెందుల కాశించుట లేదో నాకే తెలియదు. నాయుఁడుగారు శీఘ్రముగ విజ్ఞప్తిని

బంపవలసినదిగా నన్నుఁ గోరిరి. కాబట్టి నేను పంపితిని. నాయుఁడుగారు నాయందు మిక్కిలి దయగలిగియున్నారు.

వచ్చే నెలలో సరోజినీదేవిగారు వచ్చుచున్నారు. నేను ఏప్రిల్ మాసాంతములోగాని మే మొదటివారములోఁ గాని బయలుదేర నుద్దేశించితిని. జె. కుప్పుస్వామిగారు (కమ్మవారు) విదేశములకు కరుగంగోరు కమ్మవిద్యార్థి కొఱకొక విద్యార్థివేతనము సేయఁబోవుచున్నారని నేను వింటిని. ఆయన పి. వి. సుబ్బారావుగారికి ముఖ్యస్నేహితుఁడు. ఈ విద్యార్థి వేతనముగురించి తెలుపు లేఖ వ్రాసితిని. మీరు సుబ్బారావు గారికి దానివిషయము ప్రయత్నింపవలసినదిగా వ్రాయండి. ఆ విద్యార్థివేతనమునకు నేను అర్హురాలనుగానిచో, నా కవసరమైన మొత్తమును వడ్డీలేకుండ నిచ్చిన నేను కొంతకాలములోఁ దిరిగి చెల్లింపఁగలుగుదును. కుప్పుస్వామిగారు సంపన్నులు. సుబ్బారావుగా రాయనను మనకుఁ దోడ్పడునట్లు చేయఁగలరు. కాబట్టి మీరు మీ స్నేహితునకు వ్రాయుట మంచిది. పైకమును బడయుటకు నా శక్తికొలఁది యత్నించెదను. డబ్బును బొందుటకుఁ బూర్వమే నా ప్రయాణమును నిశ్చయించితిని. టి. ప్రకాశముగారికి తదితరులకు మీరు వ్రాసియుంటిరా? మీ రిక్కడనుండినపు డేల ప్రయత్నించి యుండలేదు?

ఇపుడు మనవారి కెవరి కింగ్లీషుభాషయం దిష్టములేదు. నీవు వెళ్లి యచటఁగరచున దాంగ్లేయభాషయే గదా? అది యిచ్చటఁ జదువఁగూడదా! ఆంగ్లేయభాషయన్న నిచటివారి కసహ్యత పుట్టినది. అసహాయోద్యమము ప్రబలినది. ఆంధ్ర దేశమున సహాయనిరాకరణము ప్రబలినది. స్వరాజ్యాభిలాష హిందువుల హృదయములఁ బ్రవేశించినది. రాట్నములు పెట్టి ప్రతివారి యింటికడ నూలు వడకుచున్నారు. నాకుఁగూడ వడకుట తెలియును. హరిశ్చంద్రుఁడుగారు నా కిపుడు జాబులు వ్రాయుచున్నారు. తుదకు జాబులు వ్రాయకపోయి నను మన మాయన హృదయమందుఁ బ్రథమస్థానమునం దున్నామని వ్రాసిరి. గాంధిమహాత్ముని మూలమున దేశమం తయు నాందోళనముగనున్నది. మిగిలిన విషయములు తరు వాత వ్రాసెదను. ఫ్రెంచిభాష యిపు డెవరికడ నేర్చుకొనుచుం దురు? ప్రవేశపరీక్ష కేమి చదువవలయును? అన్ని విషయ ములు వ్రాయుఁడు. న్యాయశాస్త్ర సంగతి యేమయినది? తొందరగా వ్రాసితిని.

ఇట్లు,

మీ ప్రియమైన,

అన్నా.

## 20 వ లేఖ

చాటపల్లి,
2-2-21.

నా ప్రియమైన సీతా,

ఈ వారము మీయొద్దనుండి లేఖయే లేదు. కారణ మేమాయని నే నాశ్చర్యపడుచున్నాను. నేను పిఠాపురం రాజాగారికి పంపియుండిన అర్జీనిగురించి యిదివరకే మీకు వ్రాసియుంటినని యనుకొందును. విశేషప్రయోజన ముండదని తలంచెదను. ఏ వైపునుండియు నాకు న్యాయము కలుగునని నే నాశింపఁజాలకున్నాను. ఈ ప్రపంచములో నే నొక దురదృష్టవతిని. నేను నిజముగా సదృష్టవతినేయగుచో నీ కష్టములన్నియు కట్టకట్టుకొని నాకే యేల రావలయును! నే నెప్పుడైన నా విద్య నభివృద్ధిపరచుకొనుట కేమి చేయవలయునని యుద్దేశించినను ప్రతిసారియు అనుల్లంఘనీయములగు కష్టపరంపరలు నన్ను చుట్టుముట్టును. నేను స్వయముగా ధనము నెక్కడ సంపాదింపఁగలను? ఐశ్వర్యమును ప్రాముఖ్యమును లేని నావంటి స్త్రీ కెవరును పైకము నప్పుగానీయరని తలంచెదను. మన కుటుంబములలో నిరువంకలనుండియు సాయము శూన్యము. మన కుటుంబములనుండి యెట్టి సాయమును గైకొనవలయునను తలంపు నాకు లేదు. నే నిట్టి హీనావస్థ యందుండి విసువుఁజెందితిని.

కూడ నావలెనే యిట్టి స్థితియందుండి బాధపడకుండులాగున నేను శక్తికొలఁది ప్రయత్నించెదను. నా బిడ్డల నిట్టి స్థితియందుండఁ జూడఁజాలను. నా బిడ్డలకొరకును, నిరుపేదలకొరకును సాధ్యమైనంతగా ధనమును సంపాదించుటయే నా ముఖ్యోద్దేశము. ఒకనాటికి నేను నా యీ గొప్పవాంఛను నెరవేర్చుకొనఁ గలుగుదుననియు, నా బిడ్డలకొరకుగాని, నా నిమిత్తముగాని యాచింపకుండనుండఁ గలుగుదుననియు నమ్ముచున్నాను. మీ మిత్రులగు ప్రకాశముగారికిని, సదితరులకును మీరు పైకమునిమ్మని వ్రాసియున్నారా? నాకొరకేమి ప్రయత్నము చేయుచున్నారు? నాకు సాయమొనరింప వాగ్దానమొనరించిన మీ న్యాయవాద్యక్ష మిత్రునిగూర్చి తెలియఁగోరుచున్నాను.

మే మాసాంతమునకు నే నచటికిఁ జేరునట్లుగా ఏప్రిల్ మాసాంతములో నేను బయలుదేర నుద్దేశించితిని. నా డాక్టరుల సలహానుబట్టి నేను జూనుమాసమునకే యచటికిఁ జేరిపోవలయును. మే మాసమందే అచటకుఁ జేరిపోవుట మిక్కిలి మంచిదని తలంచెదను. నే నింతవరకు ప్యాస్‌పోర్టు (విదేశయాత్రానుజ్ఞ)ను, ఒక టిక్కెట్టును తీసికొనియుండలేదు. నా కెవరు తోడ్పడుటలేదు. అనేక శతాబ్దములకుఁ బిమ్మట మీ దేశ సోదరులు, సోదరీమణులు జాతీయవిద్యను గరచుచుండుట నూహించిన మీకు దేశభక్తి కలుగుటలేదా? ఏవిధము

గను మాతృభూమికి నేను సాయపడఁజాలకున్నందులకు విచారించుచున్నాను. మీరు నా సలహానుగూర్చి బాగుగా విచారింతురని తలంచెదను. మీరు (దైవికముగ) మీ యాస్తినే గోల్పోయినచో నేమి చేయగలరు? ఒకవేళ మీరు నిర్ధనులయియుందురనుకొనుఁడు. అట్టిచో మీరు మీ పోషణకయి ధనము స్వయముగ సంపాదించుకొనవలసియుండును గదా! కాఁబట్టి దేశమునకయి 5 యకరముల భూమి నొసంగుటచే నష్టపడిపోవుదురని తలంపవలదు. ఆ ధనము మీ స్వకీయదేశమగు హిందూస్థానమునున్నతిదశకుఁ గొనివచ్చుటకును, భారత భాగ్యోదయమునకును దోడ్పడునని నమ్ముఁడు. నేను కేవలమొక 5 యకరముల భూమిని మాత్రమే యడుగుచున్నాను. అధిక మడుగుటలేదు. ఈరీతి నొసంగుటచే మీ యకరముల సంఖ్య తగ్గునని తలంతురేని నే నొకనాఁటికి తప్పక సంపాదింపఁగలనని నమ్మ యకరములను కొంతకాలములో వీనికి మారుగా మీ కీయఁగలదానను. దేశములయొక్క యవసరములనుగూర్చియు, స్థితినిగురించియు నే నింతగ మీకు వ్రాయనగత్యములేదు. మీరు మిమ్మొక్కరినే హిందూదేశమునకుఁ దగిన పుత్రులుగా భావింపవలదు. అదియు మాటలలోఁ గాదు. ఆమె కిపుడు తోడ్పడుటయందే మీ రామె సుపుత్రులయియుండవలయును. మీ యాస్తినుండి 5 యకరముల

నెందుల కీయఁజాలరు ? మీ తండ్రిగారియొక్కయు, అన్నగారి యొక్కయు ననుజ్ఞ గైకొనువిషయమునను, దేశమున కీ మొత్తము నిచ్చు విషయమునను మీరు వెనుకాడుటను నేను వాంఛింపను. మీ స్వంతయాస్తినుండియే యొసఁగుఁడు. స్వార్థులుగ నుండవద్దు. మీ దేశమున కొసంగునది మీ రొక్కరేకాదు. నిజమయిన ప్రతి భారతీయుఁడును తన అయోగ్యులగు పుత్రులవలన బాధపడుచున్న మాతను దుస్థితినుండి సంరక్షింప శక్తి కొలది సహాయపడవలసియున్నది. అది మన యాస్తిని దగ్గించునని తలంపవద్దు. పరులకు మీరు సాయపడిన భగవంతుఁడు మీకుఁ దోడ్పడును. మీ స్వంత యాస్తినుండి యథమము 5 ఎకరములనయిన మీరు ఈయ వలసినదిగా నేను సలహా నిచ్చుచున్నాను. దేశము మీనుండి కొంత సాయము నాశించుచున్నది. మీరు దానిని మనః పూర్వకముగా నొసంగవలయును. లేనిచో నీ ప్రపంచమున జీవించియుండుటయే నిష్ప్రయోజనము. నన్ను గురించి వ్యాకుల పడవలదు. నేను మీ చదువును భంగపరచఁగోరను. నే నదృష్టవతినయియున్నచో నే నటకు రాఁగలుగుదును; లేనిచో నాయదృష్టమునకు నేను సంతుష్టిని జెందవలయును. జాతీయ పాఠశాలలు స్థాపింపఁబడుచున్నవి. దేశము తన బిడ్డలకయి విపుల ధనరాసులఁ గోరుచున్నది. ప్రతివ్యక్తియు తన యాస్తిఁ గొంత సమర్పించవలసియున్నది. మీరు భరతమాతయొక్క

నిజమయిన పుత్రులయియున్న మీ కీయఁగలిగినది త్యాగము చేయుఁడు.

ఇట్లు,

మీ ప్రియమైన,

అన్నా.

## 21 వ లేఖ

చాటపఱ్ఱు,

9-2-21.

నా ప్రియమైన నీడూ,

రెండు వారములనుండి మీ జాబులు నాకడకు వచ్చుటలేదు. కారణము తెలియకున్నది. మీరు నాయన గారికి వ్రాసిన జాబందినది. మీరు మీ మిత్రులకు జాబులు వ్రాస్తిరట. ధనసహాయము నిమిత్తమా? ఎవరికడనుండియు సాయము వచ్చునట్లు కన్పట్టదు. నిరాధారుల కెవరు ధనము నిత్తురు? ఇంతకాలము ధైర్యమవలంబించి యుంటినిగాని, ప్రస్తుతము నా మనస్సు చింతాసాగరమున మునిఁగియున్నది. "వివాహమయినందులకు లాభము లేకపోలేదు" అని వ్రాసితిరి. ఏమి లాభములు? వారమున కొకజాబైనను రాకపోవుటయా లాభము? సహధర్మిణికి వారమున కొకతూరి పత్రము లిఖించుటకయినను సమయాభావమా?

న్యూయార్కు విషయ మేమయినది ? ప్రవేశపరీక్షకు ఏమి చదువవలెను ? ఏప్రిల్ చివర వారములో బయలుదేర నుద్దేశించితిని.

నేను సీబారుగార్కి స్టీమరులో మొదటి తరగతి ప్రయాణమున కొక టిక్కెట్టు కొనుమని వ్రాసియుంటిని. నేను డాక్టర్లయొక్క సలహా ననుసరించి జూను మాసమునకే యచటకుఁ జేరిపోవలయును కావున నేను ఏప్రియలులో బయలు దేరెదను. శ్రీమతి సుబ్బారావుగారి సతిగారు తుదకు ఇండియాకు వచ్చినట్లు నాకుఁ దెలియవచ్చినది. మీకుఁ గానున్న అల్లుఁడు నాయుఁడు కుశలము.

నేను మీ తండ్రిగారిని నా దుస్తులకయి రెండు మూడు వందల రూపాయలు అడుగవలయునని తలంచుచు న్నాను. ఎప్పటివలెనే అంతయు నడచుచున్నది. డబ్బును వెచ్చించుటను మీ రాపివేయుటచే నేమి ప్రయోజనము ? నేను అడిగినను మీ తండ్రిగా రేమియు నీయరని నే నెరుంగుదును. ఇతర విషయములు మీతో గలసినపుడు మాట్లాడెదను. పరిస్థితులు అనుకూలముగనున్నచో 4 మాసములలో మిమ్ముఁ గలియఁగలుగుదును. మీ స్నేహితుఁడు రామయ్య తన చదువు చాలించినాడు. ఆయనకు దగ్గు వచ్చుచున్నది. ఇప్పుడు బాగున్నాఁడు. ఈవిషయమును మీవారికిఁ దెలుపవలదు.

నే నేమియుఁ జేయఁజాలకపోయినను దేశములోఁ బ్రస్తుతము సంభవించు నీ యాశ్చర్యకరమగు మార్పులం జూచుచుండెదను. ఏమియును జేయలేకున్నను, దేశభక్తులయి నను దేశమున కెంతయో యుపకారము చేసినవారగుదురు. కొన్ని దినములు నే నీసమయమున నిచ్చుటనున్నను లాభము లేదనుకొంటిని; గాని మనకు ఆంగ్లభాష అవసరములేనపుడు వ్యర్థముగ శ్రమపడనేల? హిందీ సంస్కృతము మొదలైన భాషలు నేర్చెదను. వీలయిన కాంగ్రెసుపక్షమున మగ్గములు రాట్నములు పెట్టించి దరిద్రులకు సులభమగు నెలలకు వస్త్రములు నీయఁదలచితిని గాని సాగునట్లగపడుటలేదు. మీరు లేనందున నే ననహాయురాలనైతిని. శోష్పదువారు కష్టట్టరు. నాదియనుటకు నా కేమి యున్నది? బిచ్చగాండ్రే నాకంటె సుఖముగ, తృప్తికరముగఁ గాలము గడుపుదురనుకొందును. వివాహమైనందుల కేమి లాభము? ధనముండిన నితరులకు సాయము చేయవలయును గదా! ఉన్నదాని ననుభవించుటకు వీలులేనపు డుండిన నేమి ప్రయోజనము? మీరు నిజముగ సరళహృదయులు.

మీరు పరీక్షయందు జయముగాంచినారా? ప్రతి వారము దీర్ఘలేఖల వ్రాయఁదలంతును గాని పోస్టువేళకు వ్రాయ ప్రారంభించుటచే వీలుపడకున్నది.

నేను నానకన్నద్దముల ప్రిస్క్రిప్షనును మీకుఁ బంపుచున్నాను. దయచేసి స్ప్రింగు లేని సులోచనములు తెండు. మీ సోదరి పోతుదూరు వెళ్లిపోవుచున్నది. మీ ప్రియమైన కోడలు కమల లలితాంబవద్ద కుత్తరహిందూస్థానము చూచుటకు వెళ్లియున్నది. నేటి కింతయే వార్తలు.

ఇట్లు,
మీయొక్క
అన్నా.

22 వ లేఖ

చాటపఱ్ఱు,
16-2-21.

నా ప్రియమైన సీడూ,

మీరు దయతో వ్రాసిన లేఖ చేరినది. న్యాయార్కులో నెట్టి సాయము లేకపోయినందులకు విచారించుచున్నాను. పిఠాపురం రాజాగారియొద్దనుండి జవాబులేదు. ఎవరును నాకుఁ దోడ్పడరనియే తలంచెదను. హిందూదేశమందలి మూలమూలలను సహాయనిరాకరణోద్యమము తీవ్రముగా వ్యాపించుచున్నది. ఎవరును ఆంగ్లభాష ప్రేమించుటలేదు. ప్రస్తుతము ప్రతి వ్యక్తియు, తుదకవిద్యావంతులు సయితము అమెరికా వెళ్లవలదని నన్ను నిరుత్సాహపరచుచున్నారు. నే నింగ్లీషు నేర్చుకొనుట కెవరికి నిష్టములేదు. నేను ప్రయాణ

మున కనుజ్ఞను బడసితిని. నేను దుస్తులు గొంటిని. నే నేమి చేయనగును? గ్రాహం అండుకో వారివలన నేను మొదటి తరగతికి 120 పౌనులు రుసుమనియు, రెండవ తరగతికి 100 పౌనులనియుఁ దెలిసికొంటిని. మొత్తమున నీప్రయాణము నకే 2000 రూప్యములు వ్యయమగును. ఇంత మొత్తమును వెచ్చించిన పిమ్మట నేను దేశమున కిప్పటికంటె నెక్కువ ప్రయోజనమును నిర్వహింపఁగలుగుదునని మీరు తలంతురా? పశ్చిమదేశముల కేఁగుటచే నే నిప్పటికంటె నధికముగా దేశసేవ సలుపఁగలుగుదునేమోయని యప్పుడప్పుడు తలంచుచుందును. వివిధ ప్రదేశములఁ జూచుటవలన నేను జ్ఞానమును సంపాదింపఁగలుగుదును. పత్రికాసంపాదనకళ నభ్యసించుట యనవసరమా? నేను బి. ఏ. యం దుత్తీర్ణురాలను గావలయుననియు, సులభసాధ్యమగుచో, పత్రికాసంపాదన కళాభిజ్ఞురాలను గావలయుననియు నెంచితిని. నే నచ్చట 4, 5 సంవత్సరములు గడుపనెంచితిని. కాని యిప్పుడు రెండు సంవత్సరములే యనుకొనుచున్నాను. నేను అటకు వెళ్లనా లేక తెనుగు సాహిత్యమును, సంస్కృతమును వృద్ధిజేసికొననా? నా బుద్ధికిఁ గనిసము రెండు సంవత్సరములేని యటనున్న బాగని తోఁచుచున్నది. మీ సలహా యేమి? దేశమిట్టి సంచలనమునందున్నప్పు డిద్దానిని వీడిపోవుటనుగూర్చి తలంచిన నాకే సిగ్గగుచున్నది. ప్రస్తుతము విద్యావిహీనులే విద్యార్థి

కులకంటె దేశమునకు సహాయభూతులుగను, కర్మయోగులుగ నున్నారు. కార్మికులలోను, రైతులలోను, వ్యాపారులలోను అధిక సంఖ్యాకులు అసహాయవాదులుగనున్నారు.

ఇట్లు,
తమ ప్రియమైన
అన్నా.

## 23వ లేఖ

చాటపర్రు,
2-3-21.

నా ప్రియమైన సీడూ,

మీ రెండు జాబులు చేరినవి. నేను గతవారము వ్రాయఁజాలక పోయినందులకు విచారించుచున్నాను. నా రాకను గూర్చి వ్యాకులపడవలదు. ఈ సంవత్సరము నే నిటనే యుండుటకు నిశ్చయించుకొంటిని. మాతృదేశ మిట్టి యద్భుతమగు నుద్యమములోనుండగా దీనిని విడిచిపోవు నుద్దేశ్యము నాకు లేదు. నా స్వంత పైకముతో వెళ్లఁగలిగినపుడే వెళ్లెదను. వచ్చే వారము విషయములన్నియు వ్రాయుదును.

ఇట్లు,
మీయొక్క,
అన్నా.

## 24 వ లేఖ

చాటపఱ్ఱు,
9-3-21

నా ప్రియమైన సీదూ,

మీ యొద్దనుండి జాబులులేవు. సర్వశక్తి సంపన్నుని యనుగ్రహముచే మీరు కుశలమనియే నమ్మెదను. అమెరికా వెళ్లుట కుద్దేశ్యములేదు.

సహాయ నిరాకరణోద్యమ మధికముగాఁ బ్రబలినది. ఈ తరుణమున నిచటనుండి యితరదేశములకేగుట యుచితముగా నాకుఁదోఁచదు. ఇక్కాలమున జీవించు వారందరు ధన్యులే. స్వాతంత్ర్యమును గోల్పోయి పరాధీనులయి బుద్ధిహీనులుగనున్న హిందువు లిపుడుగదా స్వరాజ్యము నభిలషించుచున్నారు! భరతవర్షమునందు శక్తి స్త్రీ పురుషుల యందుఁగల్గినది. ఆశక్తి నడిపించుచున్న వాఁడెవఁడు? దేశభక్తుఁడు; సరళహృదయుఁడు; సర్వజనప్రియుఁడు; ఈశ్వర ప్రియుఁడు; సర్వదాభగవంతుని ధ్యానించువాఁడు; మానవులందరియెడ నేక విధమగు ప్రేమను గలిగియుండువాఁడునగు మన గాంధియే. ఈ మహాపురుషునిఁ గన్నతల్లి యెంత పుణ్యాత్మురాలోగదా! అత్తరి...............శ్రీరాముఁడుద్భవించియుండినట్లు, ఇపుడీ మహానుభావుడు.................. అవతరించెను.

భగవంతునకు బిడ్డలందరు సమానులే............ యీశ్వరుఁడు తానీరూపమున వచ్చినట్లున్నది. కాలము మన పక్షమయినది. స్వరాజ్యము చేరువలోనున్నది. ఎందరినో ...............గారాగారమునందుంచుచున్నారు. ఆంధ్రులలో.........చెరుకువాడ నరసింహం, పట్టాభిసీతారామయ్యా, టి. ప్రకాశం, కొండా. వెంకటప్పయ్యగార్లు మున్నగువారు దేశముకొరకనేక విధముల పాటుపడుచున్నారు. ఈ సమయమున మీరుండిన నెంత బాగుండెడిది?

మీ సోదరుని విద్య సమాప్తమయినది. జబ్బుగానుండుటచే నీ సంవత్సరము మాని నాఁడఁట. విద్యయింక సాగునని నమ్మకములేదు. వివాహమైన నెందరకు విద్య లభించును?

ఇట్లు

మీయొక్క

అన్నా.

25 వ లేఖ

చాటపఱ్ఱు

17-8-21

నా ప్రియమైన నీడూ,

మీ ప్రేమ పత్రమునందు కొంటి. అయ్యది గతదినమే చేరినది. నే నుపన్యాసమిచ్చువిధము నభ్యసించుచున్నానని

వ్రాసియుంటిరి. ఏమి యిచ్చితిని? నేనే మీాయఁగలను? భార్య లెంత యవివేకలయిన భర్తలంతగా నానందించెదరు గదా! నాయీా యల్ప విద్యాభివృద్ధికి మీారెంతగ నానంద నిమగ్నులగుట నాకత్యంతము నాశ్చర్యకరముగ నున్నది. నేను విద్యావతినని, కవయిత్రినని, జ్ఞాన సంపన్నననిమీారేల భ్రమపడుచున్నారు? ఓయీా, యున్మత్తుఁడా! నీబుద్ధి కుశలతకు నేను మెచ్చుటయు, నా జ్ఞానమునకు నీవు గర్వపడుటయు సరియా? సత్యముగ నేను విద్యావతినైనఁ బలువుర కుత్సాహమును గలిగించి దేశమునకు లాభమును గలిగింపవలెను గదా! నేను మీారు నొకరి విద్యాబుద్ధులకొకరు సంతసించుకొన్న చాలునా? ఈ నిష్ప్రయోజనమగు విద్య నాకెందుకున్నదాయని మిగుల వగచుచుంటిని.

నాకిపుడు పరదేశములకేగి విద్య నభ్యసింపవలెనను వాంఛ నశించినది. దేశసంచారము చేసెదను. మీా రెంతకాలమట నుందురు? మీారు కొన్ని మాసములకు వత్తురనగా నూతన ప్రపంచమునుజూడ నేతెంచెద. దేశమున కుపకారము చేయఁజాలకున్నందులకు విచారముగనున్నది. ప్రతివారము మీాకు దీర్ఘలేఖల వ్రాయఁదలఁచియు వ్రాయుటలేదు. నా జాబులు మీాకడకు యథాసమయమున వచ్చుటలేదని మీారు వ్రాయుదురు. మీారేల నాకు ప్రతివారము లిఖించుటలేదు? ఈ సమయమున మీారుండిన దేశమునకును నాకును నెక్కువ

సహాయముగ నుండెడిది. మీరు సాధ్యమైనంత త్వరలో నిక్కడకు నేతెంచుటకుఁ బ్రయత్నింపుఁడు. మీరు వివాహమునకుఁ బూర్వము నుడివినట్లు నాకువచ్చు ధనమును పంచి యొసంగుఁడు. అందువలన నుభయులకు లాభముండును. ధనము వ్యర్థముగ వ్యయమగుచున్నది. జాగరూకతగ నున్నచో వేలుండుటకేమి కారణము? మీ విద్య కెంతయయినది. అయిన దంతయు మీవలన నష్టమువచ్చినదా? సరళహృదయుఁడా! నీ వికనైన మేల్కొనుము. ఇంతకాలమెట్లు గడపితివో! ఇఁక వీలులేదు. భార్యవచ్చినది. బిడ్డలువత్తురు. వారిని కష్టముల పాలు చేయకుము. చిరకాలము దుఃఖింతురు. మేల్కొనుము. స్వతంత్రుఁడవుకమ్ము! స్త్రీని మోసపుచ్చకుము. పరిష్కరించుము. తొందరపడుము.

ఇట్లు

తమ ప్రియమైన

అన్నా.

26 వ లేఖ

చాటపఱ్ఱు,

6-4-21

నా ప్రియమైన సీతూ,

గత రెండువారములు మీకు వ్రాయఁజాలకుండినందులకు విచారించుచున్నాను. మహాత్మాజీని సందర్శించుటకు

నేను మార్చి 31 వ తేదీని బెజవాడ వెళ్లితిని. ఆయన మూడ వతేదీని ఏలూరు వచ్చెసెను. నేఁడు మే ముపవాసముచేయు చున్నాము. ముందులేఖలో సంగతి సందర్భములన్నియు వ్రాసెదను. నా "సత్యాగ్రహవ్రతము"నకుఁ బ్రతికూలమగు టచే నేఁడు నేనేమియు వ్రాయఁజాలను. మీరు నన్నుఁగలియ వచ్చినపుడు నేను భ్రాంతిగాఁ బరివర్తనమయిపోయియుండఁ జూడఁగలరు. దయచేసి మీరట నెన్ని సంవత్సరము లుండు నదియు తెలుపవలయును. విద్యాభ్యాసమున కయి నేను అమెరికావచ్చుటలేదు. వచ్చెసంవత్సరము నేను అమెరికా చూచుటకేని రాగలనో లేదో చెప్పఁజాలను. నా మాతృ భూమికి నాయాభూషణము లన్నింటిని సమర్పించి వైచితిని. నేను నాచీరల నన్నింటిని మహాత్మాజీకి దక్షిణాఫ్రికాలో విక్రయించివేయుటకుఁ బంపఁబోవుచున్నాను. ఈసమయ ములో మీదేశమును సేవించుటకు మీరిక్కడ నుండవలసిన దని నాకోరిక. మీత్యాగమునుగూర్చి యేమిచేసితిరి.

ఇట్లు

తమ ప్రియమైన

అన్నా.

27 వ లేఖ

చాటపఱ్ఱు,
12-4-21

నా ప్రియమైన నీడూ,

నేను మీకు రెండుమూఁడు వారములు జాబులువ్రాయకుండుట నాకు చాల విచారముగానున్నది. బెజవాడయరుగుటచే నొకవారము వ్రాయఁజాలనైతి. మహాత్మాజీని దర్శించుటకు రెండులక్షలమంది యేతెంచిరి. శ్రీమతి సరళాదేవినిగూడ దర్శించుభాగ్యము కలిగినది. స్త్రీలపక్షమున బెజవాడ ఏలూరులలో మహాత్ముని నే నాహ్వానించితిని. ప్రథమమున నా మహాత్మునికడ కేగుటకే భయపడితిని, ఆహ్వానించుభారము నాపైఁబడుటవలన నే నక్కార్యము నిర్వహింపవలసివచ్చెను. సరళాదేవి యామె వ్రాసిన "చేతికదురుతో నూలుతీయుట"యను పత్రము నాంధ్రీకరించుమని యాజ్ఞయిచ్చినది. "నీవు చమత్కారముగా మున్ముందుగ స్నేహము చేసుకొంటివి. మనమిట్లు నొకరి నొకరము చూడఁగలుగుదుమని యనుకొనలేదుగదా ! ఈవిధముగ మరల నెన్నడయినఁ జూడఁగలుగుదుమేమో" యని నుడివిరి.

గాంధీమహాత్ముఁడు నీదేశము నిమిత్తమయి నీవేమి సమర్పించెదవని నన్నడుగ నేను రెండుజతల గాజులను బెజవాడలో నిచ్చియుంటిని. ఏలూరు వచ్చినపుడు నాకడనున్న

సొమ్ములన్నియు దేశమున కర్పించితిని. ఇపుడు నాదగ్గర మరే మియులేవు. కేవల మొక్కొక్కగాజు హస్తములయందును, మంగళసూత్ర చిహ్నముగ మీరు నాకంఠమునందుంచిన స్వర్ణ పతకముమాత్రము గలదు. ఇపుడు నేను ధరించువస్త్రములు చూచిన ఆశ్చర్యమగ్నులయ్యెదరు. స్వరాజ్యము వచ్చుపర్యంతము వడుకునూలు ముతుకబట్టలనే ధరించెద. మనదేశమున నుండు వస్త్రములనయిన ధరించ వలనుగాదు. విదేశవస్త్ర బహిష్కారమును జీవిత మున్నంతవరకు మన ముభయులము నిర్వర్తింపవలసినదే. పదియవనెంబరు తెల్లని ముతుకబట్టలు నా శరీరమును గాపాడుచున్నవి. ఇదివర కెపుడు దక్షిణాదిచీరలు గాని మరి యేవిధమగు శ్రేష్ఠములుగాని పట్టువస్త్రములను తప్ప ధరించనివారిపుడీవస్త్రములు సంతోషపూర్వకముగా ధరించుకాలము వచ్చుట హిందూదేశమునకు సౌభాగ్యచిహ్నమును, స్వరాజ్యప్రాప్తికి సూచనయుంగాదా ?

ఇది యెవరిమహిమ ? ఇది యెవరియాజ్ఞ ? మరెవరిది ? గాంధిమహాత్మునిదే. లక్షాధికారుల సంతతివారును రాట్నము చేనూలు తీయుచున్నారు. ఎచటఁజూచినను రాట్నములే. రాట్నము సామాన్యమైనదికాదు. అది విష్ణుచక్రము. దాని నుండివచ్చుధ్వనియే వేదనినాదము. ఇంతమాత్రమున సంతృప్తి వహింప వీలులేదు. హిందూదేశమునందంతట 20 లక్షల రాట్నము లుండవలెను. తిలకు స్వరాజ్యనిధికి కోటిరూప్యము

లుగావలెను. కాంగ్రెసుసంఘమునకు కోటిమెంబర్లుండవల యును. ఇవియన్నియు జూను 30 వ తేదీ లోపుగ సమ కూర్చబడవలయును. ఆరుమాసములు గడచినవి. మనకు స్వరాజ్యము ప్రాప్తించుటకింక ఆరుమాసములున్నది. మహా త్ముఁడు నుడివినప్రకారము ఆచరించిన 6 దినములలోనే స్వరాజ్యమును బ్రాప్తింపఁజేసికొనఁగలము- సహాయనిరాకర ణోద్యమ విషయమై మీకు విశదమేకదా! విద్యార్థులు పాఠ శాలలను విసర్జించుట, న్యాయవాదులు మొదలగువారందరు తమ వృత్తులనుమానుట, ............ 35 సంవత్సరముల నుండి ...... మనకెంతవరకు ప్రజాపరిపాలనము లభించినది? యుద్ధమున మన హిందూసోదరు లెంతమంది తమప్రాణముల నర్పించి జర్మనీనోడించి బ్రిటీషురాజ్యమును నిలిపిరి! భరత మాత యెంతధనమును సాయముఁజేసినది? ఇంతసాయమున కేమి లాభమును బొందితిమి. ......................... మనది దౌర్జన్యరహితమగు పవిత్రోద్యమము. మన కెన్నిబా ధలు కలుగఁజేసినను మనము వారి నసహ్యాభావముతోఁజూడ రాదు ..................

..........................................

ఇదివర కెంతమంది నాయకు లుద్భవించియుండలేదు? ఈనాయ కునిఁబోలిన నాయకుఁ డుండెనా? హిందూమహమ్మదీయుల పరస్పరానురాగ మేమనివర్ణింతు? మహాత్ముఁను సామా

న్యుఁడా? అసాధారణుఁడు. ఆయనయందు మంత్రశక్తియున్న ట్లుంది. లేనిచో జగదాచార్యుఁడెట్లగును? ప్రపంచమున నాయనను గౌరవింపనివా రుందురా?

మహాత్ముఁడు నన్ను ఆశ్రమమునకు రమ్మనిరి. నేను శీఘ్రకాలములో నచ్చుటకేఁగఁ బ్రయత్నించెదను. మహాత్ముఁడు కాకినాడ కేగినపు డచట వేశ్యలు తన్ను జూడవచ్చిరఁట. ఆయనకు వారు భోగము చానలని యెవరో నుడివిరఁట. ఆమాట కర్ణకఠోరమయి అధోలోకమునఁ దాను పడినట్లుండెనఁట. ఆగడనకత్తెలను జూచియుండనిపక్షమున మహాత్ముని కాంధ్రస్త్రీలయం దింకెంత యభిమానముండెడిదోకదా! మహాత్మాజీ యీవృత్తిని నిర్మూలము చేయవలెనని స్త్రీపురుషులఁగోరియుండిరి. ఈ కార్యభారమును మహాత్ముఁడు నాయందుంచుటచే నేను త్రోసివేయఁజాలకున్నాను. "మహాత్మా! ఇది దుస్సాధ్యమైనదనియు, అత్యంత కఠినమైనదనియు, నేను చేయఁజాలననియు" వేడుకొన్నను చేయఁగలవని యాశీర్వదించి యిక్కార్యమును నిర్వహింపుమని ముమ్మారు నుడివియుండుటచే నేనా మహాత్ముని యాదేశము నుల్లంఘింపఁ జాలకున్నాను. ఆమహాత్ముఁడు చెప్పుటవలన నాప్రాణముల నైన సమర్పించుటకేని సంసిద్ధురాల నయియున్నాను.

ఏలూరు సాయంకాలము 4½ గంటలకువచ్చి రాత్రి 10 గంటల మేలుబండిలో వెళ్ళియుండిరి. ఆదినమంతయు

నాయనతో సుంకుభాగ్యము లభించినది. మీరుండిచూచిన మీ కెంత యానందముగనుండెడినో? మీకా యదృష్టము లేదుగదా! నేను అమెరికావచ్చునిమిత్తము 1000 రూప్యములు వస్త్రములకయి వ్యయపరచితిని. అవియన్నియు గాంధి మహాత్ముని కంపుచున్నాను. దక్షిణఆఫ్రికాపంపి యచ్చట నమ్మెదరు.............. ....................

షౌకతాలీగా రిట్లు చెప్పియుండిరి. "ఆంగ్లేయుల ఫిరంగులు రెండుమైళ్ళదూరములో నున్నవారినే నశింపఁజేయును. కాని మనరాట్నము 7000 మైళ్ళదూరమునందున్న లాంకషైరువరకు వెళ్ళును. మనకు స్వారాజ్య మపుడేవచ్చును. మంచితరుణము, యిపుడుగదా దేశసేవచేయుసమయము. మీరు లేనందున నామనం బెంతయుఁగలవరపడుచున్నది. అదృష్టవశమున మీ కిదివరకు విద్యార్థివేతనము వచ్చినదని సంతసించియుంటిని. ఇప్పుడన్నచో విద్యార్థివేతనము వచ్చుటచే, గదా మీరు వెళ్ళియుండిరి. లేనిచో నిచ్చటనేయుండి కమ్మనాయకు లయియుండెడివారుగదా! యని విచారించుచుంటిని. ఇదియే దురదృష్టము. ఎందులకా పాడువిద్యార్థి వేతనము లభించినదో! ఎందుల కిదినరకే యీ నిరాకరణోద్యమము ప్రారంభముకాలేదో!

ఇవియన్నియు విచారమును గలుగఁజేయుచున్నవి. మీరుండిన మన మిరువురము దేశసేవచేయుటకు వీలుండెడిది

కదా ! మీరిచ్చట లేకపోవుటచే నాకుఁ గొన్ని కష్టములు న్నవి. పలుమాటలేల ! మీరు వచ్చుటకు వీలుగాదు. ఒక యేఁడాదియైనను ముగియలేదు. పరుల ధనసాహాయ్యమున విద్య నభ్యసించుచున్నారు. మున్ముందే వారికిఁ జదివెపనని పత్రము వ్రాసియిచ్చియుంటిరి. వారిని మోసముచేయరాదు. ఇపుడు రావలెనన్న నాలుగువేలు మీ రియ్యవలసియుండును. మీ రీదేశమునకువచ్చి యెంతవరకుఁ దోడ్పడఁగలరో యెవరి కెరుక ? ధనమిచ్చి ముక్తులగుటకయిన శ్రీమంతులు కారు గదా ! మహాత్మాజీ యుపదేశముప్రకారము మీరు హిందూ దేశమున విద్య నభ్యసించుచున్నచో నీతరుణమున విద్యాల యమును త్యజించి సహాయనిరాకరణోద్యమమునఁ బ్రవేశించి దేశసేవను జేయవలసియుండెడిది. ప్రస్తుతము పరదేశమున నుండుటచే నీయుద్యమమునఁ బ్రవేశించుటకు వలనుగాదు కదా ! అచ్చట విద్య నభ్యసించి వచ్చుటవలన మనదేశమున కేవిధమగు లాభమైన నున్నదాయని యడిగితిని.

ఆదేశమునకు మనదేశమునకు శీతోష్ణస్థితి తారతమ్య మున్నదిగదా ! అచ్చట విద్యనభ్యసించువా రాదేశమున ననుకూలమైనదాని నభ్యసించుటచే నీదేశమునకు లాభకర ముగ నుండునట్లు క్రొత్తవిషయములు గనుగొనఁగలిగిన చాల లాభముండును. ఇచ్చటి విద్యార్థులు సాధారణముగ విదేశ ములకేగి యా నాగరికతల కలవడి కష్టపడి విద్యనభ్యసింపక

ప్రపంచమందుండు తుచ్ఛసుఖములకయి కాలయాపనచేసి ధనమును గోల్పోయి నిష్ప్రయోజకులయి మరలివత్తురు. ఇచ్చట బి. ఏ చదివినవాఁడు వ్యవసాయము కష్టపడిచేయఁ గలడా? మీరు శ్రద్ధవహించి, శ్రమపడి చదివెదరనిచెప్పగా ఆనందించి యచ్చటినుండి చదువుమనియే మహాత్మాజీకోరిరి. మీవిద్యవలన లాభము దేశమునకు మీ బుద్ధికుశలతనుబట్టి యుండునని వారు వక్కాణించిరి. కనుక మీరువచ్చుటకే మాత్ర మాతురతగనుండవలదు. ఇది బ్రాహ్మణేతరోద్యమమునకుఁదరుణముగాదు. బ్రాహ్మణేతరోద్యమమున నుండువారికి స్వరాజ్య మవసరములేదఁట. ...................
...........................ప్రజలలో నైకమత్యముప్రబలినది. అందరును స్వరాజ్యము కావలయుననెడివారే. మూఁడు నాలుగు సంవత్సరముల పసిబాలుఁడు నయితము "గాంధమహాత్మునకుజయ్" అనువాఁడే.

ఆశ్చర్యమే మన పోలీసువారు శాంతముననుబూనిరి. ఏయల్లరియు జరుగలేదు. ప్రజలు పోలీసువారు కలిసిమెలసి యుండుట కిదియే ప్రథమము. మహాత్మాజీ ఆంధ్రదేశమంతయుఁ దిరుగుచున్నారు. అంగలూరు, కొత్తవరము వెళ్లియుండిరి. ఆంధ్రదేశమువలన స్వరాజ్యము లభించునని నాయకులు నుడివిరి. ఆంధ్రులన్న మహాత్మాజీకి నభిమానముమెండు. దేశవిషయముల నింతటితోఁజాలింతము. తరువాతవ్రాసెదను.

స్వవిషయము. నాకాంగ్లేయభాషయందు పాండిత్యము సంపాదింపవలయు ననెడి యాశయు అడుగంటినది. అందువలన నాప్రయాణము మానుకొంటిని. నాకొరకు మీరేమియుఁ బ్రయత్నింపవలదు. ఈవిషయము మీ కిదివరకే తెలియఁజేసియుంటిని. దేశసేవఁజేయఁజాలకున్నను ఆంగ్లేయవిద్య యనవసరమని మానుకొంటిని. ఆంగ్లేయవిద్య నభ్యసించుటకయి విదేశమునకురాను. దేశభ్రమణము చేయవలెననియున్నది. కాన మీరు వచ్చుముందు దేశమునుచూచుటకు వచ్చెదను. మీ కింతశ్రమ కలుగఁజేసినందులకు క్షమింపుడు. ఈదినము నే నేమియు వ్రాయఁజాలను. ఈజాబు తొందరగావ్రాసితిని.

ఇట్లు

మీ యొక్క,

అన్నా.

## 28 వ లేఖ

చాటపఱ్ఱు,

19-4-21.

నా ప్రియమైన నీదూ,

నా గత యుత్తరములు మీకుఁ జేరియుండునని నమ్మెదను. ఈ వారము మీ జాబు లెందుకు నాకు రాలేదో యాశ్చర్యముగనున్నది. నేను మీ ఫోటో చేరినందులకు సంతసించితిని గాని, మీ దుస్తులు, మీరు నిలువఁబడిన పద్ధతి.

యితర విషయములన్నియు నన్నేడ్పించినవి, కోపమును గలిగించినవి. విదేశీయుల పద్ధతి నేమాత్రము అనుకరింపవలదు, నేను వారి నేవగించెదను. మన దేశమున కక్కఱకువచ్చు విద్యను మాత్రమే సంపాదింపుఁడు.

పాశ్చాత్య నాగరకతయే మన కింత ముప్పు తెచ్చినది. మధ్య వచ్చినది మధ్య నశించిపోవలెను. ఆంగ్లేయుల నాగరికత నవలంబింపగనే యాంగ్లేయుల మయ్యెదమా? కాకి నెమిలి పింఛమును గట్టుకొన్నంత మాత్రమున నెమిలి కాఁగలదా? గాడిద సింహపుతోలును తొడిగిన మాత్రాన సింహమగునా? మన మెన్ని పరులవేషభూషణముల ధరించిననేమి? హిందువులమే. ఇతరుల ననుకరించినను, శక్తికి మించినదానిని జేసినను ఎన్నటికేని గౌరవహానినే కలిగించును. నేను వచ్చే వారము "యంగు ఇండియా" పంపుదును. నేను నాలుగు వారములనుండి దానిని తెప్పించుచున్నాను.

ఎంత పర్యంతము మనము పాశ్చాత్య నాగరకతాభిలాషులమయి విదేశవస్తువులను త్యజింపమో, అంతవరకు స్వారాజ్యాభిలాష యెట్లు కలుగును?..................
ఇప్పుడు మనము నిషమానస్థయందున్నారము.............
ఏది విసర్జింపవలెనన్నను సర్వత్ర విదేశవస్తువులే..........
..........................................
మహాత్ముఁడు కానిచో నతడింత మందిని తన యాధీనము

చేసికొనఁగలడా? ఆయన ధన్యుఁడు. భరతవర్షమే కాదు. ప్రపంచమంతయు నాయన పాదతలముననున్నది. విశేషములు తరువాత వ్రాసెదను.

....................................

ఇట్లు,
తమ ప్రియమైన,
అన్నా,

29వ లేఖ

చాటపట్టు,
27-4-21.

నా ప్రియమైన సీడూ,

మీరు దయతో వ్రాయుచున్న జాబులు చేరుచున్నవి. మార్గరెట్టుకూడ నాకు జాబు వ్రాసినది. జవాబు తరువాత వ్రాసెదను. నేను వచ్చుట మానుకొంటినని వ్రాసియుంటిని. ఎన్నటికేని దేశమును దర్శించుటకయి వచ్చెదను గాని విద్య నభ్యసింపవలెనను వాంఛ పూర్తిగ నడుగంటినది. నాకొరకు మీరేమియుఁ బ్రయత్నము చేయవలదు. మీ రీతరుణమున లేరని విచారపడుచుండ నేనుకూడ నెట్లు రాఁగలను? ఈ వాంఛ ప్రథమమునుండియు లేనందుకు విచారపడుచున్నాను. నన్నేమియు మీరు నిరుత్సాహపరచవలదు. నేను మనః పూర్వకముగ నవలంబించినదానిని స్వేచ్ఛగాఁ గొన్ని దినములు

చేయనింపు. కష్టసుఖములు ననుభవమువలనఁ దెలియఁగలవు. నిర్బంధించిన నా కార్యమునందుఁ బట్టుదల మెండగును. "అయ్యో! నే నేమియు నా దేశమున కర్పింపఁజాలకున్నాను. సేవచేయుటకేని శక్తిలేదు కదా!" పరదేశములకు వత్తమని దుస్తులకయి అధికమగు ధనమును వ్యయపరచియుంటిని. మీకు 1000 రూప్యములు పంపవలెననియున్నది. నాకడలేనం దున పంపుట కసాధ్యముగానున్నది. వస్త్రములకయిన ఖర్చు వ్యర్థము గదా! విదేశవస్త్రములగుటవలన నన్నియు నమ్మి వేయుచున్నాను. దక్షిణాఫ్రికాకు గాంధిమహాత్ముఁడు పంపెద రఁట. ప్రస్తుతము నాకడనున్న ధనముతో రాట్నములు, మగ్గములు పెట్టించి బీదలకు సులభమైన ధరలకు రాట్నముల నమ్మవలయునని ప్రయత్నము చేయుచున్నాను. దాని నిమిత్తము 400 రూపాయలు ఖర్చగును. గాంధి యాశ్రమమునకు వెళ్లెదను. ఈ డబ్బు అయినతరువాత నెచటనయిన నప్పు తీసి కొందునేమొ.

ఇట్లు,
మీయొక్క
అన్నా.

## 30 వ లేఖ

చాటపఱ్ఱు
4-5-21

నా ప్రియమైన నీడూ,

ఈవారము మీయొద్దనుండి జాబేమియు రాకుండుట కాశ్చర్యపడుచున్నాను. మన గ్రామములో రాట్నములు వృద్ధిచేయుటకుఁ బ్రయత్నించుచున్నాను. వెలకుఁదీసికొనలేని పేదలకు నేను రాట్నముల నిచ్చుచున్నాను. వారు పిదప వెలను జెల్లింపఁగోరుచున్నారు. నేను రెండుచేతి మగ్గములు నేతకయి సంపాదించితిని. ఇప్పటికి నేను 200 రూప్యములు వెచ్చించితిని. ఈపనికయి యింకను వెచ్చింపవలసియున్నదని తలంచెదను. మీరెట్లున్నారు? ముందులేఖలో విశేషములు వ్రాయుదును.

యుష్మదీయ
అన్నా

## 31 వ లేఖ

చాటపఱ్ఱు
11-5-21

నా ప్రియమైన నీడూ,

ఈ రెండు వారములనుండియు మీయొద్దనుండి జాబులు రాకుండుటకు విచారించుచున్నాను. మీరు మంచి యారోగ్యముగ నుందురని నమ్మెదను. నేను హిందీ నేర్చుకొను

చున్నాను. శ్రీయుతులు శేషగిరిరావుగారు నాకు హిందీ నేర్పుటకుఁ బ్రతిదినము వచ్చుచున్నారు. మేము కలసి రాజకీయ గ్రంథములు చదువ నుద్దేశించితిమి. మీ నాయనగారు పెదమద్దాలినుండి వచ్చినారు. అమ్మమ్మ ఏలూరులోనున్నది. ఆమె త్వరలో నిటకురాఁగలదు. నాయుత్తరములు మీకెట్లు చేరుచున్నవో నాకాశ్చర్యముగ నున్నది.

బ్రాహ్మణేతర వాదులయి మీరు దేశద్రోహులగుచున్నందుల కెంతయు విచారము! మీరుండిన నాకు సహాయముగ నుండెదరనియు, ఆంధ్రులలో వీరులనిపించుకొందురనియు భ్రమించుచుండ మీరీవిధముగ జాబులువ్రాసి యితరులు నవ్వునట్లు చరించుట యెంతయిన నాశ్చర్యదాయకము! మీరుండిన కాలమున బ్రాహ్మణేతరోద్యమమిదికాదు. బ్రాహ్మణేతరోద్యమముయొక్క ఫలితములు బ్రాహ్మణుల దూషించుట దేశనాయకులను దిరస్కరించుట,..................మీరీ పక్షమువారైన నాకు మీకు జీవితమునందెన్నటికి సౌఖ్యముండదు. ఐకమత్యముండదు. భర్తయాజ్ఞానువర్తినియై భార్యయుండవలసినదే కాని భర్త కుపథముననుండి, దుర్మార్గముగ సంచరించిన భార్యతానుగూడ దుర్మార్గురాలు కావలెనా? ఇది యెక్కడి యాచారము? జాతీయవాది అని తెలియువరకు నా మనస్సునకు నెమ్మదిలేదు. జీవితమును దేశము నిమిత్తము సమర్పింపఁగోరిన మీరు దేశద్రోహులగుదురా?..........

ఎంతటి ఘోరకృత్యము. మీరామార్గముననున్న వెంటనే మరలుడు. మీరాపథముననుండి నేను జాతీయవాదిగనున్న ప్రజలు నవ్వరా? మీరు దూరదేశముననుండి దేశసేవఁజేయఁజాలకున్నను దేశభక్తులయినను జనని సంతృప్తితో నుండును. నన్నుఁబ్రోత్సాహపరచుఁడు. హిందూదేశముననున్న కాలమున నున్నట్లుండిన భగతపుత్రులరైన మీ రీరీతిగ మార్పుఁజెందుట కేమి కారణము? పాశ్చాత్యదేశమున కేగినంతమాత్రమున దేశద్రోహులయ్యెదరా?

ఇట్లు
తమ ప్రియమైన
అన్నా

## 32 వ లేఖ

చాటపల్లు,
18-5-21.

ప్రియుతముఁడ,

మీకడనుండి జాబులు వచ్చుటలేదు. నేను మీకు లేఖలు వ్రాయుటలేదు. నా జాబులు......హస్తములఁబడుట యెంతమాత్ర మిష్టములేదు. ఏనాటినుండి జాబు లీ ...........హస్తములఁబడునని గ్రహించితినో యానాటి నుండి మీకు వ్రాయుటయనిన గష్టముగానున్నది. మీ యాజ్ఞానుసారము గ్రామప్రచారము చేయుచున్నాను. పురు

షుల సభలలో నుపన్యాసము లీయవలసివచ్చుచున్నది. నే నుపన్యాసకురాలను గాను. నే నభ్యసింపవలసిన సంగతు లింక ననేకములున్నవి. మీరుండిన నాకెంతయో సాహాయ్యముగ నుండెడిది. ఎవరితోనైనం గలిసి చదివినంగాని లాభములేదు. శ్రీమతి రుక్మిణమ్మగారు వచ్చెదనని చెప్పినది. మే మిరువు రము గలిసి ప్రచారముచేయుటకుం గృతసంకల్పలమయితిమి. ఆంధ్ర కృష్ణా పత్రికల నిరంకుశాధికారము, బ్రాహ్మణులకున్న యసూయాభావమువలన బ్రాహ్మణేతరు లెంత పని చేసినను పత్రికలందుం బ్రకటింపరు. పేరు నా కవసరములేదు గాని, పనిని జూపించనిచోం గష్టము. నన్ను ఆంధ్ర రాష్ట్రీయ సభకు సభ్యురాలునిగను, యావద్భారత జాతీయోప సంఘమునకు సభ్యురాలుగను ' నెన్నుకొన్నపుడు ఎంత కార్యభారము వహింపవలసియున్నదో యాలోచింపుండు. ఎంత చేసిన నం తయే. వీరెన్ని యన్యాయములు చేసినను నేను ప్రవేశించిన కార్యమునుండి వెనుదీయుదానను గాను. భారతమాత కష్ట ములం బాపుట ప్రతి భారతీయునివలన కర్తవ్యము. భీమ వరము తాలూకాకుం బోయినపుడు వారు చూపిన గౌరవ మింతంత కాదు. అయ్యో! అట్టి యాదరణకు, గౌరవమునకు పాత్రురాలను గాకపోయితినని నాకెంతయో విచారముగా నున్నది. ఇదివరకు నాకున్న బంగారు వస్తువులనన్నింటిని దేశ మున కర్పించియుండుటయే గాక మీ కట్టువాచి (చేతిగడి

యారము) పెండ్లినాటి యుంగరము తిలకు స్వరాజ్యనిధి కిచ్చి యుంటిని. నా కిదివరకున్న విదేశవస్త్రములలోఁ గొన్ని నిరుపేదలకు నాలుగు మాసములకుఁ బూర్వమే యిచ్చియుంటిని. కొన్ని స్మిర్నాలో బాధపడుచున్నవారి కంపియుంటిని. ఆమెరికా రావలెనని కొన్న పట్టుచీరెలు, ఇదివరకున్న పట్టుచీరెలు నిచ్చియుంటిని. వాని నన్నింటిని గాంధిమహాత్ముఁడు కాల్చి వేయవలెనని యాజ్ఞాపించినారు. అవి 2000 రూప్యములు ఖరీదు గలవి. మహాత్ముఁడు ఏలూరు విచ్చేసినపుడు స్వరాజ్యమునకయి యిచ్చియుంటిని. కాని నే నాయనకడ కంపియుండకపోవుటచేఁ దిరిగి పంపియుండలేదు. వానినన్నింటిని గాల్చి వేయుచున్నారు. వివాహసమయమందు ధరించిన చీరెయుఁ గాల్చుట కిచ్చితిని. నా ప్రాణమును దేశమున కర్పించుటకు సిద్ధముగనున్నాను. కాని మిమ్ము నర్పించు భాగ్యము లేదు కదా! ప్రస్తుతము ప్రకాశముగారు, హరిశ్చంద్రుఁడు సహాయము చేసినఁగాని మనకు రక్షణలేదు. భరించుట యసంభవము. ఏమిగానున్నదో! మీ రిఁక ధనము సంపాదించినఁగాని లాభములేదు. వ్యవసాయము నింకొక్క సంవత్సర మభ్యసించినఁజాలును గదా!

పేపరు (కాగితము) చేయుట నేర్చుకొనిరండు. అయ్యది అభ్యసించుట కొక సంవత్సరము చాలునఁట. వ్యవసాయమువలన నెక్కువ లాభముండదు. లాభముండినను

10 సంవత్సరములు గడచిన తరువాతనేయుండును. వ్యవసాయములో నొక సంవత్సరము గడచినది. కనుక, అయ్యది పూర్తిజేసి మరియొకటి యభ్యసించి రావలెను. ఇచ్చట పేపరు ఫాక్టరీల (యంత్రశాల)లో నెలకు 15 వందలవరకిచ్చుచున్నారు. మన కుటుంబస్థితి తెలిసినదే కదా! ఇట్టి స్థితిలో మీరు ధన మార్జింపకపోయిన లాభములేదు. మా యందరి వాంఛ ఫలింపజేయనెంచిన కాగితములు చేయు విధమునేర్చుకొనిరండు. మన కిపుడు జాము అవసరములేదు. ఆ కాలము గతించినది. ప్రజలు అన్నమో రామచంద్రా యని విలపించుచున్నపుడు, ధరించుటకు గుడ్డలు లేక మానమును గోల్పోవుచున్న స్థితిలో దేశమునకు జాము అనవసరము. ముందెన్నటికి భరతమాతకు జాము నిష్ప్రయోజనమే. మీరు బాగుగా నాలోచించుకొనుడు. మీరు పంపుమనిన వస్తువుల నన్నింటిని శీఘ్రముగా బంపుచున్నాను. నే నిచ్చట లేకపోవుటవలన వ్రాయలేదు, తప్పులు క్షమింపగోరెదను. నా యుత్తరము లందకపోయిన, తంతి పంపవద్దు. నా యుత్తరములు ప్రతివారమును అందుచుండకపోవచ్చును. నే నొక ప్రదేశమున నుండకపోవుటచే వ్రాయజాలను. నన్ను మీరు దేశమున కర్పించినపుడు జాబు లెందుకు? నే నీలోకమున

లేననుకొనుఁడు. ఉండినచో నా పేరపుడపుడు వినుచుండఁ గలరు. లేనిచో లేదనియే యూహింపుఁడు.

ఇట్లు,
మీయొక్క
మా అ. దేవి.

33 వ లేఖ

చాటపట్టు
5-10-21

ప్రియతముఁడ,

మీరు వ్రాయుచున్న లేఖ లందుచున్నవి. ప్రతిబుధ వారము మీకు జాబు వ్రాయవలెనని 4, 5 దినములనుండి తలఁచితలఁచి తుదకా దినమునకు మరచిపోవుటచూడ నా కాశ్చర్యముగా నున్నది. ఇయ్యదిచూడ భగవదిచ్ఛవలెఁ గన్పట్టుచున్నది. దేశసేవకయి నాప్రాణముల నర్పింప సిద్ధముగానున్నాను. కాని మీరు లేరనువిచారము నాహృదయమునువేధించుచున్నది. ఈతరుణమున మీరుండిన నాకెంతయో సాహాయ్యముగ నుండెడివారు. రాజకీయరంగములోఁ బ్రవేశించుట కిదియే ప్రథమము గనుక నాకెంతయో కష్టముగానున్నది. విశేషముగ సంగతులు తెలియక, ఉపన్యాసములొకొక్కొక్కసారి పాడుచేయుచున్నాను. బరంపురములో హాఠాత్తుగా నొక విషయమునుగూర్చి చెప్పుమనినపుడు పాడు

చేసియుండుటంజేసి నాకెంతయో విచారముగానున్నది. వ్రాయఁజాలకున్నాను. నే నెన్నియో విషయములనుగూర్చి వర్ణింపవలసియున్నది. నాకేమియుఁదోచుటలేదు. నాకు సహాయము చేయువారులేరు. మీరు లేక యీ స్త్రరుకన్యను బోలు ప్రాణస్నేహితులుండిన లాభముగాని యితరు లెవరున్నను నిష్ప్రయోజనము.

సంవత్సరము గతించినది. మరియొక సంవత్సర మేవిధముగా జరుగనున్నదోకదా ! ఏవిధముగనయిన భగవదనుగ్రహమునఁ బరీక్షయందు జయముగాంచి స్వదేశమున కెపుడే తెంచెదరా యని నిరీక్షించుచున్నాను. మీరీయేడాది విశ్వప్రయత్నముసలిపి మన జన్మస్థానమునకు వచ్చినపిదప విశ్రాంతిఁ దీసికొనవచ్చును. సంవత్సరకాలముకంటె నధికము మీరచ్చట నుండఁగూడదని నాయభిప్రాయము. మీరిదివరకు వ్రాసినట్లు 6 మాసము లీవిషయములో నధికముగాఁ జనువవలెననియు, మరి 6 మాసము లచట నుద్యోగముచేసిరావలెనను నుద్దేశ్యము మానుకొనుఁడు. ఇచటకు వచ్చినతరువాత మనదేశమున కనుకూలముగ నుండునట్టివిద్య నెక్కువ సంపాదింపవచ్చును. వ్యవసాయ శాస్త్రమునుగూర్చి టాగూరు విద్యాలయమున నెక్కువవిషయములఁ దెలిసికొనవచ్చును. మీ స్నేహితు లచట నున్నారుగదా !

కాగితములనుగూర్చి వ్రాసియుంటిని. అయ్యది యేడాదిలో సభ్యసించుటకు వీలగునా ? అట్లుచేయుటకు వీలయినను మీరు విశేషకాల మక్కడనుండిన నేను జీవించియుండుట దుర్లభమని తోచుచున్నది. అయ్యో ! యెంతకాల మీవిధముగ నుండవలెను ? సహాయము చేయువారులేరుగదా ! దేశసేవఁజేయఁజాలని జీవిత మొక జీవితమా ? ఇక్కాలమున దేశసేవచేయక పరదేశమున విద్య నభ్యసించుటకయియుండి సంవత్సరములు వ్యర్థముగాఁ గడపిన లాభములేదు. అనేక సమయములం దీ తుచ్ఛప్రాణములం దసహ్యముగనుండియే మేమో భావించుచుందును.

ప్రస్తుతము నా హృదయము విచారసాగరమున మునిఁగియున్నది. అందులకుఁగారణములు మూఁడు (1) ఈ సందిగ్ధసమయమున మీ రిచ్చోటనుండి భరతమాతను సేవింపలేకుండుట. మీ దౌర్భాగ్యవశమున మీరిచ్చట లేకుండుటచేఁ గదా శుభసమయమున సేవఁజేయఁజాలకున్నారు. మీరుండిన మన మిరువుర మెంత యనుకూలముగ దేశహితార్థమయి పాటుపడెడివారమౌకదా ! (2) నేను చేయవలసినంత సేవ చేయఁజాలకుండుట.

(3) మన కుటుంబస్థితి. ఈస్థితియందుండుటకన్న మీ రొక దరిద్రునియింటఁ బుట్టియుండినచో నేను మిమ్ము వివాహ

మాడియుండిన నెక్కువసంతసముగను, తృప్తికరముగను నుండె డిదానను. ఇచ్చట భర్తలుజైలునకు వెళ్ళుటతోడనే భార్యలు వారి స్థానము నలంకరించి స్వారాజ్యమునకయి తమ జీవితముల ధారవోయ సమకట్టుచున్నారు. ఆభాగ్యము లభించదుగదా! మీరు జైలుకుఁబోవుటకు గాని, నేనుపోయిన మీరు పనిచే యుటకుఁగావి వీలులేదు. మీరు వచ్చుపర్యంతము వ్యవహార ములు పరిష్కారమగునట్లు కన్పట్టుటలేదు. ఇచ్చట నున్న దానిని నష్టపరచుటకన్న చక్కపరచుకొన్న బాగుండును. నే నెన్నటికైనఁ బరదేశములఁ జూడవలెనుగదా! నేను పోవు నపు డొంటరిగాఁబోజాలను. అపుడు మీ సహాయము కావ లసియున్నది. మన మిరువుర మిపుడు వేఱువేఱుగానుండుటకన్న కొంతకాలమైనను విదేశములయందు కలసియుండుటమంచిది- మీరు సాధ్యమైనంత శీఘ్రకాలములో స్వదేశమునకు రండు. కాగితమును జేయువిధానము దైవానుగ్రహముండినఁ దరు వాత నభ్యసింపవచ్చును.

నన్ను జైలునకుఁబంపిన పంపెదరు. జైలునకుఁబోవుట ప్రశంసనీయమే కాని స్వారాజ్యసంపాదనార్థమయి ప్రథమమునఁ బ్రాణమునర్పించిన వీరవనితను గావలయునుగాని యిపుడు శ్రీకృష్ణ జన్మస్థానమున కరిగిన లాభములేదు. ఆశుభదినము వచ్చినచో జైలునకుసిద్ధము. దాని నాహ్వానించెదను. కాని యందులకు విశేషముగోర ప్రయత్నింపను. భరతమాత నిమి

త్తము నావంటి బిడ్డలెందరు ప్రాణముల నర్పించకున్న నామెకు విముక్తి కలుగును? ప్రాణముల నర్పించుసమయము శీఘ్రకాలములో రానున్నది. మీరీదేశమునకు వచ్చులోపల నేనెచ్చటనుందునో? జైలునందో! వీరస్వర్గమునందో! రాణీసంయుక్త, లక్ష్మీబాయిలవలె వీరవనిత నయిన మీకెంతిగర్వము గానుండును? మీకెంత సంతసముగనుండును? ఆదినము నావంటి నీచురాలికి, పాపాత్మురాలికి, దౌర్భాగ్యురాలికి సంప్రాప్తమగునా! ధీరులు, వీరులు, నగు మీకు ధర్మపత్ని ననిపించుకొనవలయును. మన మిపుడు శూద్రుల మనిపించుకొన్నను మనము క్షత్రియులమే. ప్రాచీనక్షత్రియరక్తము మనరక్తనాళములం దొక్క బిందువేనియుండుటచేఁ బ్రాణములతోనున్నాము. ఇపుడు జన్మవలన మనము క్షత్రియులము గాకున్నను గార్యరంగమున క్షత్రియులము గావలసియున్నారము. మీ సోదరులు స్వరాజ్యసంపాదనార్థమయి చేయుచున్న కార్యములు గౌరవార్హములు. ఇపుడు చాటపఱ్ఱు అన్ని విషయములలోను ముందంజవేయుచున్నది. గారపాటి ఆంజనేయులుగారు శ్రద్ధగఁబనిచేయుచున్నారు. మాగంటి సీతయ్యగారు, రామచంద్రరావుగారి శిష్యులు. మిగిలినవారందరు సహాయనిరాకరణవాదులే. మీరు లేనందున చాటపఱ్ఱు అధోగతిపాలయ్యెనని యిదివరకు విచారించితినిగాని యిపుడు మీసోదరులు ఆంజనేయులుగారు దీక్షతోఁబనిచేయుచున్నారు. నాకొరకు

మీరు విచారపడవలదు. శరీరారోగ్యము బాగుగనేయున్నది. చేతిగడియారము, పెండ్లియుంగరము స్వరాజ్యనిధికిచ్చితిని. మీపేరుండుటవలన ముప్పువాటిల్లునని నుడివియుండిరి. మీరు దేశము కొరకేమియు మీభాగమునుండి యివ్వలేక పోయితిరి గదా! మీరెపుడు దేశసేవచేయుదురా యని సందేహము! ఈ మహాతరుణమునఁ ద్యాగముచేయఁజాలని మీరెపుడో దేశసేవచేయుదురన్న నేమిప్రయోజనము?

ఇట్లు

మీ యొక్క,

మా. అ. దేవి.

## 34 వ లేఖ

ఏగారము.

9-11-21

ప్రియతముఁడ,

మీరు వ్రాసినజాబు 5,6 దినములకు పూర్వ మందినది. మీప్రేమపత్రము నాహస్తములఁబడినపుడెల్ల నామనస్సు అధికముగఁగుందుచుండును. ఏలయన నేనిపుడు మీకు లేఖలు ప్రతివారము వ్రాయకపోవుటయే. ప్రచారమునకుఁబోవుటం జేసి జాబులువ్రాయుటకు జ్ఞాపకముండక నియమితదినముగడచి పోవుచున్నది. జాబులువ్రాయుటయం దుత్సాహములేదు. మిమ్ముల నెపుడుచూతునాయని నిరీక్షించుచున్నాను. కుటుంబ

విషయమయి హృదయావేదన, స్వరాజ్యాందోళనము, మీరి చటనుండి దేశసేవచేయఁజాలకుండుట మొదలగు విషయముల నుగూర్చి నేనెపుడు విచారించుచుందును. మీరేమొ 1923వ సంవత్సరాంతమున వచ్చెదరని తెలియుచున్నది. అంతకాల మీవిధముగనుండుట యసంభవము. ఠాకూరు ఆశ్రమములో మీవిద్య నభివృద్ధిపరచుకొనవచ్చునని చెప్పియుంటిని. నేనెన్న టికేని పరదేశ మేగవలసినప్పుడు మీరిపు డంతకాల మచట నుండి మరల నాతోవచ్చుటకు వీలుండదు. మరల మనమిరు వురము వేర్వేరుగనుండుట యసాధ్యము. మీరు 1922 సంవ త్సరములో రాఁగలందులకుఁ బ్రయత్నించవలెను. అట్లుచేయ నిచో నధికముగఁ గష్టముల పాలయ్యెదము. 1½ సంవత్సర ములు విద్య మీరు పూర్తిఁజేసితిరిగదా! ఇక నొక యేడాది మాత్రముండినఁ జాలునుగదా! గంపలగూడెం కుమారరాజా గారిని జెయిలులోఁబెట్టినపు డాయన తన సతీతిలకమును నాతో పాటు ప్రచారమునకుఁ గొంపొమ్మనియు, నాతోడ నుంచుకొను మనియు నాకొప్పగించిరి. ఆమెను జూచుటకయి 4-10-21 తేదీని గంపలగూడెము పోయియుంటిని. అచ్చట జ్వరములు విశేషముగానుండుటచే నాకా జ్వరమువచ్చినది. ప్రతిదినము 103, 104 డిగ్రీలజ్వరము వచ్చుచుండెడిది. ఆవిధముగ దాదాపు నెలదినములు వచ్చినది. క్వైనై నుపయోగించినపిదపఁ బోయినది. ఆదినములలో వాంతులు ఎక్కువగానుండుటం

జేసి ఔషధముకూడ నాకు లాభకరముగానుండకపోవుచుండె డిది. ఇపుడు కొంచెము బలహీనముగనున్నది. గాలిమార్చుటకు సోమవర్పాడుదగ్గరనున్న యేగారం గుత్తా బుల్లియ్యగారితోట లోవచ్చియున్నాము. 5 దినములయినది.

మీరిచ్చుటకువచ్చినపుడు మీకు భూములుకావలెను గదా! ఇచట పెదవేగివద్ద సడవులున్నవి. ఎకరము 5, 10 రూపాయిలలో నమ్ముచున్నారు. మీకుఁగావలసియున్నయెడల వ్రాయుఁడు. మీరు త్వరగావచ్చినయెడల చూచికొనవచ్చును. 18 వ తేదీని కనికరమ్మ వివాహము. వరునివయస్సు 36 సంవత్సరములు. వరునకు రెండవవివాహము. ముగ్గురుపిల్లలు. ధనవంతులు. మీరు దూరదేశముననుండి వివాహముచూడక పోయినను దగ్గరనుండియే నాకుఁజూచుభాగ్యము లేకపోయినది. ఇపు డెచ్చటికిఁబోవుటకు వీలులేదు. కదలిన జ్వరము వచ్చునేమొ! జాగరూకతతో దేహమును గాపాడి బలమును సంపాదించి కాంగ్రెసునకుఁబోయి స్వరాజ్యస్థాపనచేయవలెను. డిశంబరు మాసాంతమునకు స్వరాజ్యము తప్పకసిద్ధించును.

అలీ సోదరులను డాక్టరు కిచ్లూను జైలులోఁబెట్టిరి. అందులకే మాకు స్వరాజ్యము త్వరలో రానున్నది. మహాత్ముని జైలులోఁబెట్టిననాడే స్వరాజ్యమువచ్చును. అంతటి భాగ్యము మా కింకను లభింపలేదు. మహాత్ముఁడందరికి వడు

కునూలుబట్టలు చాలుటలేదని తాను టోపీ మొదలగునవి తీసివేసి అంగవస్త్రమును ధరించియున్నాఁడు. ఆపటము పంపించుచున్నాను.

ఇట్లు
మీ ప్రియమైన,
మా. అ. దేవి.

35 వ లేఖ

ఏగాంవు.
16-11-21

ప్రియుఁడ,

మీరు ప్రేమతో వ్రాసినజాబు వందనములతో సందుకొంటిని. నాశరీర మిపు డారోగ్యస్థితియందేయున్నది. కాంగ్రెసునకుఁబోవలయునని ప్రయత్నించుచున్నాను. కాంగ్రెసును దర్శించుట కిదియే ప్రథమము. పూర్వమువలె నీతూరి కుర్చీలు మొదలగునవియుండవు. ధనవ్యయ మెమాత్రముండదు. గాంధిగారి నూతనవిధానము ననుసరించి విలక్షణముగనుండును. హిందూ ఆచారముల ననుసరించి చాపలుపయోగింపఁబడును. అనవసరవ్యయములుండవు. క్రొత్తపద్ధతులఁజూపి ధనవ్యయమునుండి హిందువులరక్షించి స్వరాజ్యస్థాపనఁజేయుటకే కాంగ్రెసును అహమ్మదాబాదున కాహ్వానించియుండిరి. డిశంబరు మాసాంతములో స్వరాజ్యము సిద్ధించును.

గ్రామప్రచారము:—గ్రామప్రచార మనఁ బ్రతిగ్రామమునకుఁబోయి యాయా గ్రామవాసుల నొకస్థలమునకుఁ జేర్చి వారికి సహాయనిరాకరణతత్వమునుగూర్చి బోధించుట. స్వరాజ్యప్రాప్తి గ్రామప్రజలపై నాధారపడియున్నది. రైతులసాహాయ్యము ప్రయత్నములేనిదే యెన్నటికి స్వరాజ్యము లభింపనేరదు. శాసనోల్లంఘనము ప్రవేశపెట్టినారు.

నావస్త్రము లన్నియుఁ గాల్చితిని. అమెరికాకు రావలెనని 1200 రూప్యముల పట్టువస్త్రములఁ గొనియుంటిని. నేనొకసారియైనను గట్టుకొనియుండలేదు. అమెరికాలో ఉపాహారవిందులు మొదలగువానికి విలువగలవి కావలెననియే నే నను కొనియుంటిని. ఇదివరకున్న పట్టుబట్టలు గాంధిమహాత్ముని కడకంపియుంటిని. మొట్టమొదట నవియన్నియు దక్షిణాఫ్రికాలో నమ్మఁదలఁచిరి. నేను పంపించుట ఆలస్యమైనందున నవి కాల్చివేయవలెనని గాంధిగారు నుడివియున్నారు. దానిలో స్వదేశవస్త్రములు నాకొరకుంచమని నేను వ్రాసియుంటిని. అవి విదేశవస్త్రములతోఁ గలిసియుంచుటచే వానిని నేను కట్టుకొనుట కాయన కిష్టములేక యన్నియుఁగాల్చివేయుమని యాజ్ఞాపించిరి.

రామానుజమ్మకుమారుఁడు హనుమంతరావునకు నేను విద్య చెప్పింపఁదలఁచితినిగదా! నేనాబాలుని నాతో కాంగ్రె

సునకు దీసికొనిపోవుచున్నాను. వచ్చునపు డచటనే మహాత్ముని యాశ్రమమున విడిచివత్తును. ఇపుడు నాకిద్దరు బిడ్డలు. హానుమంతరావు, రామానుజమ్మ (పంచమబాలిక) రుద్రాక్షిణి తల్లివద్దనున్న అనాథబాలిక. ఆమెను గాంధీఆశ్రమమునకే పంపుచున్నాను. ఇద్ద రచట విద్య నభ్యసించెదరు. నే నిరువురిని పెంచుచున్నానని మీరు కోపపడవలదు. ఈబిడ్డల నిద్దరిని పోషించుభారము నాది. నేను పుస్తకముల మూలమున ధన మార్జించి వారిని పోషించెదను. మీ కడనుండిగాని, మా తండ్రికడనుండిగాని ధనమును దీసికొనను.

ఇట్లు
మీయొక్క,
మా. అ. దేవి.

## 36వ లేఖ

ఏగారము
23-11-21

ప్రియతమనీడూ,

మీజాబులు రెండు వారములనుండి వచ్చుటలేదు. మీరెపుడు వచ్చెదరా యని నిరీక్షించుచుండ మరియొక సంవత్సర మాలస్యముగా వత్తునని వ్రాసియుంటిరి. రెండు సంవత్సరము లేవిధముగ గడపవలయునా యని విచారించుచున్నాను. నానిమిత్తము మీరు మీవిద్యాభివృద్ధికి భంగముకలుగ

జేసికొనవలదు. ఈసంవత్సర మేవిధముగఁ గడపితినో, అదేవిధముగ రెండుసంవత్సరములు గడపెదను. నన్నుగూర్చి యితరులు కష్టపడుట నాయభిప్రాయముగాదు. మిమ్ముల నే విషయమునను నేనాటంక పరచియుండలేదు. ఎన్నడట్లు చేసియుండలేదు. ఎప్పుడట్లాటంకపరచుటకు నేను ప్రయత్నింపను. నేనిపుడు బాగుగనే యున్నాను. కాంగ్రెసు 27, 28, 29, వ డిశంబరులో జరుగనున్నది. నేను 10, 15, వ తేదీలలో బయలుదేరెదను. నాతో ననేకులు దేశముచూచుటకయి వచ్చుచున్నారు. వారి నిమిత్తము ముందుగ బయలుదేరి హైదరాబాదు, బొంబాయి మొదలగు నగరములఁ జూచెదను. మరల నవంబరులో అఖిలభారత జాతీయసంఘమునకుఁ బ్రతినిధులనెన్నుకొనిరి. ఈసారి ఆంధ్రదేశస్త్రీల తరఫున పొణకాకనకమ్మగారిని ఎన్నుకొనిరి. నేనేమియుఁ జేయఁజాలనని సన్నిదివర కెన్నుకొనుట నాకిష్టములేదు. నాకిపుడు శరీరము స్వస్థతగానున్నందున నిదివరకయిన రెండుసభలకుఁ బోఁజాలకపోతిని. అఖిలభారత కాంగ్రెసు సంఘమునకు 24 గురు సభ్యుల నెన్నుకొనిరి. ఒక స్త్రీమాత్రము స్త్రీలతరఫున నెన్నుకొనఁబడినది. జనసంఖ్యనుబట్టి చూచిన స్త్రీలే పురుషులకన్న నెక్కువమంది యున్నారు. పురుషుల తరఫున ప్రతినిధు లంతమంది యుండిన స్త్రీల తరఫున నొక ప్రతినిధి యేవిధముగఁ జాలునో తెలియకున్నది. పురుషులెంత యన్యాయము చేయుచున్నారు? సరోజినీ సరళాదేవు

లతో నీవిషయము ముచ్చటింపఁ దలంచితిని. నావట్టువస్త్రములఁ గాల్చుట కిచ్చినందుల కందరాశ్చర్యపడుచున్నారు. బొంబాయిలో గాంధిగారు వాని నెందరికో చూపి యుండిరఁట. అంతకుఁబూర్వము నా కడనున్న సాధారణమగు నూలువస్త్రముల నదివరకే నిరుపేదల కిచ్చియుంటిని. పేదలకిచ్చుటయే యుచితమని తలఁచి యట్లు చేసియుంటిని. ఆగష్టు 1వ తేదీనుండి యొకవిదేశవస్త్రమేని మాయింట లేదు. విదేశనూలుతో నేయబడినది చూచినపుడు నాహృదయావేదన వర్ణనాతీతము! ...

.......................................

60 కోట్ల రూపాయి లీదేశమునుండి ప్రవాహరూపమునఁ బోవుచున్నవి. ఇందువలన 6 కోట్లమంది అన్నమో రామచంద్రా! యని విలపించుచున్నారు. స్వదేశవస్త్రముల ధరించిన నెందరికో జీవనాధారముకలుగును. అట్టివస్త్రములఁ గాల్చుట వింతయా? పెండ్లిచీరయైననేమి? అదియు విషతుల్యమే. తెలియక యెన్నియో పాపములొనర్చి యుంటిమి. ఇంకను జేయవలెనా? మీచేతి గడియారము, యుంగరము మిమ్మడుగకుండగనే స్వరాజ్యనిధి కిచ్చియుంటిని. అందులకు మీరంగీకరించెదరనియే యట్లు చేసియుంటిని. ప్రాణముల నర్పించుటకు సిద్ధముగా నున్నవారికి వివాహవస్త్రములును, ఆభరణములు నొక లెక్కయా? కాని యీపనులన్నియు ప్రజలను మెప్పించుటకుగాను నేఁజేయుటలేదు. నేనెవ్వరికిఁ జూపించకుండ, తెలియ

కుండ నిచ్చుచున్నను సంగతి వెలువడుచున్నది. అందులకు నాకే సిగ్గగుచున్నది. నేనెక్కుడు దేశసేవఁ జేయఁజాలక పోయితినని విచారించుచుందును. నేను లక్షాధికారిణి నయి నచో నెంతదానము చేయఁగలిగెడి దానవో యనియు నట్లు కాకుండుట కెంతయు విచారించుచున్నదానను,

ఇట్లు
తమప్రియమైన
మా. అ. దేవి.

37 వ లేఖ

ఏగారము,
30-11-21

ప్రియతమనీడూ,

మీకడనుండి జాబులువచ్చుటలేదు. కారణము తెలియదు. ఇచ్చట మేమందరముక్షేమము. మీ క్షేమవార్తలఁ దెలియఁజేయుచుండవలెను. మే మిచ్చటనుండి డిశంబరు 25 వ తేదీని చాటపల్లువెళ్లుచున్నాము. రామానుజమ్మ నాదగ్గర నున్నది. ఆమెకు సత్యప్రియాదేవియని పేరిడితిమి. ఆమెను అహమ్మదాబాదు కాంగ్రెసునకుఁ బోవునపుడు తోడ్కొనిపో యెదను. పంచమబాలికను మనగృహమునం దుంచుకొనుటచే నెన్నియిక్కట్టులు రానున్నవో? ఇపుడు మనవారందరికి మన లనుగాంచి హాస్యమొనరింప నవకాశమును కలిగినది. ప్రజల

దూషణకు నేను వెరువను. నాతల్లితండ్రులు నాయిష్టానుసారము ప్రవర్తించుచు వారియింట నాబాలికనుంచుట కంగీకరించినందుల కాభగవానుని కనేకవందనము లర్పించుచున్నాను. హనుమంతరావును తల్లి పంపించదట. మరియొక బాలునికొరకు ప్రయత్నించుచున్నాను. మీరిచ్చుటనుండిన నాకెంతయో సహాయముగనుండెడిది. భూములన్నియు సముద్రమయిపోవుచున్నవి. మీ నిమిత్తమె సులభమైన వెలలకు దొరికిన కొనవచ్చునా?

ఇట్లు
తమ ప్రియమైన,
మా. అ. దేవి.

## 38 వ లేఖ

చాటపఱ్ఱు,
14-12-21.

ప్రియుఁడా,

నేను గాలి మార్చుటకు ఏగారముపోయినపుడు 4 జాబులు వ్రాసియుంటిని. మీ కవి యందియేయుండవచ్చును. నేను మీకు మే మాసమునుండి ప్రతివారము జాబులు వ్రాయకుండుట మీకు విశదమే కదా! మీరు అక్టోబరు 29వ తేదీని మీ నాయనగారికి వ్రాసిన జాబు యిచ్చుటకు 9వ తేదీ డిశంబరులోఁ జేరినది. మీ నాయనగా రాజాబు మీ సోదరునికిఁ జూపిరి. ఆ జాబునందుండు సంగతులన్నియు

స్వయముగ నేను చదివియుంటిని. చూచినపుడే మీ సహోదరుల కిరువురకు లేఖమూలమున నవిశ్వాసము మొండగునని గ్రహించి భయపడితిని. ఆ విధముగ నా దోషము నాపై నారోపింపఁబడినది. "అన్నయ్య యుద్దేశ్య మావిధముగ నుండునని నే ననుకొననైతి" అను వాక్యము చదివి జనకు నిట్లు ప్రశ్నించెనఁట. "నీవేమి నన్నుగూర్చి వ్రాసితివి? నీ విట్లు వ్రాయనిచో నేల నీవిధముగ వ్రాయును?" అని యడుగ మీ జనకుఁడు "అన్నపూర్ణ నీమీఁద నేమేమి వ్రాసినదో వానికి నేనేమియు వ్రాయలేదని" చెప్పిరి. నే నెపుడైన మీ సోదరునివిషయ మదివరకు వ్రాసియుంటినా? నేను వ్రాయుటచే మీ తండ్రి కావిధముగ వ్రాసినారా? మీ సోదరుల కిరువురకుఁ గలహమును గల్పించుటకుఁ బ్రయత్నించితినా? కుటుంబకలహములన్న నా కిష్టమా! నే ననేక పర్యాయములు మీ నాయనగారి మాటలను విశ్వసించవలదని చెప్పియుంటిని గదా! ఆయన దీర్ఘలేఖలు, మీ దీర్ఘ ప్రత్యుత్తరములవలననే యివ్విధముగ ఘటిల్లినది. ఇది యొక్కటేకాదు. ఎన్నియో దోషములు నిరూపించి నన్ను దూషితగఁ జేయుచున్నారు. తన బిడ్డలలో నొకరియెడ నొకరికి ద్వేషము పుట్టునట్లు చేయుదురు. నేను వ్రాసినచో నాకు వ్రాయవలెను గాని మీ తండ్రి కేల వ్రాసినారు? ఆయన మాటను నమ్మి యింక నేమియు వ్రాయకుఁడు. మీరు మీ

నాయనగారికి ఉత్తరములు వ్రాయుట మాని మీ సహోదరునికే వ్రాయుఁడు. ఉత్తరముల వ్రాసినంతమాత్రమునఁ బ్రేమ యనుకొనకుఁడు. అంతమాత్రమున నది ప్రేమకానేరదు.

ఇట్లు,
తమయొక్క—
మా. అన్నపూర్ణాదేవి.

## 39 వ లేఖ

చాటపఱ్ఱు,
1-2-22.

ప్రియతమ నీడూ,

మే మీదినముననే కాంగ్రెసునుండి బొంబాయి మొదలగు నగరములను సందర్శించి యిచ్చటికి చేరితిమి. శ్రీ నాయనగా రింకను బొంబాయిలో వ్యవహారములనుగూర్చి విచారించుచున్నారు. మీ నాలుగు జాబులు నే వచ్చునప్పటికి గృహముననున్నవి. మీ లేఖలు పఠించి నా హృదయము విషాదసాగరమున మునిఁగియున్నది. ఏమి చేయుటకును దోచకున్నది. పంచమ బాలికను గాంధి ఆశ్రమమునకుఁ దోడ్కొనిపోయియుంటిని. నన్నుఁగూడ నామెకు నలవాటు పడుటకు నుండుమని చెప్పిరి. అట్లు చేయుటకు వలనుగాక మరలఁ దోడ్కొని వచ్చితిని. ఈ గ్రామములో నందువలన గడబిడ మెండుగనున్నది. మీరు లేకపోవుటఁ జేసి కష్టము

లన్నియు నేనే భరింపవలసివచ్చినది. నే నేమియు నిట సంతోషముగాలేను. ఈ కష్టములన్నియు వచ్చునని నేను ముందే యెరుంగుదును. ఈ పతితజాతి నుద్ధరించు టెట్లో నాకుఁ దెలియకున్నది. సవిస్తరముగ నన్ని విషయములు రాఁబోవు జాబులోఁ దెలియఁజేసెదను. సాధ్యమైనంతవరకు నేను మీకొరకు నా జీవితము నర్పించుటకు ప్రయత్నించెదను. తప్పులు క్షమింపఁగోరెదను.

ఇట్లు

విన్నవించు,

మా. అ. దేవి.

## 40 వ లేఖ

చాటపఱ్ఱు

5-2-22.

ప్రియతమనీడూ,

మీ రంపిన దివ్య చిత్రపటములఁ బ్రేమపూర్వకంబుగ నందుకొంటిని. మీ సోదరున కొక చిత్తరువు నిచ్చితిని. మీ జ్యేష్ఠసోదరి విశాఖపట్నములోనున్నది. వెలమాటి శేషమ్మగారు కన్ను బాగుచేయించుటకని వెళ్లినారట. అందుచే నామెకుఁబంపలేదు. మీ ప్రియసోదరి రామమ్మగారి కడనుండి యీదినము చాకలివచ్చినాఁడు కానఁబంపించుచున్నాను. మీ నాయనగారు మద్దాలిలో నున్నారు. ఆయననుగూర్చి నా

కేమియు వ్రాయవలదు. దూరదేశముననున్న మీకు సోదరునియెడ ద్వేషము కలుగునట్లు వ్రాయుచు మీ సోదరునకు మిమ్ముఁగూర్చి దురుద్దేశములు కలుగునట్లు చేయుచున్నారు. మీమీఁద నెన్నియో మీసోదరునకుఁజెప్పి నామీఁద ద్వేషముకలుగునట్లు చేయుటకు వెనుదీయుటలేదు. ఇచ్చట జరుగు విషయములనుగూర్చి మీ రేమాత్రము చింతింపవలదు. మీ కష్టములను నేను వినఁజాలకున్నాను. భరించుట కశక్తురాలను సాహాయ్యము చేయుటకు దరిద్రురాలను. ధనార్జనమునకు మూర్ఖురాలను. భర్తకు సహాయముచేయఁజాలని జీవిత మొక జీవితమా? ధనముపంపించుటకుఁ బ్రయత్నించుచున్నాను. ఏవిధముగనయిన నాలుగువేలు ఋణముచేసి పంపఁదలఁచితిని. మీరు వచ్చినవెంటనే పొలమునమ్మికొని తీర్చవచ్చును. రు. 1000 లయిన టెలిగ్రాముద్వారా పంపించెదను.

మీరు మేము పంపించువరకు అప్పుచేసి చదువుకొనుఁడు. పనిచేయవలదు. జూన్ మాసములోఁ బరీక్షకుఁబొండు. ధనము పంపించుభారమునాది. మీరు శ్రద్ధవహించి విద్యనభ్యసించి శీఘ్రకాలములో స్వదేశమునకుఁ దిరిగివచ్చుభారము మీది. మీరు 6 మాసములకువచ్చెదరో సంవత్సరమునకు వచ్చెదరో, సంవత్సరముమీఁద 6 మాసములకు వచ్చెదరో మీ యిచ్చవచ్చినట్లుచేయుఁడు. మీరు యం. యస్. సి. ప్యాసయివచ్చిన బాగుండును. ఇచటకువచ్చిన తరువాత

మరల విదేశమునకుఁబోవుట దుస్సాధ్యము. స్వరాజ్యమును బొందకపూర్వము స్వదేశమునువీడి పరదేశమునకుఁబోఁజాలను. మిమ్ములఁబోనియ్యను. మీరు యం. యస్. సి. వీలయిన 6 మాసములలోఁ జదివిరండు. లేదా బి. యస్. సి. పరీక్ష యయిన వెంటనేవచ్చి దేశముకొరకుఁబాటుపడుఁడు. ఈవిష యములు మీ కిదివరకు వ్రాయనివిషయములు. తరువాత వ్రాసెదను. కాంగ్రెసునకుఁబోయి బొంబాయిలో పునహా సుబ్బయ్యదగ్గరకుఁ బోయివచ్చితిని. దేహ మారోగ్యదశయం దున్నప్పుడే గృహముచేరితిని. ఇచ్చటకు వచ్చిన తరువాత పొంగుచూపినది. బలహీనముగానున్నది. కన్ను బాధగాను న్నది. వ్రాయఁజాలకున్నాను.

శ్రీ నాయనగారు బొంబాయిలో వర్తకవిషయ మాలోచించుచున్నారు. విశ్వనాధంవచ్చి మీరు కోరినవిష యము చెప్పినారు. నేను మంచిసాంబ్రాణిపుల్లలు, నల్లబిళ్లలు యిచ్చినాను. కన్ను పోటుగానున్నది. ధనవిషయ మాలోచిం చిన తరువాత మీకు జాబు వ్రాయవచ్చునని యూరకొం టిని. పోయినవార మందులకే వ్రాయలేదు. యం. యస్.సి. ప్యాసయివచ్చుట కెంతధనము కావలసియున్నది ? ధాన్యము ధర తగ్గినది. యింకనుదగ్గును. మన మేవిధముగ ఋణవిము క్తుల మయ్యెదమో తెలియకున్నది.

ఇట్లు,
తమ ప్రియమైన,
మా. అ. దేవి.

## 41 వ లేఖ

చాటపఱ్ఱు
22-2-22.

నా ప్రియతమ సీడూ,

మీరు ప్రేమతో వ్రాయుచున్న జాబులందుచునేయున్నవి. మీ రనుభవించుచున్న బాధల కెంతయు విచారముగ నున్నది. మీకు ధనసహాయముఁ జేయఁ బ్రయత్నించుచున్నాను. ప్రకాశముగారికి వ్రాసియుంటిని. నా మిత్రవర్గములలో నొక రగు శ్రీయుత. దంతు నారాయణరాజుగారు మీకు సహాయముచేయ నుద్దేశించి ప్రయత్నించుచున్నారు. వారితరుల కడ సహాయమునుఁబడసినఁగాని మనకు ఋణసహాయము సలుపఁజాలరు. వారు నిరుపేదలు. ప్లీడరువృత్తి విసర్జించి దేశహితార్థమయి సంవత్సరము 6 మాసములనుండి యద్వితీయమైన దేశసేవ సలుపుచున్నారు. శాంతస్వభావులు. ఆయనను జూచిన మహాత్ముని కుటుంబములో నొకరని భావించుచుందుము; రాజులు ఈయుద్యమములో నా కప్పుడప్పుడు హితోపదేశముచేయుచుందురు. మీరు పడుచున్న బాధలవిని వా రనుభవించుచున్నట్లు విచారించిరి. సాధువుల స్వభావమంతియే కదా! వారు వాగ్రూపముగఁగాక కార్యరూపముననే దేశసేవ చేయుచున్నారు. శ్రీ ప్రకాశముగారినిగూర్చి నేనంతగా వ్రాయనవసరములేదు. ఆయన నాకన్న మీకెక్కుడు పరిచి

తులుగదా! ప్రకాశంగారి దేశసేవ వర్ణనాతీతము. ఈయుద్య మప్రారంభమందే న్యాయవాదవృత్తిమాని స్వార్థత్యాగు లయిన విషయ మిదివరకే విశదీకరించియుంటిని. స్వరాజ్య పత్రికకు ఆయన యధిపతి. అది దినపత్రిక. చాల బాగుగనుం డును. నాకుఁబంపుచున్నారు. ఆంధ్రనాయకులలోనొకరు. మున్ముందుఁబ్రథమస్థాన మలంకరించఁగలరను సూచనలు కన్పట్టుచున్నవని ప్రజల యభిప్రాయము. పీ రిరువురకు మీరు పరదేశమునఁబడుచున్న బాములను వివరించి యుంటిని. భగ వదనుగ్రహాముండిన సహాయముఁబొందఁగలరు. 5000 రూపా యల ఋణసాహాయ్యమును జేయుమని ప్రకాశంగారిని గోరి యుంటిని. జూనుమాసమునఁ గాఁబోవుపరీక్ష బి. యస్. సి. యం దుత్తీర్ణులయిన తరువాత యం. యస్. సి. పరీక్షకుఁ బోయి 1923 వ సంవత్సరమున వచ్చెదనని వ్రాసియుంటిరి గదా? ఇపుడు డిశంబరులో వచ్చుటకుఁగారణమేమి? ధనలో పముచే వచ్చెదననుచున్నారా? ఎవ్విధముగనయిన ధనసహా యమును జేయుటకు నేను సంసిద్ధురాలనై యున్నాను. మీరు వచ్చిన తరువాత రాజకీయ విషయములో జోక్యముకల్పించు కొనననియు విశ్వమానవసేవయే మీ యాదర్శమనియు వ్రాసియుంటిరి. అట్లయిన మానవసేవ సంపూర్ణముగఁజేయఁ బ్రయత్నించవలెను. మీరే కార్యముద్వారా మానవసేయఁ బ్రయత్నించుచున్నారో, అయ్యది నిర్విఘ్నముగఁగొనసాగు

న్నట్లు విద్యనభ్యసించి రానలసియుండును. మీరొకసారి హిందూ దేశమునకు వచ్చి మరల విద్యాభ్యాసమునకై పరదేశమేగుట కవకాశముండదు. ప్రస్తుతము మీరు దూరదేశమందున్నందుల కెవరో నన్ను నిందించుచున్నారు. ఇచ్చట సహాయ నిరాకరణోద్యమము అను వాక్యము దశదిశల వ్యాపించుచున్న యీతరుణమున మీరు పరదేశముననుండి విద్యనభ్యసించుటకై సుసమయమును వ్యర్థము చేయుట భావ్యముగాదు. ఎందరెందరో నిరుపేద లొకపూటయైనను గూడు లేక మలమలమాడుచుండ నొకవిద్యార్థి వేలకొలది ధనము వ్యయపరచుటుచితమా? ఎందరు మానవులు స్వసౌఖ్యార్థ మెంతెంత విత్తము వ్యయపరచుట లేదా! యని యందురేమొ? మన జీవితముల నావిధముగఁ బోనీయుటకు వలనుపడదు. గాంధమహాత్ముని నిజమైన శిష్యులమై బీదలతోపాటుగనుండి పేదజనుల నిమిత్తము ఈప్రాణముల నర్పించుటకు సంసిద్ధులమయియుండవలెను. ఇతరులవలెఁ గేవలము మనసౌఖ్యములనే చూచుకొను కాలము గతించినది.

మీ బి. యస్. సి. పరీక్షయయిన తరువాత నెన్ని మాసములు ఎమ్. ఎస్. సి. పరీక్షకుఁ జదువవలెను? జూలై ఆగస్టు మాసములలోఁ జదివిపూర్తిఁజేయుటకు వీలుండునా? డిశంబరులో జరుగఁబోవు కాంగ్రెసు మన యాంధ్ర దేశములోఁగానున్నది. మరల నెంతకాలమునకు మనదేశములో

నగునో? మీరా సమయమునకు రాఁగలిగిన నెంత సంతసము! మన మిరువురము వాలంటీరులుగఁ బనిచేయవలెనని యున్నది. దైవానుగ్రహమెట్లున్నదో? మీరు యమ్. యస్. సి. చదివిన బాగుండును. పెద్ద పరీక్షఁజదివిన గౌరవమనికాదు. ఆకాల మంత మెుందినది. మీరు కంపెనీ పెట్టినను, స్వదేశకంపెనీల లోనున్నను మీరొకరి చేతిక్రిందనుండి యస్వతంత్రులయి అగౌరవముగ నుండుట నాకిష్టములేదు. మనమెుకరి చేతిక్రింద నుండుట కిష్టములేనిచో నితరులకుండునా యని ప్రశ్నించెద రేమెు! మీరావిధముగ బాధపెట్టరని నాతలంపు. పరదేశమేగి ధనవ్యయముఁజేసి మరల నౌకరి సహాయముమీఁద నాధార పడి యుండుట నాకుఁబొత్తిగా నిష్టములేదు. పై యధికారు లతో సమముగ నుండవలయును. అందరిని స్నేహభావమునఁ జూడవలెను. కంపెనీ మన యాంధ్రదేశమునఁ బెట్టినఁ గొందరు యం. యస్. సి. ప్యాసయినవా రిచ్చుటఁగలరు. వారు మీ చేతిక్రింద నుండరు. మీరుండవలసి వచ్చును. ఇవన్నియు మీరు బాగుగ నాలోచింపుడు. మీరు విశ్రాంతిలేకుండఁగ నైన రాఁబోవు వేసవికాలపు సెలవులలోఁ జదివిరాఁగోరెదను. అచ్చట పనిచేసి యాలస్యముగ వచ్చుటకంటె మనదేశములో నుండి యెవ్విధముగఁజేసిన లాభకరముగనుండునో యాలోచిం పవచ్చును. అచ్చట శీతోష్ణస్థితికి హిందూదేశభూమికి భేదము చాలనుండుటంజేసి యచ్చట నెంతకాలముండినను లాభము

లేదు. ఇందులకు మీ కెంత ధనసహాయము కావలసియున్నను జేసెదను. అయితే యెక్కువకాలము మీరచ్చటనుండుట నేను సహింపఁజాలను. యం. యస్. సి. పరీక్షకొరకై నను ఒకటి రెండు సంవత్సరములు పట్టె యెడలవలదు. అట్లయిన జూన్ మాసములోఁ బరీక్షయయిన వెంటనే రాఁగోరెదను. మీ రిదివరకు మరియు నారుమాసములు పనిచేసి వచ్చెదనని వ్రాసి యున్నారు. ధన మెక్కువఖర్చుచేసియయినను జూలై, సెప్టెం బరులోఁజదివి త్వరగారావలెను. మీరు డిశంబరులోవచ్చెద నని మీనాయనగారికి వ్రాసినారు. వినినప్పటినుండి దినములు గడచుట లేదు. ఇంకెన్నినాళ్ళకు వచ్చెదరాయని యాతురతతోఁ జూచుచున్నాను. మనస్సు స్థిరముగ లేదు. ఒక్కొక్కసారి జూలైలో వచ్చిన బాగుండుననియు నాలోచించుచున్నాను. ఎల్లప్పు డిదే యాలోచనగానున్నది. విద్యనభ్యసించుట కింక నభిలాషయుండగ నేనేల పాడుచేయవలెనని యాలోచించుచుం దును. వివాహమయినతోడనే పారిపోయితిరి. ఇంకెంతకాల మీవిధముగ నుండవలెనో? నేనన్న మీకుఁ బ్రేమలేదు, అచ్చట విద్యావతులగు సుందరుల నెందరిని సంపాదించి యు న్నారో? నేనింక నక్కరకువత్తునా? అచ్చటనుండి వచ్చినతరు వాత నన్ను హేయమైన యొక జంతువుగఁజూచెదరేమో? పరదేశమునుండి వచ్చినవారి స్వభావము లివ్విధముగనున్నవి. మీరువత్తురన్న సంతోష మెంతయున్నదో, దుఃఖము నయిత

మంతియేయున్నది. సంతోషము స్వభావముగ నుండునదియె. దుఃఖమెందుల కుండవలయును ?

ఎందులకనఁగా గవర్నమెంటుద్యోగమునఁ బ్రవేశింతు రేమోయని మీకడనున్న విదేశవస్త్రముల నన్నింటి నగ్ని దేవుని కర్పించి స్వదేశవస్త్రధారులయి యుండుటయు, సహాయ నిరాకరణోద్యము ననుసరించియుండుట ఇవియన్నియు మీరు నెరవేర్చెదరో లేక నన్ను నిందల పాలొనరింతురో యని భయముగ నున్నది. నేనితర స్త్రీలకు భర్తల బహిష్కరించియైనను దేశసేవఁజేయవలెనని చెప్పుచుండ మీరు నాకు వ్యతిరేకముగ నున్నచో ఆత్మహత్యయేఁ జేసికొనవలసివచ్చును. అందుల కిప్పటినుండియు సిద్ధపడుచున్నాను. తొందరగా జాబు పోస్టునకుఁ బంపించవలసియున్నది. మీకడనున్న విదేశవస్త్రముల వాడుకొనుఁడు. వివాహకాలమం దిచ్చిన వస్త్రములతో జాతీయపద్ధతుల ననుసరించి ఛాయాపటము తీసికొనవలెను. పంచె, చొక్కాయి, కండువా ధరించి ఫోటో తీయించు కొనుఁడు. అవి షర్టులు కుట్టించి యిపుడు వాడుకొనుఁడు. క్రొత్త లాగులు కుట్టించుకొనవలదు. ఇచ్చట నవసరముండదు. మీరు ఓడదిగిన వెంటనే విదేశవస్త్రముల నన్నింటిని గాల్చి వేయవలెను. అచ్చటనే వాడుకొని పాడుచేసి రండి. నేను వ్రాసిన ప్రశ్నలకన్నింటికి జవాబు వ్రాయుండి. కాల్చు విషయ

మయి తరువాత వ్రాసెదను. తొందరగా వ్రాసినాను. తప్పులున్న క్షమింపుఁడు.

ఇట్లు
మీయొక్క
మా. అ. దేవి.

42 వ లేఖ

చాటపఱ్ఱు
1-3-22

ప్రియనీడూ,

మీరు ప్రేమతో వ్రాయుచున్న జాబులు చేరుచున్నవి. మీరు పంపినకార్డులు గ్రామసంవాదము చేరినవి. కాని ప్రస్తుతము పత్రికలలో వేయుటకు వీలులేదు. రెండుసంవత్సరములు మీ రేవిధముగ నచట,గడుపుచున్నది, మీ రనుభవించుచున్నకష్టములు తెనుఁగులో వ్రాసియుంచిన లాభకరముగ నుండును. ఇది తెనుగులో నచ్చువేయించి కరపత్రముగ నమ్మవచ్చును. మీరు వచ్చినతరువాత నాలోచింపవచ్చును. ఇంతలో ప్రకాశంగారికి, నారాయణరాజుగారికిఁ జూపెదను. పత్రికలకుఁబంపుమన్నఁబంపెదను. ఈతరుణమున నద్దానివంటి యమూల్యములగు విషయము లాంధ్రపత్రిక కనేకములున్నవి. ధనముకొరకుఁబ్రయత్నించుచున్నాను. త్వరలోఁజేకూరునట్లు కన్పట్టదు. మీనాయనగారికి డిశంబరులో వచ్చెదనని వ్రాసినా

రఁట. జూనులోఁబరీక్షయయిన జులై నుండి సెప్టెంబరువర కేమిచేసెదరు ? దేశముచూచుటకా ? విద్యనభ్యసించుటకా ? సంతోషముగఁ గొంతకాలము మిత్రులతోఁ గడుపుటకా ? తెలియకున్నది.

అయ్యో ! నన్ను వివాహమాడినందులకు మీకెంత కష్టముగనున్నదో ? ఒక విషయములో నుండవచ్చును. మీరే ధనవంతులకన్యను వివాహమాడియుండినచో నిర్విఘ్నముగఁ గష్టములుపాలుకాకుండెడివారుకదా ! మీనాయనగారు పంపిం చకపోయిన మీమామగారయిన కొమార్తెను జూతురోలేదో యని భయపడియైనఁ బంపించియుందురుకదా ! మాకాశక్తి లేకపోవుటంజేసియే కదా మీరు పరదేశమున ననుభవించుకష్ట ములకు మితిలేకున్నది. మీనాయనగారికి నన్ను మీరు వివా హమాడినందువలన మీకు యే 20 వేలకట్నమో రాలేదని విచారముగనున్నదనుట కేమాత్రము సందియములేదు. నాకడ నెన్నిపర్యాయములో యీవిషయమునుగూర్చి నుడివియుండిరి. మీకష్టములనుగూర్చి నాకెంతయో కష్టముగనున్నది. నా ప్రియుఁడు సంతోషమగ్నుఁడైన నాకు సంతసముగాని దుఃఖ ములోనున్న నెట్లుండును ? నాశరీరము, హృదయము దుర్బ లావస్థయందున్నవి. పూర్వమువలె మనోబలములేదు. సంసా రస్థితి, మీబాధలు, వేర్వేఱుగనుండుటచేఁగష్టము, మహాతరు ణమున మీరిట లేకపోవుట మొదలగు హేతువులచే నామ

నస్సు దుర్భరమగు వేదనలో మునిఁగియున్నది. ఈ సంవత్సర మేవిధముగఁ గడుపవలెనో తెలియకున్నది. మీవలన దరిద్ర దేవతను నాతల్లిగఁజేసికొని కష్టముల ననుభవించుస్థితి నాకుఁ బట్టినది. ఇట్టిస్థితివచ్చునని నాలుగు సంవత్సరములకుఁబూర్వ మనుకొననైతి. ఇంతహీనస్థితి నాకు రానున్నదని వివాహము నకుఁబూర్వమయిన తలంచియుండలేదు. ఈదైన్యస్థితిని భగ వానుఁడు నాకీయనున్నాఁడని వివాహమైన తరువాతనయిన మనస్సునం దాలోచించియుండలేదు. భగవానుని యనుగ్రహ ముచేనేమి, ఆ మహాత్ముని శిష్యురాలంజేసియేమి దరిద్రులలో దరిద్రురాలనయియుండుట కంతవిచారములేదుకాని నాబాల్య మునుండి నాయాత్మ వాంఛించుచున్నయిచ్ఛ సఫలము గాకపో యినఁ గష్టముగనుండును. నాకపరిమితధన ముండవలెననియు నయ్యది ధారాళముగ నిరుపేదల కొసగుటకుఁగాని మరియే యితర ధర్మకార్యములఁజేయుటకైన ధనలోప ముండరాదనియుఁ గోరికయుండెను. అయ్యది నాజీవితములో నెరవేరదుగదా? యనియే దుఃఖము. దారిద్ర్యమునైన భరించఁగలను గాని మీ ప్రేమలోపమైన భరించుటెట్లు? మీ రితరులయెడఁ బ్రేమఁ జూపినట్లు నాయెడఁ జూపరుకదా! నే నేమాటనుచెప్పిన మీరు వింటిరి? నామాటలన్న నితరుల కున్నంత లక్ష్యమైన మీకు లేదుగదా! నా కేమియుఁదెలియఁజేయకయే యితరులకు మీ

యుద్దేశ్యములఁ దెలియఁజేయుచుందురు. నాకష్టములు మీకష్టములని భావింపరుగదా! వివాహమైన తరువాత మీరున్న కొలఁది కాలములో నావిధముగఁ జూచినవారు సంవత్సరములుకడచిన కొలఁది నేవిధముగఁజూచెదరో? ఇందులకు మీరున్నపుడే నిద్రలేని రాత్రులలో నెన్నిపర్యాయము లాక్రందనముఁ జేసితినో మీకుఁ దెలియునా? "నన్ను బాధపెట్టుటకన్న మీకనుకూలమైన వారిని బెండ్లాడిన బాగుండెడిది. నేను మిమ్ముఁగోరునది కేవల మనుకూలదాంపత్యము. నన్నొక బాలికగాఁగాని, బుద్ధిహీనురాలిగఁగాని దలచియేని యిష్టముగనుండఁ గోరెదను. మీరు జులై నుండి యక్టోబరులోపుగ యం.యస్.సి. ప్యాసగుటకు వీలులేనిచో స్వదేశమునకు వెంటనేవచ్చిన బాగుండునని నాయభిప్రాయము. ఎంతకాలము పట్టునో వ్రాయండి.

ఇట్లు,
మీ యొక్క
మా. అ. దేవి.

43 వ లేఖ

చాటపఱ్ఱు,
15-8-22.

ప్రియతమ నీదూ,

రెండు వారములనుండి మీ జాబులు వచ్చుటలేదు. విచారముగానున్నది. కడుపునొప్పిగానున్నది. తలపోటు వచ్చు

చున్నది. హరిశ్చంద్రుఁడుగారు శేషగిరిరావుగారితో మాట్లాడి నారఁట. 2 వేలు పంపుచున్నారఁట. మీ కందియే యుండ వచ్చును. నే నొక వేయి రూప్యములు పంపించెదను. వారు పంపినవి మీకందియే యుండవచ్చును. ఇంకను నాకు దొరక లేదు. ప్రకాశముగారు ప్రత్యుత్తర మీయలేదు. సహాయము చేయుట కిష్టము లేదేమొ! మీరు జులై, ఆగస్టులలో విద్య నభ్యసించి యం. యస్. సి. ప్యాసు కాకపోయినచో డిశం బరువరకును యం. యస్. సి. చదువుటకు వీలుకానియెడల ఆగస్టులో బయలుదేరి రాఁగోరెదను. గాంధిగారిని అరెస్టు చేసినారు. అందరు పట్టుదలతోఁ బనిచేయవలసిన సమయము. నే నిఁక వ్రాయలేకున్నాను. విశేషములు తరువాత వ్రాసె దను.

ఇట్లు,
మీ ప్రియమైన
మా. అ. దేవి.

## 44 వ లేఖ

చాటపఱ్ఱు.
6-3-22.

ప్రియతమ నీడూ,

మీ జాబులు మూఁడు వారములనుండి నాకడకు రాకుండుట యాశ్చర్యముగనున్నది. లేఖకుఁడు కఠినహృద

యుఁడయ్యెనో, లేఖావహుఁడు నిర్ణయుఁడయ్యెనో గ్రహింపఁ జాలకున్నాను. ఈనడుమ నే నెన్ని మాసములు వ్రాయకుండి యెవ్విధముగఁ గాలయాపనచేసితినో, ఎన్నెన్ని వారములు మీరు వ్రాయకుండినపుడు నే నెవ్విధముగ నిర్విచారముగనుం టినో కాని మీరిపుడు వ్రాయనందునఁ గలుగు విచారము వ్రాయఁజాలకున్నాను. అట్లు వ్రాయఁగల్గుటకూడ యసంభవము. ప్రస్తుతము నన్నుఁ జూడఁగలిగిన నానవాలు పట్టుట అసాధ్యము. అనుదినము నా హృదయము చలించుచున్నది. నన్నుగూర్చి నే నొక్కొక్కమా రాలోచించిన నద్భుతముగ నుండును. కొన్నిదినము లీవిధముగనుండినచో నున్మాదిని నయ్యెదనేమో యని భయముగనున్నది. మీరు దూరదేశమునఁ బొందుచున్న బాధలు ప్రథమమునఁ దెలియఁజేసియుంచినచో నింతకుఁబూర్వమే నాదశ యెట్లుండెడిదో? ప్రకాశము గారు సహాయము చేసెదరని యెంత యాసతోనుంటినో, అంత నిరాశయయినది. ప్రత్యుత్తరము రాలేదు. దరిద్రులను రక్షించువాఁడు భగవానుఁడు. కాని మానవులా? ఈ పృథ్వియందు దరిద్రులకొరకు విచారించుచుఁ దాను నయితము దరిద్రుఁడయినవాఁ డొక్క మహాత్ముఁడే కలఁడు. సత్యలింగ నాయకరు నిధినుండి విద్యార్థివేతన మంపుదురని తెలిసినపుడెంతయో సంతసించియుంటిని. కాని యింత పర్యంతము పంపించలేదని తెలియఁజేయుట కెంతయు విచారముగానున్నది.

నాయకరు నిధియందు ప్రస్తుతము పైకము లేదఁట. రెండు మూఁడు దినములలోఁ బంపెదరని హరిశ్చంద్రుఁడుగారు వ్రాసియున్నారు. వారు పంపనియెడల మీ సోదరుఁడు పంపెదనని వ్రాయుచున్నారు. ధన లోపముచే నాయకరు నిధివారు పంపలేదఁట. బాకీలు వసూలు కానందుననే యిదివరకుఁ బంపించియుండలేదు. హరిశ్చంద్రుఁడుగారికి వ్యాపారము మూలమునఁ గష్టములు సంప్రాప్తించుటచే నీకు జాబులు వ్రాయకుండుటయు, ధనము చేకూర్చుకొనలేకపోవుటయుఁ గారణములు. నే నొక వేయిరూప్యములు ఈ మాసాంతములోఁ బంపనున్నాను. ఎన్ని విధములఁ బ్రయత్నించినను రెండు మాసములనుండి ధనము పంపఁజాలకుండుటయే నా ప్రస్తుతస్థితికి ముఖ్యకారణము. మీరు రక్షింపఁగోరుచో జూను మాసములోఁ బరీక్ష ప్యాసయి ఆగస్టులోఁ బయనమయి వచ్చిన సందరికి సంతసముగనుండును. మన సోదరుఁడు దం. నారాయణరాజుగారి యభిప్రాయ మిదియే. నే నెన్ని విధముల నా మనశ్శాంతికొరకు ప్రయత్నముఁజేసినను నట్టి శాంతి లభించుటలేదు. మీ యిచ్ఛానుసారము మిమ్ము మరి యొక సంవత్సర మచ్చటనేయుండుమని వ్రాయవలెనని యున్నది, కాని, నా ప్రస్తుతస్థితి దేశస్థితివలన నట్లు సహాయము చేయుటకు వీలు గాకున్నది. వేలున్నచో మరలఁబోయి మీ యిచ్ఛానుసారము విద్యాభ్యాసము చేయవచ్చును. మీరిం

కను దూరదేశముననుండి భరతమాత విలాపమును జెవినిడక పోవుట మీబోంట్లకుఁ బాడికాదు. మీ రభ్యసించుచున్న విద్య యేమి? ఎందులకు? ఎవరి నిమిత్తము? తత్ఫలముచే నెవరికి లాభము?

మీరు "జాము" తయారుచేయు ఫ్యాక్టరీలుపెట్టించి తోటలువేయించి ధనార్జనముచేయుటకు సమకట్టినట్లు తెలియుచున్నది. మీరు క్యాలిఫోర్నియా యిందులకే పోయెదరని వింటిని. ఇందులకే డిశంబరువరకుఁ బరదేశమున నుందురని తెలియుచున్నది. మీయుద్దేశ్యప్రకారము పరదేశముననుండి "జాము" చేయ నేర్చుటకన్న మనదేశముననుండి నేర్చి యితర దేశములకుఁ బంపుట మంచిదికదా! ప్రప్రథమమున మనదేశీయుల హితమునకయి మనమెక్కుడు పాటుపడవలయును. "జాము" మనదేశమునం దెవరికెక్కుడుపయోగముగనుండును? మిమ్ముఁ బోలు కొలఁది ఆంగ్లేయవిద్యా సంపన్నులకేగాని మావంటి వారి కనవసరము. ప్రస్తుతము దేశమంతయు దరిద్రదేవత పాలఁ బడినది. ఎచ్చటఁజూచినను వస్త్రహీనులయి, మానహానిం బొందుచున్న స్త్రీపురుషులు; ఆకలిచేఁగృశించి శల్యావశిష్టులయి మరణించుచున్న పుత్రులచే హిందూమాత యాక్రందనము చేయుచున్నది. భరతమాత కన్నీరుతుడిచి సోదరీ సోదరులను రక్షించుట మీకర్తవ్యమా? లేక నలుగురు ధనవంతులకయి మీ యమూల్యసమయమును వ్యయపరచుటయా?

"జాము" తయారుచేయుటచే ధనమధికముగా సంపాదింప వచ్చుఁగాని, ఆధన మెవ్వరికయి యార్జింపనున్నారో, వారయ్యది గ్రహించుట యసంభవము. మనమెక్కుడు ధన మార్జింపలేక పోయినను నాకుఁ బీదలసేవయే పరమానందదాయకము. ఆసేవ యేవిధముగఁ జేయవలెను? లక్షలకొలఁది యెకరములభూమి సాగుబడికాకుండ నున్నది. జనులు విశేషముగ లేకపోవుటచే నిష్ప్రయోజనముగ నున్న భూములను కూలిపనిలేక యల్లాడు చున్న సోదరీసోదరులఁ దోడ్కొని యంత్రసాహాయ్యమున సాగుచేయుట మంచిది.

శనివారప్పేట జమీందారు భూములలోను, భద్రాచలము అడవిలోను వేలకొలఁది యెకరముల వైశాల్యముగల తటాకములున్నవఁట. ఎన్నియెకరము లీవిధముగ హిందూ దేశమున నున్నవి! ఇది మానవసేవకాదా? పంటయంతయుఁ బేదజనులకు సులభమగు వెలలకమ్మి వారికి జీవనోపాయమునుఁ జూపినఁ జాలును. ఇయ్యది యుత్కృష్టమానవసేవ. మీరిట్లు చేసినను మహాత్మునకు సంతోషము. మహాత్మునకు 6 సంవత్సరములు 124 వ సెక్షను ప్రకారము శిక్షవిధించినారు.......... ఆంధ్రదేశములో సుబ్బమ్మగారను నొకవితంతువును, బెంగాలులో గూర్ఖాస్త్రీని శ్రీకృష్ణజన్మస్థానమున కంపిరి.........

..........................................

రాజకీయమన్ననేమో తెలియని స్త్రీలందరు దేశసేవచేయుచు

జైలుకేగుచున్నప్పుడు మీరు వెనుదీయుదురా? స్త్రీల ప్రాణములకంటెను మీప్రాణ మమూల్యమా? స్త్రీలకన్న మీరు బలహీనులా? జ్ఞానహీనులా? క్రొత్తవారు బయలుదేరి యుద్యమమును నిలువఁబెట్టనిచో స్వరాజ్య మేవిధముగఁ జేకూరును? మహాత్ముఁడు నుడివినట్లు చేసిన స్వరాజ్యముచేరువలో నుండును.

మీపత్నియందు మీకు నిజమైన ప్రేమయుండినఁ బరీక్షయయిన వెంటనే వచ్చెదరని నమ్ముచున్నాను. నన్ను జైలులోఁ బెట్టినారని విన్నవుడయిన వచ్చి దేశసేవను జేయరా? మీరంత కఠినహృదయులుకారు. ముమ్మాటికిని కారు. తప్పక వచ్చెదరు. మీసహధర్మిణిప్రాణము మీప్రాణముగఁ జూచినచోఁ బరీక్షయయిన వెంటనే రండు. గానిచోఁ దత్ఫలము మీరే యనుభవించెదరు! మీయిచ్ఛానుసారముగఁ జేయుఁడు. చిరకాల మనుభవించెదరు. దేశసేవ చేయుమని యొకరు నిర్బంధించిన లాభములేదు. మహాత్ముని జైలునకుఁ బంపినను మీహృదయము కరుగుటలేదా? స్వరాజ్య మెవరినిమిత్తము? హిందూ దేశీయులకుఁగాదా? మీరు భారతీయులుగారా? ఎంతకాలము పరదేశమునుండి స్వదేశమునుమఱచెదరు? మీరు వాంఛించిన విద్య ముగిసినది. ఇఁక నట నుండుటుచితముగాదు. శీఘ్రముగా మరలుఁడు. కార్యభారమును వహింపుఁడు. నే నేవిధమగు స్థితియందుండి యీవిధముగ

వ్రాయుచున్నానో మీరు గ్రహించెదరా? జులై, ఆగష్టు మాసములోఁ బరీక్షకుఁబొందు. జులై, ఆగష్టులలో యం. యస్. సి చదువుటకు వీలుండినఁ జదివిరండు. ఆపరీక్షకు సంవత్సర ముండవలసివచ్చిన జులైలో బయలుదేరి రాఁగోరెదను. దేశ మును జూడవలెనని కాలమును వ్యర్థముచేయవలదు. యం. యస్. సి ప్యాసయిన నెక్కువ విషయములు తెలియుననిగాని గౌరవమనిగాదు. మీరాక మీయిష్టానుసారమే. కాని నేను నిర్బంధించుటచే వచ్చుట నామతముకాదు.

ఇట్లు
మీప్రియురాలైన,
మా. అ. దేవి.

## 45వ లేఖ

కాంగ్రెసుసంఘం
భీమవరము,
10-4-22

ప్రియతమనీడూ,

మీకడనుండి జాబులువచ్చుటలేదు. పరీక్షసమీపిం చుటచే వ్రాయఁజాలకున్నారని తలంచెదను. మీరు జూన్ మాసములోఁ బరీక్షకుఁబోయెదరా? స్వదేశమున కెపుడేతెం చెదరు? నేనిపుడు భీమవరములో నున్నానని స్పష్టముగఁ పైవిలాసమునుబట్టి తెలియఁగలదు. నే నీ తాలూకాలోనుండి

పనిచేయుచున్నాను. శ్రీయుత దండు నారాయణరాజుగారి సోదరు లిచ్చటనేయున్నారు. స్త్రీలనిమిత్త మిచటి కేతెంచితిని. ప్రకాశముగా రిచ్చటఁజేసిన బాగుండునని హితోపదేశ మొన రించిరి. నాదేహ మారోగ్యస్థితియందేయున్నది. శరీరమేమా త్రము అనారోగ్యదశయందున్నను నేను దేశసేవ చేయఁజాలనని నమ్మఁడు. శరీరస్వస్థతవిషయములో జాగరూకతతోనుందును. దేశసేవచేయుటయం దనుజ్ఞనొసంగుఁడు. ఇపుడున్నట్టి యీ యుత్సాహమును మీరు నిర్మూలింపఁజేసిన మనజీవితములో నెన్నివిధములఁ బ్రయత్నించినను నిష్ఫలమేయగును. కాన మీరు నన్నాటంకపరచవలదు. మనమిరువుర మొక్కచోటనుం డుచో నెంతయో లాభకరముగనుండెడిది. నేను దురదృష్టవతి నగుటచే మీరీ సమయమున స్వదేశమున లేకపోవుట తటస్థించి నది. చింతిల్లిననేమిప్రయోజనము. కాకినాడనుండి ధనము పం పించినారా? నేనెంత ప్రయత్నమునుజేసినను మీకు సకాలమున ధనము పంపఁజాలకపోయినందులకుఁ జింతిలుచున్నాను. పరీక్ష లయినతరువాత 6 మాసములుండుటకన్న నవసరమున్న సంవ త్సరముండుఁడు; లేదా శీఘ్రముగ రండు. స్వదేశమునకు విచ్చే సిన తరువాత స్వరాజ్య సంపాదనమునకుపూర్వము మరల పర దేశమున కేగుటెట్లు సాధ్యమగును? ఇంకెంతకాలము పరదేశ ములం దస్వతంత్రులమనిపించుకొనుచు లజ్జావిహీనుల మయి కాలయాపన చేయఁగలము? త్వరలో వచ్చుటయే మంచిదని

కొందరును, మరికొందరు విద్యాపూర్తియయిన తరువాత వచ్చిన నుచితమని చెప్పుచుందురు. ప్రకాశముగారు మరియొక సంవత్సరముండివచ్చిన మంచిదనుచున్నారు. నాకట్లనే తోచుచున్నది కాని కుటుంబపరిస్థితులనుబట్టియు మీయెడబాటు సహించుట కష్టతమముగ నుండుటంజేసియు నాకు మీదర్శన మెపుడు లభించునా యని నిరీక్షించుచున్నాను.

మీ మామగారు సిలెండర్ల వ్యాపారము, బెజవాడ యందుఁ బెట్టినారు. పదివేల వ్యాపారముతోఁ బలకల ఫాక్టరీ పెట్టెదరు. మీరు దూరదేశముననుండుటచే విదేశవస్త్ర దహన మనవసరముగ మీకుఁ దోచుచున్నది. మీ రిచ్చట నున్నచో నట్లు భావించియుండరు. విదేశవస్త్రములు బహిష్కరించిన నెంత లాభముండునో తెలిసికొన్నయెడల మంచిదిగనుండును. అరువదికోట్ల ధనము మన దేశమందుండుటయే కాక 6 కోట్ల ప్రజల కన్నముదొరకును. పూర్వము నేతపరిశ్రమల యాధారమున స్వతంత్రముగ జీవించు ప్రజలందరు నీ విదేశపు బట్టలు వచ్చిన తరువాత తమ పరిశ్రమలన్నియు నశించగా కూలినాలి లేక జీవనోపాధికై యల్లాడుచున్నారు. మన గృహపరిశ్రమలను పునరుద్ధరించి వారందరికి జీవనములను కల్పించగలిగినది రాట్నమే. రాట్నముచే నూలుతీయుట మన దేశమున నశించుటవలననే దారిద్ర్యము మనకుఁ బట్టినది. ధన

వంతులయినను జచ్చినపిదప దహనమొనరింపక తప్పదుగదా! చచ్చిన మనుష్యుని దరిద్రునికిచ్చిన నెంత లాభమో, విదేశ వస్త్ర మితరులకిచ్చిన నంతియే లాభము. కుళ్లిపోయిన పండు దరిద్రునికిచ్చిన నాపాప మెవరిది? విదేశవస్త్రముల నితరుల కీయఁగలిగిన మనమేల కట్టుకొనరాదు? మనకుఁ బనికిరాని దితరుల కేల పనికివచ్చును? దానియందసహ్యత పుట్టుటకే దహనము. ఇదియే గాంధిమహాత్ముని యుద్దేశ్యము. మన కందరికంటె మహాత్ముని కెక్కువ తెలియును. మీరు దురభిప్రాయ పడవలదు. మహాత్ముని యరెస్టునుగురించి యే మాలోచించుచున్నారు.

ఇట్లు,

మీయొక్క

మా. అ. దేవి.

## 46వ లేఖ

కాంగ్రెసుసంఘము
భీమవరము
18–4–22

ప్రియసీదూ,

మీరు ప్రేమపూర్వకముగా వ్రాసినజాబు చేరినది. మీ పరీక్షలు సమీపించుచున్నవి. నాసందేహముల వెలిపుచ్చుచు వ్రాసినజాబు లందియుండవచ్చును. మీరు స్వదేశమునకు

విచ్ఛేసిన పిదప స్వతంత్రులుగాకమున్నే మరల పరదేశమున కేగుట యసంభవము. నాథదర్శనార్థమయి నామనస్సు పరితపించుచున్నను, మీ యిచ్ఛానుసారము మీరు మరియొక యేడాది యచటనుండి విద్యాభ్యాసమును జేసివచ్చిన బాగుండునని నాయభిప్రాయము. ఒకప్పుడు మిమ్ముఁ దత్‌క్షణము చూడవలయుననియు, నొక్కొక్కమారు మీ విద్యాభ్యాసము పూర్తియగు పర్యంత మోపికతో నుండవలెననియుఁ దలంచుచున్నాను. నేను వ్రాయుచున్న లేఖలమూలమున నా మనోవేదనయు, చపలచిత్తమును సువ్యక్తము లగుచున్నవి. నాయాత్మ యింతబలహీనముగా నుండుట కేమికారణము? దేశపరిస్థితులనుబట్టి మీరువిదేశములకు మరియొకతూరిపోవుట కేమాత్రము వీలుండదని నమ్ముచు. కాకినాడనుండిగాని, ప్రకాశముగారియొద్దనుండిగాని మీకు ధనమువచ్చియున్నదా? భీమవరములో స్వదేశవస్త్రప్రచారము చేయుచున్నాము. నేను అమ్మ యిచ్చుటనున్నారము. ధనలోపముచే వస్త్రలోపము మెండుగానున్నది. వలయునన్న వస్త్రములు లేకపోవుటంజేసి మరియొకతాలూకాకుఁ బోవలసివచ్చుచున్నది. ధనము నిమిత్తము మీరు రానవసరములేదు. దేశసేవకయి వచ్చిన సంతోషముతో నాహ్వానించెదను. మేము కాంగ్రెసునకుఁబోయి బొంబాయి, పూనహా- హైదరాబాదు, కపోలీ మొదలగు ప్రదేశములకుఁబోయి పట్టణముల దర్శించితిమి. కపోలీలో మీ

స్నేహితులగు సుబ్బయ్యగారున్నారు. అహమదాబాదులో బాపుజీ (మహాత్ముని) యాశ్రమములో నాలుగుదినములుంటిమి. మరికొన్ని దినము లుండుమనికోరిరి. శీతకాలమగుటచే నట్లుండఁజాలకపోయితిమి. కాంగ్రెసు బాగుగా జరిగినవిషయము మీకుఁ దెలిసినవిషయమేగదా! మహాత్మునకు మన మందరము బిడ్డలవలెనున్నాము. నన్నాయన బిడ్డవలెఁజూచుచు నాశరీరము విషయమయి యెక్కువశ్రద్ధఁ దీసికొనవలసినదని చూచునపుడెల్లఁ జెప్పుచుందురు. నాయం దాయనకు దయ మెండు. కాంగ్రెసుకయిన వ్యయమును శ్రీ నాయనగారే భరించినారు. పంచమబాలికను అహమ్మదాబాదులోనుంచిన నామెకు హిందీభాష బాగుగవచ్చి యందరితో బాగుగనుండు పర్యంతము నన్నుండుమనుటచే నాకు వీలులేక మరలఁదీసికొనివచ్చియుంటిని. ఆమె యుండలేనని యేడ్చి బందరులోనున్నది. మీరు స్వదేశమునకువచ్చినఁగాని యేకార్యమునుఁ జేయఁజాలను. మీరు డిశంబరులో సిచ్ఛేసిన మరి 6 మాసములుగదా! మరియొక యేడాది యుండిరంపు. మీగు జాబులు చాటపట్టునకు వ్రాయండి. మీరు మీ సోదరునకు వ్రాసిన జాబు అందినది. దూరముగానున్న తమ్మునకు స్వల్పవిషయములువ్రాసి యెందుల కాతని బాధపెట్టితివని నన్నడిగిరి. మీరవియన్నియు మరచి యం. యస్. సి. త్వరగా ప్యాసయి

రంపు. భాగముల మూలమునఁ గంపెనీపెట్టుట కవకాశములు చాలకలవు.

ఇట్లు,
మీయొక్క,
మా అ. దేవి.

## 47 వ లేఖ

చాటపఱ్ఱు
31-5-22

ప్రియతమనీదూ,

మీ కడనుండి జాబులు వచ్చుటలేదు. కారణము తెలియదు. మీ రెపుడు వచ్చునది నేనింతవరకుఁ బూర్వము వ్రాసియుంటిని. మీరు డిశంబరు 10, 15, వ తేదులలోఁ దప్పక రండు. డిశంబరులో రాఁగలిగిన కాంగ్రెసు చూడ వచ్చును. మీరు వచ్చినతరువాత కుటుంబవ్యవహారములు పరిష్కరించుకొని మీరు చేయఁబోవుపనికి ప్రయత్నింపవలసి యుండును. 5 మాసములలోఁ బ్రయత్నించినఁగాని వ్యవసాయమునకు వీలుండదు. ఆశీర్వచనం వివాహము జూను నాల్గవ తేదీని కానున్నది. పిల్లకు 12 సంవత్సరముల వయస్సు. బాల్య వివాహముల ఖండించుచుఁ గరపత్రములఁ బంచిపెట్టి యుంటిరి కదా! కనికరమ్మ వివాహముతో నాశీర్వచనము పెండ్లిచేయ నెంచినప్పుడు పంపుడు. పెండ్లి తలపెట్టినచోఁ గనికరమ్మ

వివాహమునకు రానన్ని, ఆశీర్వచనంతో చెప్పియుంటిని. సంబంధ ముకుదురక యూరకుండి యుందురు. మరల బాల్యవివాహము చేయనెంచుట మనకుటుంబమున కగౌరవముకాదా? ఇది కేవలము నారాయణరావు యిష్టము కాదు. మీయక్కగారి యిష్టమున్నది. ఆమె యేమియుఁ దెలియనట్లు నటించుచున్నది. నారాయణరావు, కృపమ్మ, పట్టాభిరామయ్య ఆశీర్వచనం పెండ్లికి బాల్యవివాహమని అన్నపూర్ణాదేవి రాదేమోయని యడిగిన నవియన్నియుఁ బెట్టుకొన్న నెట్లు కాలానుసారముగ నడువవలెనని వారితో నుడివినదఁట. నేను వివాహమునకుఁ బోనని తెలిసియు వారు చేయుచున్నారు. తమ్ముఁడు లేకుండ వివాహము చేసికొనఁగలిగిన యక్కగారు, మరదలు లేకుండ చేసికొనఁజాలరా? 6 మాసములలో మీరు రాఁబోవుచుండగఁ బెండ్లికేమి తొందర? మగపిల్లవాఁడు గదా! మీరు దూరదేశముననున్నపుడు నేనానందముతో విందులకెట్లు పోఁగలను? మీరు కష్టపడుచుండగ నేను సంతోషముతోఁ గాలయాపన మెట్లుచేయఁగలను? దేశముకొరకు నేను తిరుగుచున్నానని మీరును, మీబంధువులు తలంచవచ్చును. దేశమాతకొరకు శరీరమర్పించ సిద్ధముగనుండి సేవచేయుచున్నాను గాని విందులకుఁగాదు. గాంధిగారిపటమునుఁ బంపుచున్నాను. నాదగ్గరనున్న డబ్బునెవరికి పంపుమందురు? మోటారు సెకండుహాండు

చౌకగ దొరకిన రెండువేలరూపాయిలలోఁ గొనిన బాగుండు నేమొ! ఏయడవిలో నయిన కంపెనీపెట్టిన మనకుఁ గావలసి యుండును,

ఇట్లు,
మీయొక్క,
మా. అ. దేవి.

48 వ లేఖ

చాటపఱ్ఱు,
8-6-22.

ప్రియతమ నీడూ,

మీరు ప్రేమపూర్వకముగ వ్రాసిన జాబులు వందనములతో నందుకొంటిని. మీరు డిశంబరు మాసమునకు వచ్చెదరని అత్యంతానందముగనున్నది. కాని వాంఛితవిద్య నభ్యసించుటకుఁ బూర్వము వచ్చుటవలనఁ బ్రయోజనమేమి? మీరు ఆగస్టు మాసమునకు క్యాలిఫోర్నియా విచ్చేసి యచ్చట 2 మాసములుండి నవంబరులో బయలుదేరి స్వదేశమునకుఁ బయనము గానున్నారని తెలియుచున్నది. రెండు మాసములు కంపెనీలోనున్న మాత్రాన మీ రేమాత్రము అనుభవమును బొంది యిచ్చట స్వతంత్రులుగాఁ జేయుటకు శక్తి సంపాదించఁగలరు. ఇథాకానుండి క్యాలిఫోర్నియా పోవుటకు సుమారు 700 రూప్యములగును. ఇంత ధనము

వ్యయపరచి రెండు మాసము లుండెదరా? నవంబరులో బయలుదేరి వచ్చుటకంటె జాన్యువరి లేక ఫిబ్రవరిలో బయలుదేరి వచ్చిన బాగుండుననని నా యభిప్రాయము. మరి రెండు మాసములున్నచో 500 రూపాయలు మాత్ర మెక్కువ వ్యయ మగును. నాదగ్గరనున్న వేయి రూప్యములును మరి యెచ్చటనయిన నింకొక వేయి రూప్యములును ప్రయత్నించి డిశంబరులో బంపెదను. నాదగ్గరనున్న వేయి రూప్యము లెపుడు పంపించమన్న నపుడే పంపెదను. ఈ వేయి రూప్యములు మీ రితరుల కీయవలసిన యవసరములేదు. మోతే వారికి నాలుగువేలు మీ రీయవలసియున్నారు. మీరు వచ్చు లోపల నవసరమున్నచో నింకొక వేయి రూప్యములు కావలసి యుండును. నాయకరు నిధివారు మీరు స్వదేశమునకు విచ్చే యుటకయి విత్తమంపినచో మన మిక పరులకడ భిక్షమెత్త వలసిన యవసరముండదు. నేను పంపఁబోవు ధనము ప్రకా శముగారివద్దనుండి కాని, నారాయణరాజుగారియొద్దనుండి కాని సహాయమును బొంది పంపుటలేదు. మీరు సందేహించ వలదు. ప్రకాశముగారి యుద్దేశ్యము ధన సాహాయ్యమున్నచో మరియొక సంవత్సరమయిననుండి సంపూర్ణ విద్య నభ్యసించి వచ్చుటయే యుత్తమమని తెలిపియుండిరి. మీరు స్వదేశము నకు వచ్చినపిదప మరల పరదేశముపోవుట కేమాత్రము

వీలుండదు. అందులకు ధనాభావము దేశపరిస్థితులే కారణము. మీకున్న యాస్తి ఋణవిముక్తికి మాత్రము చాలునని నా యభిప్రాయము. ఇదివర కున్నదికాక 5 వేల రూప్యములు ప్రస్తుతము ఋణము చేయుచున్నారు గదా! ఇట్టి పరిస్థితులలో మరల మీ రేవిధముగ విదేశమునకుఁ బోఁగలరు? అస్వతంత్రులమయి పరదేశముల కేఁగుటకంటె నవమాన మింకొకటియున్నదా? ........................ స్వరాజ్యము లభింపనిచో మీరు పోవుట కేమాత్రము వలనుగాదని నమ్ముఁడు. కుటుంబపరిస్థితులనుగూర్చి మీరు విచారింపవలదు. మీ కుటుంబవ్యవహారములను జక్కపరచిన మీ యాస్తి కొంత మీకు లభించునని భ్రమపడుచున్నారేమొ? భ్రమ ముమ్మాటికి భ్రమయే. మీరు పరదేశమునకుఁ బోవునపుడు మూఁడు సంవత్సరము లుండవలెననియు సంతకుఁ బూర్వము వచ్చుటకు వీలుగాదని తెలియదా? మీ రేగునపుడు మీ కుటుంబవిషయమే మాలోచించియుంటిరి. మూఁడు సంవత్సరము లేవిధముగఁ గడుచునని మీరందరు భావించియుంటిరి? ఆవిధముగ నిపుడు జరుగును. మీకుఁ దొందరయేల?

కుటుంబమునకయి వచ్చెదరా? ఇపుడువచ్చి ఏమిచేయఁదలచితిరి? పితామహులార్జించినధనము లేనందున మీరును సంపాదింపఁజాలనిచో మీ భావికుటుంబము నేవిధముగఁ

బోషింపనున్నారు? ధనాభావముచే మీ రనుభవించుచున్న బాధలుచాలవా? మీ సంతానము నేవిధముగఁ బోషింపనున్నారు? ధనాభావముచే మీ రనుభవించుచున్న బాధలు చాలవా? మీ సంతాన మీ విధముగఁ బరితపింపవలసియున్నదా? మీకు ధనాశ లేకపోయిన లేకపోవచ్చును. మీ కిఁక ధన మవసరము లేకపోవచ్చును. గాని మీరింతకాలము వ్యయపరచిన ధనము దాదాపు ఇరువదివేల రూప్యములు మీయొక్కొక్కబిడ్డకుఁ గావలసియున్నదికదా! మీరు సంపాదింపఁజాలక మీబిడ్డల నన్యాయముగ మూర్ఖులను జేసెదరా? ఎందరుబిడ్డలను మీకు భగవానుఁ డీయనున్నాఁడో యెవరికెరుక? ఇట్టిస్థితిలో మీ రెంత ధనమార్జింపవలసియున్నదో, విచారింపుఁడు. ప్రస్తుతము నన్నుఁబోషింపవలసి యున్నది కదా! నన్నుబోషించుట యన్న నేఁడాది కొన్ని వేలు వ్యయపరచవలసియున్నదో యాలోచింపుఁడు. నాభోజనమునకు, వస్త్రములకెక్కువ విత్తము వ్యర్థముగా వ్యయపరచవలసిన యవసరముండకపోవచ్చునుగాని అఖిలభారత కాంగ్రెసుసంఘములకు, జిల్లాసంఘములకు, తాలూకాసంఘములకు, రాష్ట్రసంఘములకు హిందూదేశమంతయుఁ బర్యటనము చేయవలసియున్నది. ఆసభలకుఁబోయినచో ననేకవిషయములు తెలియును. రాజకీయములందనుభవముకలుగును. నాకెంత యాశయున్ననేమి ధనలోపముచే వెనుకంజవేయవలసివచ్చినది.

అయ్యో ! నన్నిట్టి కుటుంబములలోఁ బుట్టించి యిన్నికష్టముల పాలుచేయుటకంటె నేదినము కానలసిన దా దినము సంపాదించు భిక్షాధికారి గృహమునం దుద్భవింపఁజేసిన నెంత యో బాగుండెడిది. నాకీవిద్య యుత్సాహము, దేశాభిమానము లేకున్న బాగుండెడిది. ఇంకెంతకాల మీ విధముగ ధనమున కయి బాధల నొందవలసియున్నదో? నేను మిమ్ముఁ గోరున దేమనఁగా మీరు ధనమునకై డిశంబరులో రానున్నవారు జూన్ మాసమువరకుండి యం. యస్. సి పరీక్షప్యాసయిన తరువాతరండి. ఇఁక 6 మాసము లెక్కువ యుండవలసి యుండును. యమ్. యస్. సి ప్యాసయిన గొప్పయని కాదు. మరియొక యేడాది చదివినచో నెక్కువ లాభముండునని నాయభిప్రాయము. వేసవికాలపు సెలవులలో దేశపర్యటనము చేయుఁడు. క్యాలిఫోర్నియాలో యమ్. యస్. సి. చదివిరండు. మీరు కంపెనీలో రెండుమాసము లున్నంతమాత్రమున నేమి యనుభవముండును? యం. యస్. సి. చదువుచుఁ గంపెనీ చూడఁ గూడదా? అయ్యో! మీరు స్వయముగ వ్యవసాయము చేయవచ్చునందురు. ధనమేది?

భద్రాచలము అడవులున్నవి. ఆయడవిలో విశాలమయిన తటాకమొకటి యున్నదఁట. ఆభూములకు వలయు నీరంతయు సప్లయి చేయఁగలదఁట. మనకు భూములు సులభమైన వెలలకు దొరకిఁగలవు. కాని మెట్టభూములు మొదలగు

నవి సాగుబడిచేయుట కవసరమగు సామానులు కొనవలెను గదా! అచ్చటఁ గూలివాండ్రుండరు? మన మీ ప్రదేశముల నుండి తోడ్కొని పోవలసియుండును. వారందరికొరకెంత ధనము వ్యయపరచవలసి యుండునోకదా! ఆయడవులలో మన మొంటరిగా నుండఁగలమా? ఇవన్నియుఁ జేయఁగల్గిన యదృష్టమెట్లున్నదో? మీకుఁ దోటలన్న నానందము. "జాము" వలన దేశమునకంత లాభముండదు. అయ్యో! ఇచ్చట తిన తిండిలేక యల్లాడు ప్రజలకు జాము ఎందులకు? మనకుఁ బ్రత్తి యాహారపదార్థము లుండినఁజాలును. 'జాము' లేదని భారతీయులు విచారించుటలేదు. అస్వతంత్రు లగుటచే దరిద్రులయియున్నారని దుఃఖించుచున్నారు. ఆకలి తీర్చుకొనుటకు సాధనము ప్రథమమున గూడవలయును. జాము, కాఫీ, బిస్కట్లు మొదలయినవి లేకున్నను జీవింపవచ్చును. మీ యుద్దేశ్యమేమి? ఇచ్చటకు వచ్చిన తోటలువేయించి ఆకం పెనీలు పెట్టి జాము తయ్యారుచేయించి పరదేశములకెగుమతి చేయవలెననియా మీ యభిప్రాయము? మీరట్లుచేసిన దేశ సేవకాదు. మీరు వచ్చినతరువాత ఫలవృక్షములు వేయించిన ఫలము లెప్పుడు లభించును? అంతవరకు మీరేవిధముగ ధనార్జనచేసెదరు? ప్రకాశముగారు మీరు 'జాము' తయ్యారుచేయుట నభ్యసించుచున్నారనిన నవ్వెరి. మీరచ్చటఁ దినుచున్నారని అందరికిఁ గావలయునాయేమి? హిందూ

దేశము పూర్తిగమారినది. పాశ్చాత్యపద్ధతులు క్రమక్రమముగా నంతరించుచున్నవి. పాశ్చాత్యవ్యామోహామునఁ దగులొన్నవారు సనాతనపద్ధతుల నవలంబించుట కేమి యత్నించుచున్నారు? మీరు విద్యావంతులయి వచ్చి సాగుబడికాని భూములు సాగుబడిచేసి బీదలనుబోషింపవలెను. అడవులలో ధాన్యమును బండించుటకు మనుష్యులుండరు. అచ్చటయంత్రముల నుపయోగించి వేలకొలఁది యకరములఁబండించిన లాభము. ఎచ్చటఁ గూలివాండ్రు విశేషముగనున్నారో, అచ్చట మీ యంత్రముల నుపయోగించి వారి కడుపులోని యన్నమును దీసికొనుట యసంభవము. క్యాలిఫోర్నియాకుఁ బోయి కంపెనీలలో రెండుమాసములుండునని వ్రాయుచున్నారు. అందువలన మీరు 'జాము, తయ్యారుచేయగల విధము బాగుగ నేర్చుకొనఁగలరు. మీరొక వ్యవసాయదారుని కడనుండి యినుపపనిముట్లతో నేవిధముగ భూమి బాగుచేయవలెనో, ఏయేపైరు లేవిధముగఁ బండించవలెనో నేర్చుకొనుఁడు. పరులకడ ఋణముదెచ్చిన మన మేకార్యము చేయఁజాలము. ఋణమెవరిత్తురు? ఇచ్చట దర్శి చెంచయ్యగారు క్యాలిఫోర్నియాలో విద్య నభ్యసించినారఁట. మెట్టు వ్యవసాయ మేవిధముగఁజేయించవలెనో, ఆంధ్రమున వ్రాయుచున్నారు. దేశమున కత్యంత లాభకారి యగునట్టి వ్యవసాయ పరిశ్రమాలయమును బెట్టవలయుననియు నితర కంపెనీలు

పెట్టుచున్నప్పుడు దీనికేల ప్రోత్సాహముచేయరని వ్రాయుచున్నారు. ప్రజలు సాయపడినచో నాతఁడు పెట్టఁబోవుచున్నాఁడని తెలియుచున్నది. భాగముల మూలమునఁబెట్టినచో నాతనికన్న మీకు ప్రజ లెక్కుడు సాయపడఁగలరు. భద్రాచలం భూములు మంచివి. ప్రకాశంగారిద్వారా శనివారప్పేట రాజాగారివద్దనుంచి సులభముగా మనము వానిని బడయఁగలమని నమ్మకమున్నది. మీరిచ్చటకు వచ్చినచో ననేక విషయములనుగూర్చి మన మాలోచింపవచ్చును. ఏదో యొకవిధముగ మీరు కార్యమునఁ బ్రవేశించిన లాభముండును. మీరు యం. యస్. సి. ప్యాసుకానిచో నిచట నాంధ్రదేశములోఁ గ్రొత్తకంపెనీ పెట్టినచో నద్దానిపై నధికారిగ మిమ్ముంచక మరియొక యం. యస్. సి. నుంచుటకుఁ బ్రయత్నింతురేమో యని భయముగనున్నది. మీరు యం. యస్. సి. చదువుచు నెచటనయినఁ బనిచేయఁగూడదా ? ప్రయివేటుగఁ జదువుచుఁ బనిచేయుటకు వీలుండదా ? ఏడాది యం.యస్.సి. చదివినదానికంటె రెండుమాసము లెచ్చటనయినఁ బనిచేసిన నెక్కువ లాభముండునని గ్రహించిన నట్లుచేయుఁడు. మీయుద్యోగానుసారము 1923 జూనుమాసమువరకుండిరండు. ధనమున కాలోచింపవలదు. అంతకాల మున్నచోయం.యస్. సి. ప్యాసయిరండు. యం. యస్. సి. చదువుచున్నప్పుడు మీరు శాలములలోఁ బనిచేయవలసియుండదా ? అపుడు

కొంత యనుభవముండదా ? జూనుమాసమునందుఁ బరీక్ష యయిన తరువాత 2 మాసములుండి రాఁగూడదా ? ధనము నేను సమకూర్చెదను. మీరు డిశంబరునకు వచ్చిన నిఁక 6 మాసము లుండవలసియుండును. ఆంధ్రదేశములో నీసంవత్సరము కాంగ్రెసు జరుగదు. గయలో జరుగనున్నది. మన యదృష్టవశమున బహుశః 1923లోఁ గావచ్చును. క్యాలిఫోర్నియాపోయి రెండుమాసము లున్నంతమాత్రమున మీ రెంత యనుభవశాలులు కాఁగలరు ? కాన మీరచ్చట నేడాదియుండుటకు వీలుగానిచో 6 మాసము లుండిరండు. మీకు ధనసాహాయ్యముచేసినఁ జాలునుగదా ! నాశక్తికొలది ప్రయత్నించి మీకుఁ గష్టకాలమందు సాహాయ్యముచేయఁ జాలకున్న నాజీవితమే నిష్ఫలము. నాయందు దయయుంచి మీ యిచ్ఛానుసార మచటనుండి సంపూర్ణ విద్యావంతులయి రండు. మనకు ధనమున్నపుడు మీరు మరల పరదేశమునకుఁ బోఁగలరా ?

అహో ! నాకు ధనములేనందున నివ్విధముగఁ గావలసివచ్చెఁగదాయనియు, వాంఛితవిద్య నభ్యసింపలేదనియు విచారము మీకుండవచ్చును. కాన మీ యిష్టానుసార ముండి కష్టముల సంతోషముగ ననుభవించి జయమును గాంచిరండు. ఇదియే నాప్రార్థన. నాజాబులు మీ కద్భుతముగ నుండవచ్చును. ఒకసారి తత్ క్షణము రమ్మనియు, మరి

యొకమారు మీవిద్య సంపూర్ణమగువరకు రావలదనియు వ్రాయుచుందును. నా చంచలస్వభావ మిందు స్పష్టమగు చున్నది. ముందు సౌఖ్యములకయి యిప్పుడు కష్టపడుటకు సంసిద్ధురాలనయియున్నాను. ప్రకాశంగారు తాను సంపాదించుచున్నది రైలుఖర్చులకు చాలుటలేదనియుఁ దానెవరికినిపుడు సహాయముచేయఁగల స్థితిలో లేననియుఁజెప్పిరి. ఎంతకాల ముండునదియు నేనేమి వ్రాయను ? "ఇచ్చటనుండి ధనమంపిన నచ్చట నుండుమని వ్రాయవచ్చును. నేనేమియు ధనముపంపఁ జాలక యెట్లుండుమని వ్రాయను" అనిచెప్పిరి. వచ్చినతరు వాత మరలపోవుటకు వీలుండదని చెప్పిరి. ఈ కారణముల వలన నచ్చట మీరెంతకాల ముండఁదలచితిరో యంతకాల ముండి రమ్మని నాకోరిక. కుటుంబము ధనమునకయి మీరే మాత్రము విచారింపవలదు. జూను 1923 వర కచ్చటనుం డుట యం. యస్. సి. చదువుట యిష్టములేనిచో మీరెంత త్వరగా రాఁగలిగిన నంత సంతసము. ధనములేకుండుటచే రావలసివచ్చినదని విచారించుటకు వీలుండదు. నేను త్వరగా రమ్మనుటచే వచ్చితినని చెప్పుటకు వీలుండదు. నేను మిమ్ము జూను 1923 వర కుండుఁడని వ్రాసితిని. మీ బంధువులకు స్నేహితులకు వ్రాయవలదు. మీ నాయనగారు నేను మిమ్ము నుండుమని వ్రాయుచున్నానని సందేహపడుచున్నారు. మీరు ధనార్జనము సేయుటకు శక్తిసామర్థ్యములు సంపాదింపుఁడు.

ఏవిధముగను ధనము సంపాదింపఁజాలనిచో జీవించుటెట్లు? కనుక మీరు తొందరపడిరావలదు. బ్రహ్మముగారు బొంబాయినుండి వచ్చినారు. ఈదిన మిచ్చటనేయున్నారు. గవర్నమెంటుద్యోగమునకు యం. యస్. సి. కి. లాభముండును గాని మనము స్వయముగ కంపెనీపెట్టి చేయించవలెనన్నచో బాగుగ ననుభవముండవలయుననియు, డిగ్రీలతోఁ బనిలేదనియు నుడివిరి. సంవత్సరము విద్యనభ్యసించిన దానికన్న రెండుమాసములు పనిచేసిన లాభముండునని చెప్పిరి. యమ్. యస్. సి. కొరకు వ్యర్థముగా ధనము వ్యయపరచుటకన్నఁ ద్వరలో వచ్చుటయే మంచిదని తోఁచుచున్నది. కాన మీరు యం. యస్. సి. కొరకుఁ బ్రయత్నించవలదు. పరీక్షయయిన తరువాత ఆరుమాసము లెచ్చటనయిన పనిఁజేసి యనుభవమును సంపాదించగలరు. ప్రకాశముగారు "పుస్తకములను జదివినమాత్రాన ననుభవముండునా? అనుభవము కలిగిన తరువాత వచ్చిన బాగుండును. నేనేమని చెప్పుదును? నేనేమి సహాయముచేయఁజాలనపు"డని నుడివిరి.

ఆరుమాసములు వ్యవసాయదారునికడనుండి మీ రనుభవమును సంపాదించినచో నెక్కుడు లాభముండును. కంపెనీలు పెట్టిన డిగ్రీలుచూడక, అనుభవమును జూచెదరఁట. కాబట్టి మీరు మరి ఆరుమాసములు పనిచేసి సాధ్యమైనంత

త్వరలో స్వదేశమునకు మరలిరండు. కంపెనీలోఁబనిచేయుట కన్న, పొలములయందుఁ బనిచేయుట యుత్తమమనితోఁచు చున్నది. యమ్. యస్. సి. పరీక్షవిషయమై నాకుఁబూర్తిగా మారినది. మీ రచ్చటఁబనిచేసి శక్తిసామర్థ్యములు సంపాదించిరండు. ఇన్నివిధముల వ్రాసినందులకు క్షమింపుడు. మనకుఁ గావలసినది పనిగాని పేరుగాదు. పనిచేయుటవలన లాభముండును. రెండుమాసములు కంపెనీలలోనున్నను మరి నాలుగుమాసములు పొలములలోఁ బనిచేసిరండు.

శ్రీ నాన్నగారు సిలెండర్ల కంపెనీ పెట్టినారు. తరువాత పలకల ఫ్యాక్టరీ పెట్టెదరఁట. పెట్టినంతమాత్రమున గొప్పవారమయితిమా? ఋణముతీరినతరువాత సంతోషము. ఇరువంకలవారేకవిధముగ నుండుటచూడ నా దురదృష్టము గనే తోఁచుచున్నది. ఈవిధముగ నుండుటకన్న నెట్లుండిన బాగుండునో మీరే గ్రహింపుఁడు.

ఇట్లు,

మీ యొక్క,

మా. అ. దేవి.

## 49 వ లేఖ

చాటపఱ్ఱు,
21-6-22.

నా ప్రియమైన సీడూ,

మీరు ప్రేమపూర్వకముగ వ్రాసిన జాబు లందు చున్నవి. మీ పరీక్షలు ముగిసినవనినమ్ముచున్నాను. మీరు త్వరలో క్యాలిఫోర్నియా వెళ్లెదరు గదా! పురాతన స్నేహితులఁ ద్వరలో విడనాడవలసివచ్చుచున్నది గదా యని విచారముగానున్నదా? నే నిదివరకు వ్రాసినట్లుగ మీరు మన కొక మోటారు తెచ్చుటకుఁ బ్రయత్నించుచున్నారా? చేతి సంచులుకూడఁ గొనుఁడని వ్రాసియుంటిని. నేను ముఖ్యముగా నారాయణరాజు అన్నగారికి నేమయిన నీయఁదలఁచితిని. ఇచ్చట నే నేమి యిచ్చుటకు వీలుగాదు. మీరు వచ్చునపుడు మీ బావగారికి వీలయిన సామానులు తెచ్చిన సంతసముగ నుండును. ఆయన కేమి యిచ్చినను దీసికొనరు. మీ రచ్చట నుండి తీసికొనివచ్చిన నేవిధముగనయినఁ దీసికొనునట్లు చేయవచ్చును. ఆయనకు నాలుగు సంవత్సరముల బాలికయున్నది. ఆమెకుఁ దగిన వేమయిననున్నచోఁ దీసికొనిరండు. మంచి చేతిసంచియైనను, చేతిగడియారము అయిన బాగుండునని నా యభిప్రాయము. శేషగిరి రావుగారి కేమైనఁ దీసికొనిరండు. వీనికి నేనే ధనము పంపెదను. ఇతరులకు, బంధువులకు

ఏమియుఁ దెచ్చుటకుఁ బ్రయత్నింపవలదు. ఒకరికిచ్చిన సం దరి కీయవలసియుండును. మన మందరి కీయఁదగిన స్థితిలో లేము. ధనలోపమున మీ రింత కష్టపడుచుండ నితరులకిచ్చు బహుమానములకయి మీ ధనమును వ్యర్థము చేయవలదు. తేఁగలిగిన రాఘవేంద్రరావునకుఁ దీసికొని రండు.

మిమ్మెపుడు చూడఁగలుగుదునాయని నిరీక్షించుచు న్నాను. ఇపుడు ప్రచారము చేయఁజాలకున్నాను. మహా త్మాజీ జైలునందు దేశహితార్థము బాధనందుచుండ గృహ మున వ్యర్థముగాఁ గాలము గడుపఁజాలకున్నాను. మహా త్ముఁడు జైలున కేగునపుడు ఖద్దరు ఖద్దరని దేశమునకు హిత బోధ చేసియుండిరి. స్వదేశ వస్త్రముల మూలమున మన దేశమునుండి తరలిపోవుచున్న ధనప్రవాహమాగి దారిద్ర్యము నశించును. ప్రజలు సంతోషసాగరమున నోలలాడుదురు. ఈ కరవు నశించి తినుట కన్నము, కట్టుటకు బట్టలున్న సంతో షము కదా! ఆ స్థితి వచ్చుటయనగా స్వరాజ్యము వచ్చు టయే. స్వాతంత్ర్యము సంపాదించి ఖద్దరు (స్వదేశవస్త్రము) కంపెనీలను పెట్టి వడుకునూలు బట్టలఁ బెంపొందించుటయే హిందూదేశీయుల ముఖ్య కర్తవ్యము. పీలయిన ప్రదేశము లందుఁ బరిశ్రమాలయములు పెట్టుచున్నారు. వర్తకులు విదేశీమిల్లు నూలు స్వదేశీ వడుకునూలని మోసముచేయుచు

న్నారు. అందువలన కాంగ్రెసు స్వాధీనమున కంపెనీలు స్థాపించి శుద్ధస్వదేశీ వస్త్రములఁ బొందించుటకయి ప్రయత్నించుచున్నాము. ఇట్లు స్థాపించవలెనన్న ధనసాహాయ్య మెక్కువ కావలసియున్నది. ప్రజ లిదివర కంత యుత్సాహముగా చందాల నిచ్చుటలేదు. కాంగ్రెసు సహాయముచేసినది యత్యల్పము. గ్రామాదులకుఁ బోయిన ధనము చేకూర్చఁ గలను గాని నా శరీరారోగ్యమునుబట్టి యావిధముగఁ జేయఁ జాలను. ఎవరేని పదివేల రూప్యములు సాయముచేసెదరా యనినఁ జేయువారు కాన్పించరు. నేను పెట్టఁబోవుచున్న కంపెనీలో స్త్రీలుందురు. కంపెనీల భారమంతయు స్త్రీలదే. సహాయము చేయుటకు రాజు అన్నగా రంగీకరించిరి. అన్ని విధముల వీలుగనున్నది. కాని ధన మెటనుండివచ్చును? అయ్యో దైవమా! నేను ధనవంతురాలనయిన నీవిధముగ విచారింపవలసియుండునా? ఎపుడు నా కుద్దేశ్యమున్నదో, తత్క్షణమే నేను స్థాపించియుందును గదా! స్త్రీ లింత కార్యము చేయఁగలరాయని సందేహించెదరేమొ! మీ పరీక్షలయినవి గదా! మీరు నాకొక సహాయము చేయఁ గలరా? అమెరికాదేశమం దనేక కోటీశ్వరులుందురు గదా! గాంధిమహాత్మునియందు భక్తి విశ్వాసము లున్నవా రనేక మంది యుండవచ్చును. వారందరు హిందూదేశమున బానిస

లయి దారిద్ర్యము ననుభవించువారి నిమిత్తము భరతమాత యొక్క స్వారాజ్య సంపాదనార్థము త్యాగముఁజేయఁజాలరా? ఆ ధనవంతులు, ఆ స్వాతంత్ర్యాభిలాషులు దూరమున ననేక బాధల ననుభవించుచున్నవారి విముక్తికయి వారు తుచ్ఛ ప్రపంచ సౌఖ్యములకయి వ్యయపరచుచున్న ధనములో నూఱవవంతయిన నీ దేశమున ఘోషాస్త్రీలు స్వారాజ్య సంపాదనార్థము దేశసేవ చేయుచున్న సోదరీమణులకు సహాయము చేయఁజాలరా? ఏలూరులో స్త్రీలు పెట్టఁబోవు గాంధి పరిశ్రమాలయమునకయి ధనసహాయము చేయవలసినదని మీ యమెరికాస్నేహితుల నడుగుడు. మీ స్నేహితులు మీరు కలసి యొక సంఘముగా బయల్వెడలి భారతదేశ స్వారాజ్య సంపాదనార్థము పాటుపడుచున్న స్త్రీలచే స్థాపింపఁబడిన ఖద్దరు సంఘమునకని భిక్షమెత్తుఁడు. మీ స్నేహితులు వారి సోదరినగు నేను చేయుచున్న దేశసేవ కానందించుచున్నారని వ్రాయుచుంటిరి గదా! అంత సంతసమయిన బలహీనురాలగు సోదరి గ్రామములు తిరుగఁజాలక దేశమునకు ముఖ్యమైన ఖద్దరు సంఘము స్థాపించుచున్న, వారు శక్త్యనుసారము సహాయము చేయరా? వా రెక్కువ చేయఁజాలకపోయినఁ బోవచ్చును. హృదయపూర్వకముగ—దయానురాగములతో నెంత ధర్మము చేసిన నంత దేశమునకు జయమని చెప్పుఁడు. వారట్లు స్వధన

మును వ్యయపరచఁజాలని-చో దయయున్న నాలుగు దినములు సెలవులలోని కష్టమయిన మాకుఁ బంపఁగలరు. నేను ముఖ్యముగా మీ స్నేహితులను గోరునదేమనగా మీరందరొక సంఘముగాఁ జేరి నేను స్థాపింపఁబోవుచున్న గాంధీ పరిశ్రమాలయమునకు ధనమును జేకూర్చి పంపుఁడనియే. మీ రొంటరిగఁబోయిన విశేషధనము దొరకదు. నేను స్థాపింపఁబోవు దానికి మీరు భిక్షమెత్తిన మనము మోసముచేయుచున్నామని భావించెదరు. మీకు వివిధదేశవాసుల స్నేహ మున్నది కదా! వారు మీ నిజమయిన స్నేహితులయినయెడల స్వతంత్ర రాజ్యములో స్వతంత్రులయి సంతోషముగానున్న వారు..................స్వతంత్రతకయి పెనగులాడుచున్న మిత్రునకు సహాయముచేయరా? కష్టకాలమందు స్నేహితుని రక్షింపఁజాలకున్న స్నేహమునలన లాభమేమి? స్వయముగ వారినందరిని నేనడుగు భాగ్యము లభింపఁజాలనందులకయి చింతిల్లుచున్నాను. వారందరు గలిసి నా కంపిన ఇచ్చట నయ్యాది పరిశ్రమాలయమునకే వ్యయపరచి పత్రికలలోఁ బ్రచురపరచి పరిశ్రమాలయమునుండి ముట్టినట్లు జాబు వ్రాసెదము. ఇప్పుడింకను పరిశ్రమాలయమును స్థాపించియుండలేదు. ప్రయత్నించుచున్నాము. ఇచ్చట నాయకు లెవరిచేనైన ధనమును దేశమునకై వినియోగించుచున్నట్లు వ్రాయించెదము. ధనము చేకూరిన త్వరలో స్థాపిం

చెదము. లేనిచో మీరు పంపఁగలిగినపుడే స్థాపించెదము. హిందూదేశములో నేభాగమువారికి సహాయము చేసినను హిందూదేశమున కంతకును సహాయము చేసినట్లేయని వారికి తెల్పుడు. పదివేల రూప్యములతో స్థాపించిన తరువాత లక్ష రూపాయిలవరకభివృద్ధి చేయవలెననియున్నది. అచ్చట మీ రెంత చేకూర్చఁగలిగిన నంతమంచిది. మీ రాదేశమునుండి యెంత పంపఁగలిగిన భరతమాత కంతలాభము. మీకు చైనా దేశీయస్నేహితులును మరి యితరదేశ స్నేహితులు నున్నారు కదా! వారు మన దేశమునకు సహాయముచేయు టకు వెనుదీయుదురా? అమెరికా దేశమునందలి శ్రీమంతు లకు మన దేశమన్న నిష్టములేదా? నేను మిమ్ములను భిక్ష మెత్తుమన్నది మనకొఱకుఁ గాదు. భరతమాత నిమిత్తమే. పరదేశమున భిక్షమడిగిన నష్టములేదు. అగౌరవము కాదు. ఈ కారణముచే మీ స్నేహితులకడ భిక్షమెత్తుటకు నేనేమియు సందేహించుటలేదు. నానిమిత్తము కానపుడు నాకు సిగ్గెందు లకు? మీ స్నేహితుల కీవిధముగ నుడువుఁడు. "మీ సోదరీ మణు లొక యుత్తమకార్యము చేయుచున్న మీ రెంత ప్రేమోత్సాహములతోఁ జేసెదరో, అదేవిధముగ భారత సోదరీమణి కోరినపు డావిధమగు భావముతోఁ జేయవలెను. మీ స్నేహితుని భార్య సోదరితో సమానము గదా! నే నింత శ్రమ యిచ్చుచున్నందులకు మీరందరు క్షమింపుఁడు.

మీరు భారత మాతృసేవకయి పరదేశమున విద్య నభ్యసించి వచ్చుటయే కాక ఆమె దుఃఖము బాపుటకయి పదివేల రూప్యములయినఁ బంపఁ బ్రార్థితులు. మీరు సమయముఁ జూచి మీ స్నేహితులకడ నా వాంఛను వ్యక్తపరచవలెను. మీ రింతమాత్రము సాహాయ్యము నాకును భరతమాతకుఁ జేసెదరని విశ్వసించుచున్నదాన. అమెరికా దేశములో నివసించుచున్న భారతీయులవద్దకూడ భిక్ష మెత్తవలెను.

మీరు పరీక్షయందు త్తీర్ణులయితిరని నమ్ముచున్నాను. మీరు మరియొకమాస మచటనుండి కలకత్తా డిశంబరు 15, 20 వ తేదులలో రాఁగోరెదను. మీరీలోపుగ వచ్చిన మీ కెదురుగవచ్చుటకు వీలుండదు. డిశంబరులో కాంగ్రెసునకు రావలసియుండును. ధనము వ్యర్థముగ వ్యయపరచవలసియుండును. మీ ప్రయాణపుఖర్చు పంపుమని నాయకరునిధికి, హరిశ్చంద్రునికి వ్రాయండి. అమ్మ కట్టించుచున్న ప్రార్థనసమాజభవన నిర్మాణము పూర్తియైనది.

ఏసుక్రీస్తు ననుచరులు మతకర్తచెప్పినట్లు అందరిని సమానముగఁ బ్రేమించుఁడనియు, ఒక చెంపపైఁగొట్టిన మరియొక చెంప నీయవలసినదనియు హితముగరపునపుడు హిందూదేశమునఁ గష్టపడుచున్న వారికి సహాయముచేయుటకు వెనుదీయరని నమ్ముచున్నాను. వారి దేశములోని ధనవంతులకుఁ

దోడ్పడుటకన్న దరిద్రులబాధ దీర్చుటయే యుత్తమమని చెప్పెఁడు. ఆకలిగొన్నవారి కన్నమిడిన లాభముగాని ధనవంతులకు మృష్టాన్నమునిడిన ప్రయోజనమేమి? కావున వారు మనదేశమునకు సహాయమొనరించిన ధన్యులు.

నాబాధలు పరులకు గోచరింపవు. కేవల మా భగవానునకుమాత్రమే తెలియును. మీరు వచ్చువర కీవిధముగ నున్నఁజాలును. ఉన్మాదిని నయ్యెదనేమో యని భయపడుచున్నాను. మనస్సు మనస్సులో లేదు. మీరు అమెరికానుండి ధనమును చందాలద్వారా పంపఁజాలకున్నఁ ద్వరలో రండు. నేను చేయఁదలచిన ప్రతికార్యమున కీవిధముగ నాటంకమును గలుగఁజేయుట భగవంతుని యుద్దేశ్యమయియుండును. భగవంతుని పరీక్షలకు నే నాగఁజాలకున్నాను. నే నత్యంత దుర్బలహృదయను. నేను పోవు మార్గము కంటకావృతమైనది. పాదముఁదీసి పాదముఁబెట్టుటకు వీలుగాకున్నది. ఆముండ్లను దొలగించి మార్గమును సరిచేయువారులేరు. నేనే యొక్కొక్క కంటకమును ఆపథమునుండి తొలగించుచు ముందునకు సాగి పోవుచున్నాను. వాంఛితస్థానముచేరుట అసంభవము. ఆమార్గము కంటకావృతమే గాక వంకరవంకరసందులు, వృక్షములతో సంకీర్ణమయియున్నది. తెన్నుఁగానక యచ్చటచ్చటఁ దిరిగి ప్రథమస్థలమునకే రావలసివచ్చుచున్నది. భయంకరపథ

మునఁ బాదముంచుటకు భీతి పొడముచుండ నా నిశ్చితస్థానమును జేరి యానందాబ్ధి నోలలాడుటెట్లు? దేశసేవమూలమున నా వాంఛితస్థలము చేరవలసియున్నది. జులై పదియవతేదీని పరిశ్రమాలయము స్థాపింప సమకట్టితిని. ఇంతవరకు గృహాము దూది మొదలగువానికయి ప్రయత్నింపలేను. స్థాపించుటకు మా 1000 రూప్యములున్నవి. భగవంతునిదయ యెట్లున్నదో తెలియదు. సాహాయ్యము చేయుదునని చెప్పియుండిన రాజు అన్నగారు ఇపు డిచటలేరు. తణుకుతాలూకాలో ప్రచారము చేయుచున్నారు. వారు వచ్చునంత స్థాపించుటకు వీలగును. నేను ప్రచారము చేయఁజాలను. ఒకస్థలముననుండియే ఖద్దరు వృద్ధిచేయవలసియున్నది. ప్రచారముచేయుటకు శక్తిలేదు. అందువలన నీకార్యముచేయుచున్నాను. తొట్టిస్నానము చేయవలయుననియున్నది. శరీరమును గాపాడుకొనుచున్నాను. పరిశ్రమాలయమును స్థాపింపలేనిచో నాశరీర మనారోగ్య స్థితియందున్నను ప్రచారము చేయకమానను. నా ప్రాణములున్నంతవరకు నేను దేశసేవచేయుటకే ప్రయత్నించెదను.

నేను అమెరికా విద్యార్జనమున కేతెంచుటకుఁ బ్రయత్నించియు రానందువలన లాభములు చాలకలిగినవి. ప్రపంచోద్ధారకుఁడగు మహాత్ముని దర్శనమే కాక ఆయనదయను-ప్రేమను సంపాదింపఁగలిగితిని. మహాత్మునికి నేనన్న నమిత

దయ. నేను చేయుచున్న దత్యంత స్వల్పసేవయయినను దేశ సేవ. ఈ యుద్యమమునందుఁ బ్రవేశించుటచే మరియొకలాభ ము కలిగినది. నారాయణరాజుగారి స్నేహము లభించినది. ఆయననుబోలు స్వార్థరహితులు, త్యాగశీలురు ప్రపంచమునం దరుదుగనుందురు. ఆయనను జూచిన మహాత్ముని కుటుంబ ములో నొకరా యను భావము కలుగును. ఆవిధముగవారుం దురు. పరదూషణ ఆయన ముఖమునుండి యేనాఁడును వెలు వడదు. కోపములేదు. సర్వదా శాంతమూర్తోనుందురు. ముఖము హాసమయము. పరుల దూషణమునకుఁ దాను పశ్చాత్తాప మునుబొంది యందులకు తాను శిక్ష ననుభవించును. శత్రు వులు, మిత్రులు అంద రాయనకు సమానులే. గాంధిమహా త్ముని యనుచరులలో ముఖ్యుఁడు. ఏసుక్రీస్తు ధర్మప్రచార మును 12 శిష్యులతోఁ బ్రపంచమునఁజేసియుండినట్లు మహా త్ముని ధర్మమును బ్రకటించుటకు వీరు తగినవారు. మున్ముందీ యన గాంధీమహాత్మునికి శిష్యుఁడయి ఆయన ధర్మమును వృద్ధినొందించఁగలడనుటకు సందియములేదు. మీ రాయనను జూచిన స్పష్టపడును. నేనేమియుఁ బొగడుటలేదు. సత్యము పల్కితిని. ఆయన నా కన్నివిషయములఁ బరిశ్రమాలయము విషయములో సాయముచేయుట కంగీకరించిరి. ఆయన కొక జాబు వ్రాయండి. జాబు తొందరగావ్రాసినాను. నారాయణ రాజుగారి సాహాయ్యమునుగూర్చి తరువాత వ్రాసెదను.

ఇట్లు,
మా. అ. దేవి.

## 50 వ లేఖ

చాటపఱ్ఱు,
4-7-22.

నా ప్రియమైన నీడూ,

మీరు వ్రాసిన జాబు లందుచున్నవి. మీరు పరీక్ష. ప్యాసయితిరనియే తలంచుచున్నాను. మా కీశుభవార్త యెపుడు వచ్చునాయని నిరీక్షించుచున్నాను. మోహనదాసు ఖద్దరు పరిశ్రమాలయము స్థాపించుటకయి హైదరాబాదు ఖద్దరు కంపెనీవారి నడుగ వా రందులకు సమ్మతించలేదు. పద్మజ కంపెనీ కధ్యక్షురాలుగనున్నది. మరియు ధనవంతులకడఁ బ్రయత్నించియుంటిని. నిష్ఫలమయినది. ఒకరికడ భిక్షమెత్తుట యెంత కఠినమో మీరే యాలోచించుడు. అదియునుగాక పరులగృహముల కేగుటయన్న నెంత కష్టమో మీకు విశదమే గదా? ఇరువురికడ భిక్షమెత్తియుంటిని. ప్రథమమున స్థాపించి నిర్విఘ్నముగఁ గార్యమును నెరవేర్చిన సాయము చేయరా? నా కిపు డెవరికడ కేగుట కిష్టములేదు. ముందు పది వేలయినను సంపాదింపఁగలనని యాశయున్నది. ప్రస్తుతము స్థాపించుటెట్లు? నేను కాంగ్రెసునుండి వచ్చిన తరువాత మీకు వేయి రూప్యములు పంపఁదలఁచి ప్రయత్నించితిని. నాకడనున్న ధన మదియే. ఆసమయమున నాధన మిచ్చువా రీయఁజాలకపోయిరి. మీకు మోతేవారు, నాయకరు నిధివారు

పంపినపు డవి యుందినవి. నే నపుడే పంపఁదలఁచి యివ్వగా మీ నాయనగా రపుడు పంపవలదని నుడివియుండిరి. నాయకరు నిధినుండి పంపిన ధనము తిరిగి తెప్పించినా వేయి రూప్యములు కలిపి మోతేవారికడ మీరు ప్రస్తుతము చేసిన ఋణమునకు వసూలుపెట్టుదునని చెప్పిరి. అట్లు చేయవలదని నుడివి నా రూప్యములు తీసికొంటిని. హరిశ్చంద్రునికిఁ బంపిన రూప్యములు తెప్పించవలదని వార్త నంపియుంటిరి. ఈ ధనము మీకు నవంబరు లేక అక్టోబరులోఁ బంపుట కుద్దేశించియుంటిని. నాయకరు నిధినుండి 1700 రూప్యములు పంపెదరని తెలిసినది. మీరు అక్టోబరులో బయలుదేరి వచ్చుటచే నా వెయ్యి రూప్యము లవసరముండక పోయిన సులభమగు ధరలకు దొరికిన మోటారు కొనుమని రెండు మూఁడు జాబులలో వ్రాసియుంటిరి. కాని మోటారుబండి కొనుటకన్నను, ప్రతి పరదేశమున రెండు మూఁడు మాసము లుండి ధనము వ్యయపరచుటకన్న నద్దానిని మాతృదాస్యము బాపుటకయి వినియోగించిన బాగు. మీరు లేనిసమయమున శాంతిలేక బాధపడుచున్నపుడును, హితముకరపువారు లేనపుడును నేను తొందరపడి యసందర్భములగు కార్యములకుం గడంగకుండనన్ను ధర్మపథము ననుసరించునట్లు చేసిన మహానుభావునకును, ఉదారస్వభావునకును మీ కృతజ్ఞత వెల్లడించుచు నొక జాబు వ్రాయఁగూడదా ? అదియుఁ గష్టమా ? మీకుఁ

దెలియదని యూరకుండవలదు. తప్పక వ్రాయండి. నా యడ్రసున కొక జాబు రాజన్నకు వ్రాయండి. సందేహించవలదు.

ఇట్లు,
మీ ప్రియమైన,
అన్నా.

## 51 వ లేఖ

"స్వర్ణనికేతనము",
హైదరాబాదు,
25-7-22.

నా ప్రియమైన నీడూ,

నేను మరియు రెండవ తేదీని బయలుదేరి హైదరాబాదు వచ్చితిని. ఈ మాసాంతమునర కిచ్చటనేయుండెదను. 10వ తేదీని మహాత్మాజీ యరెస్టయిన దినమునఁ బరిశ్రమాలయము స్థాపింప నుద్దేశించియుండియునట్లు చేయఁజాలసందున నీ పురము వచ్చితిని. హృదయము నావశము గాకున్నది. అచ్చటఁ గాలము కడపుట యసంభవముగనుంపుటఁ జేసి యిచ్చటి కేతెంచితిని. మీరు నాకడ లేకపోవుటవలన నివ్విధముగు కష్టములు సంప్రాప్తించుచున్నవి. మీరు వచ్చినగాని నాకు మనశ్శాంతి లభింపదు. మీరాక కెదురుచూచుచున్నాను. ఈమాసమునఁ బరిశ్రమాలయము స్థాపింపఁజాల

కున్న రాఁబోవు మాసమున స్థాపింపఁజాలనా? మీ రచ్చట బ్రయత్నమును జేయుచున్నారా? ఇచ్చటనుండి మేము భిక్ష మెత్తితిమని మీ రచ్చట భిక్షమెత్తవలదు. మీ స్నేహితులు మాకు సహాయముఁజేయ నుద్దేశించి యివ్విధముగఁ జేసినట్లు చేయుఁడు. లేనిచో మనకే యవమానము! నా శక్తికొలఁది ప్రయత్నించుచున్నాను. ఏమి జరుగనున్నదో భగవంతుని కెరుక. మీ రిప్పటినుండియు స్వదేశమునకు వచ్చుటకుఁ బ్రయత్నింపుఁడు. మీకు పాసేజీ యివ్వరేమోయని భయముగ నున్నది. మీకుఁ బ్రయాణమునకు కావలసిన ద్రవ్యమును బంపుమని నాయకరు నిధికి వ్రాయుఁడు. ఆలస్యముచేసిన మీరు వచ్చుట కాలస్యమగును. మీరు అక్టోబరు మాసాంత మున బయలుదేరి నవంబరులో రండి. కాంగ్రెసునకుఁ బూర్వము మీరు వచ్చిన సహాయనిరాకరణ తత్వమును గ్రహించుట కవకాశముండును. హరిశ్చంద్రున కొరకు జాబు వ్రాయుఁడు. మీ నాయనగారి కొరకు జాబు వ్రాయుఁడు. మోతే నారాయణరావుగారికి వ్రాసినను బాగుండును. మాకు సెప్టెంబరు మాసమునకు ధనమందినఁగాని వచ్చుటకు వీలుం డదు. సముద్రప్రయాణము. మీరు సమ్ముఖమునకు వచ్చు పర్యంతము నాకు భయముగనున్నది. మీ రేవిధముగనయిన నవంబరు మాసమునకు రండు. మీ యుత్తరము చాటపట్టు వచ్చియుండవచ్చును. నా కింకను నందలేదు. సోదరుఁడు

శ్రీ నారాయణరాజుగారు బాగుగనేయున్నారు. మన జిల్లాలో నసంగా తణుకు, భీమవరం, నర్సాపురం, ఏలూరు, కొవ్వూరు, తాలూకాలయందు ఖద్దరు పరిశ్రమాలయములు వాటాల మూలముగ స్థాపించుచున్నారు. విశేషములు తెలియఁ జేయుఁడు. మీరు పరీక్షయం దుత్తీర్ణులయిరని నమ్ముచు న్నాను. సాధ్యమైనంత త్వరగా బయలుదేరి రండు. వందన ములు. క్షమింపఁ గోరెదను. విశేషములు తరువాతఁ దెలియఁజేసెదను.

ఇట్లు,
మీ ప్రియమైన
అన్నా.

## 52 వ లేఖ

చాటపర్రు
9-8-22.

ప్రియమైన నీడూ,

మీరు పంపిన చిత్రపటములు అందినవి. నేను హైదరా బాదు వెళ్లియుండుటచేఁ ద్వరగా నందలేదు. నే నింటికి వచ్చు సరి కన్నియునున్నవి. చూచి సంతసించితిని. మీరు డిశం బరులో వచ్చెదరని దినములు లెక్కపెట్టుకొనుచుండ జూను వఱ కుండెదనని వ్రాయుటవలన విచారముగనున్నది. నా యిచ్ఛానుసారము దేశసేవచేయుట కాటంకపఱచునందువలన

నెన్ని కష్టములకయిన నోర్చి మీ కోరిక నెఱవేర్చుటకుఁ బ్రయత్నించెదను. ఇట్లు చేయుటకు మీరెప్పుడున న్నాటంక పఱచరనియే. మీరు డిశంబరులో రానియెడల మా జననీ జనకులకుఁ గష్టముగానుండును. శ్రీ నాయనగారు బెజ వాడలోనున్నారు. ఆయనకొఱ కచ్చట నొక కాపురము. ఏలూరులోఁ బరిశ్రమాలయము స్థాపించుటచే ఏలూరులో నొక కాపురము. మీరు జూనులో వచ్చెదరని తెలిసిన నన్ను ఏలూరులో నుండనీయరేమో యని భయముగ నున్నది. పరిశ్రమాలయము 18 వ తేదీని స్థాపింపను న్నాము. హైదరాబాదులో 1500 రూపాయలు లభించినవి. మీకు నావేయిరూప్యములు పంపఁబ్రయత్నించినపుడు మీకు ధనము నాయకరునిధివారు, మీ నాయనగారు పంపియుండు టవలన ననవసరమని పంపియుండలేదు. తరువాత మోటారు కని పంప నుద్దేశించితిని. మోటారుకన్న భరతమాతకు విని యోగించుట ధర్మమని భరతమాత కర్పించితిని. ఇపుడు మీరు జూనువర కుండెదనని వ్రాయుచున్నారు. విద్య పూర్తియైన తరువాత మీ రింకనుండి యున్నతవిద్యకొఱకు ధనము వ్యయపరచుటకన్న దేశసేవకు వినియోగించినచో నెక్కువ శ్రేయస్కరమగును. మీరువచ్చి దేశసేవ చేయఁ జాలకున్న నా ధనమయినను మీపేర దేశసేవకు వినియోగిం చెదను. మీకు దేశసేవకంటె డిగ్రీల బిరుదములసేవయే యధి

కముగ నున్నందులకు నాకు సిగ్గగుచున్నది. మీ యిష్టమువచ్చినపుడేరండు. మీధనము మూలమున నన్నానందముతో దేశసేవ చేయనీయకున్నను జేయుదును. రవ్వలు నాకొఱకుఁ గాదు. చౌకగానున్నవా? విశేషములు తరువాత వ్రాసెదను. మీ రేమయిన పరిశ్రమాలయమున కీయ ప్రయత్నించుచున్నారా? లేక వచ్చినతరువాతఁ బ్రయత్నించెదరా?

ఇట్లు
మీ ప్రియమైన
మా. అ. దేవి.

## 53 వ లేఖ

చాటపఱ్ఱు,
6-8-22

నా ప్రియమైన నీదూ,

మీరు వ్రాసిన జాబు చేరినది. మీ రెపుడు కాలిఫోర్నియా వెళ్లెదరు. మీరు కోళ్లను పెంచుట మొదలగునవి మానుకోవలెను. మనము జీవహింస చేయఁగూడదని మాంసము మొదలయినవి మానినపుడు ఇతరుల నెందులకుఁ దినవలెనని ప్రోత్సాహము చేయవలెను? మ్యాజిక్ లాంటరన్ స్లైడ్సు తీయుట నేర్చుకొనిరండు. మీకేమి వ్రాయుటకు బుద్ధి పుట్టుట లేదా? మీరు పరిశ్రమాలయముకొఱకుఁ బ్రయత్నిం

చుచున్నారా! మీరు వచ్చి 10 వేలు సంపాదించి యిచ్చి నను సరే, లేనిచో నచ్చట ధనము సంపాదించి పంపుడు. 18వ తేదీని పరిశ్రమాలయము స్థాపించెదము.

ఇట్లు,
మీ ప్రియమైన,
అన్న.

54 వ లేఖ

"మోహనదాసు
ఖద్దరు పరిశ్రమాలయము"
ఏలూరు,
18-9-22.

నాప్రియమైన నీడూ,

మీరు వ్రాసిన జాబు లందుచున్నవి. నేను 3 వారములనుండి మీకు జాబు వ్రాయుట మానితిని. నా మానసీకస్థితియే దీనికిఁ గారణము. ఎన్ని కష్టములు సంప్రాప్తించుచున్నను, సంభవించినను మీవాంఛ ఫలింపంజేయుటకు మరియొక సంవత్సరమైనను విడనాడియుండుటకు సమ్మతించితిని. కుటుంబపరిస్థితులు చూడఁజూడ నానాటికి విషమస్థితికి వచ్చుచున్నవి. మీరిక నాలస్యముచేసిన లాభములేదు. మీ వ్యవహారము విభాగించువారు లేరు. విభజించినను భారము వహించువారు లేరు. మీ కుటుంబగౌరవము నిలుపవలెనన్న

మీరు వెంటనే బయలుదేరి వచ్చుట యుత్తమము. గౌరవము పోయిన తరువాత మరల గౌరవము సంపాదించుట కష్టము? ధన మెంత సంపాదించిన నేమి లాభము? మీ యన్నగారు మీరు నాలుగువేల రూపాయలు మోతేవారివద్ద ఋణము తీసికొన్నందులకుఁ బొలము తన పేర వ్రాయించుకొని డబ్బు యిచ్చుటలేదు. ఒక సెంటుపొలమైనను పంచుకొననియెడల నమ్మనీయనని నిర్బంధించుచున్నారు. మీ రచ్చట విద్య నభ్యసించి ధనము సంపాదించుటకన్న మీ తండ్రిబాధ మీ సతీ తిలకము పడుచున్న బాధలు నివారించుట మీ ముఖ్య కర్తవ్యము. ఒక ఋణదాత కంప్లైంటుచేసిన నందఱు కోర్టునకు మిమ్ము ఈడ్చెదరు. మీరు దూరమునుండుటవలన నా బాధలన్నియు నేనే భరించవలసివచ్చును. నే నందుల కళకత్తు రాలను. మీరు వచ్చి మీ భాగమునకు వచ్చు ఋణము మనకొక్క దమ్మిడీ లేకపోయిన నమ్మి తీర్చివేయుడు. అయ్యది మీ కర్తవ్యము. మనకున్నదంతయు నిచ్చి యప్పు తీర్చిన గౌరవము. కాని యీవిధముగ హాస్యాస్పదులమగుట భావ్యము కాదు. మీరచ్చటఁ బొందు లాభముకన్న నిచ్చటి నష్టము మెండు. భగవంతుని యనుగ్రహమున్న మీరు మరల నమెరికా పోవచ్చును. మనకు ధనమున్న నేను మిమ్ముఁ బంపెదను. మీ యిష్టానుసారము మరల విడనాడియుండు

టకు వెనుదీయును. ఈ సమయమందు మీరు వచ్చి మీ కుటుంబగౌరవము పోయిన మీరు కంపెనీ పెట్టుటకు వీలుండదు. ధన సాహాయ్యము చేయుటకు భయపడెదరు ? అనేక విషయములలో మీకు నష్టము వాటిల్లును. ఇప్పుడు మీరు మీ గౌరవము నిలిపినచో రెండు మూఁడు సంవత్సరములలోఁ బోయి బి. యస్. సి. మీరు సంపాదింపవచ్చును. బి. యస్. సి. సంపాదించిన తరువాతఁ గలుగు లాభముకన్న నిచ్చట నష్ట మెక్కువగనున్నది. ఇపు డీవిధముగ సంభవింపనిచో నిన్నిదినము లుండఁగలిగినపుడు మఱి ఆఱుమాసము లుండఁ జాలనా ? ఈవిధముగ వ్రాయవలసివచ్చినందులకుఁ జాల విచారముగానున్నది. నే నన్నివిధముల నాలోచించియే యిట్లు వ్రాయుచున్నాను. నారాయణరాజన్న యభిప్రాయము మీరు వెంటనే వచ్చి వ్యవహారము చక్కబెట్టుటయే, అచ్చటఁ బొందు లాభముకన్న నష్టము మెండని నుడివిరి. మనకు ధనము పోవుటచే గౌరవభంగము కలుగుచున్నది. మీకున్న వంతులో మీరు ధనము సంపాదింపవచ్చును. దేశసేవచేయ వచ్చును. మీకుఁ దృప్తిలేనియెడల మరలఁబోయి బి. యస్. సి. ప్యాసయిరావచ్చును. ఈ సమయముదాటిన మరల నిట్టి సమయము మీకు లభింపదు. అన్యాయముగాఁ గుటుంబమున కగౌరవము సంభవించును. ధనములేనిచో నగౌరవమని నా భావముకాదు. మనకు లేకున్నను, ఇతరులకడఁ దెచ్చిన యప్పు

తీర్చవలెను. కూలిపనిచేసియేని తీర్చుకొనవలెను. మనకర్త వ్యము మనము చేయవలెను. ఎన్నిదినము లూరకుందురు? మిమ్ము రమ్మనుటకు నాకుఁగష్టముగనున్నది. మీవాంఛ ఫలించుటకుఁబూర్వమే మిమ్ము రమ్మనుట న్యాయముకాదు. నేను నిరుత్సాహము చేయవలసివచ్చెఁగదా యని మీకుండు విచారముకంటె నాకెక్కువగనున్నది. మీరు రానిచో నాకుఁ గీడు మూడును. వెంటనే రాఁగోరెదను. నా యభిప్రాయము మీరు వెంటనే రావలెననియే. మీకు నిన్న టెలిగ్రాము నిచ్చి యుంటిని. మీరు కాలేజీలో విద్య నభ్యసించుట మానుకొని యచ్చటచ్చట ననుభవము సంపాదించుటకుఁ బ్రయత్నించెద రని యెంచి యిచ్చియుంటిని. ఉత్తరమయిన నాలస్యమగు నని యూహించితిని. మీ రనుభవము సంపాదించుటకే నవంబరులో రమ్మని తంతి పంపితిని. ఎంతత్వరలో వచ్చిన నంత మంచిది. మీదగ్గరనుండి టెలిగ్రాము వచ్చినంతనే డబ్బు పంపించెదము. నాయకరు నిధివారు పంపెదరని నా యభిప్రాయము. మీ రేవిధముగనయిన డిశంబరు మొదటి వారము నకు రండు.

ఇట్లు

మీప్రియమైన,

మా. అ. దేవి.

## 55వ లేఖ

"మోహనదాసు ఖద్దరు
పరిశ్రమాలయము,
ఏలూరు,
20-9-22.

ప్రియతమ నీడూ,

వ్రాయవలసిన విషయములన్నియు నిదివరకే వ్రాసి యుంటిని. ఇంక వ్రాయుటకు నాకేమియుఁ దోఁచుటలేదు. నే నిఁక జాబులు వ్రాయుట మానుకొనవలెననుకొనుచున్నాను. నే నిఁక బాధలుపడఁజాలను. నన్ను రక్షింపవలెనన్న, నేను మీకుఁ గావలెనన్న, త్వరలో విచ్చేసి కాపాడుఁడు. మరల మీరు పోయి ప్రపంచమంతయు తిరిగి రావచ్చును. నాకేమియుఁ దోఁచకున్నది. ఉన్మాదిని నయ్యెదనని యీవిధముగా వ్యవహరించుచున్నాను. బలములేదు. ఓపికలేదు; శక్తిలేదు.

ఇట్లు,
మీ ప్రియమైన
మా. అ. దేవి.

## 56వ లేఖ

భీమవరము,

(రాత్రి) 4-10-22.

ప్రియతమ సీతూ,

మీకు రెండు వారములనుండి జాబులు వ్రాయుట మానితిని. ఎందుల కావిధముగఁ జేయవలసివచ్చెనో, చేయు చుందునో మీకు గ్రాహ్యమగుట దుర్లభముగాదు. నా మానసికస్థితి యందులకుఁ గారణము. ప్రపంచములోఁ గలుగు సాధారణబాధలకు సహింపఁజాలక నాధర్మమునుండి మరలి పతిసేవకు లోపమగు నిరుత్సాహము నప్పుడప్పుడు చేయుచుం దును. అందులకు నేనెంతయు పశ్చాత్తాపతప్త హృదయ నయ్యెదను. మీ కుటుంబపరిస్థితులనుబట్టి నేను మిమ్ము స్వదేశగమనోన్ముఖులఁగండని నిర్బంధించినను పతి వాంఛాను సారము, అతని వాంఛను ఫలింపఁజేయుటకుఁ బ్రయత్నింపకుం డుటయే గాక నిరుత్సాహపఱచుచున్నందులకు నాకు శిక్ష భగవంతుఁ డేమి ప్రసాదింపనున్నాఁడో కదా! ప్రపంచము నందు మానవు లుద్భవించుటకుఁ గారణమేమి ?

.......................................

మీరు వ్రాసిన జాబులు చేరినవి. మీ దృఢసంకల్పమునకు మెచ్చితిని. ఎవరెన్ని విఘ్నములు కలుగఁజేసినను సర్వకాల

సర్వావస్థలయందుఁ జలింపకుందురని నమ్ముచున్నాను. నేను మిమ్మీవిధముగ నిరుత్సాహము చేయుటవలనఁ బొందిన పాపమునకు నా జీవితములో ముక్తికలుగునా? సర్వదా నా మాటయైన వినక మీకు మంచిదని తోఁచినదానిని నిర్విఘ్నముగాఁ జేయుడు. మీకు స్కాలరుషిప్పు లభించినందులకు సంతసము. నే నెవ్విధమయిన సహాయము చేయఁజాలనందులకు విచారము. మీరు మేనల్లకునుండి యం. యస్. సి. ప్యాసయి రండు. మీ రీలోపుగ వచ్చినయెడల నేను మిమ్ముఁ బాడుచేసినదాన నయ్యెదను. ఆవిచారము నా జీవితకాలమంతయు బాధపెట్టును. ఇంతకాల ముండఁగలిగినదానను ఆఱు మాసములు వేచియుండఁజాలనా? మీ కుటుంబపరిస్థితులను బట్టి యందఱు నన్ను వ్రాయుమని నిర్బంధించుటవలన నా విధముగ వ్రాయవలసివచ్చినది. డిశంబరులో వ్రాసి మేవరకుండి రండు. మీరు వ్రాయు జాబువలన జూను మాసము వఱకుండినఁ గాని లాభములేదని తోఁచుచున్నది. అనుభవము లేనియెడల మీరు వచ్చి యేమియుఁజేయఁజాలరు. మీరు వచ్చిన తరువాత దేశమున కెంతయో లాభకారులుగనుందురని నిరీక్షించుచున్నాను. ఆహా! వివాహమాడినందువలన నెన్ని కష్టములపాలయినారు? మనకు భగవంతుఁడే సహాయముగానున్నాఁడు. మీరు విచారపడవలదు. కుటుంబవిషయము లాలోచింపవలదు. నేను వ్రాసినదానికి మీరు బయలు

దేరి రావలదు? నా మానసికస్థితి బాగుగానున్నది. నాకు విచారము పూర్వమువలె నుండుటలేదు. మీరు జూను మాసమునకు తప్పక వచ్చిన నేనేమియు నాటంకపఱచను. మీరు నిరుత్సాహపడక నాయందు దయయుంచి మీ తండ్రిగారు తొందరపడినను రావలదు. నేను భయపడినది ఋణదాతల మూలమున కుటుంబగౌరవము నశించునేమో యనుకొంటిని. అందువలనఁ దొందరపడితిని. మీరు స్కాలరుషిప్పు లభించిన పిదప వారిని మోసముచేయుట యుచితముకాదు. మీరు స్వదేశమునకు వచ్చిన తరువాత మరలఁ బోవుటకు వీలుండదని ప్రస్తుత మాలోచించుచున్నాను. మే మందరము మీరు రారని మీ జాబువలనఁ దెలిసికొంటిమి. మీరు వచ్చిన యెడల మాకందరికిఁ గష్టముగానుండును. మీరు దయచేసి రావలదు. సోదరుడు నారాయణరాజుగారిని 124 ఏ సెక్షను క్రింద 4 వ తేదీ డిశంబరునాఁడు అరెస్టుచేసినారు. నేను శరీరారోగ్యమునకయి తొట్టిస్నానము చేయుటకుఁ బడమటలంక పోయియుంటిని. జ్ఞానాంబగారు జ్ఞాపకమున్నదా? అచ్చట నామెకడనుంటిని. స్నానము పట్టుపడినది. అచ్చటకు నారాయణరాజుగారి యరెస్టు తెలియఁజేయుటకు నాకడ కొకరిని బంపిరి. నే నిచ్చటికి వచ్చుసరికి నారాయణరాజు అన్న నా నిమిత్తము స్టేషనునకు వచ్చియుండిరి. నా కాశ్చర్యముగనుండెను. జైలునకుఁ బోవుటకుఁ బూర్వము నన్నుఁ జూడవలె

వని నేనున్న స్థలమునకు రానుద్దేశించిరఁట. నే నిచ్చటికి వచ్చిన దినము పరిశ్రమాలయము విషయములు, జిల్లాసంఘ విషయములు, లెక్కలు మొదలయినవి యాలోచించుటలో దినము గడచినది. సంతోషముగా ముచ్చటించుట కేని వీలు లేకుండెను. మరునాడున్నది కదా యని యాశతోనుంటిమి. అయితే యేనిమిషమున కరెస్టువార్త వచ్చునో యని యను కొనుచుంటిమి. నీడూ! నేను దగ్గరనుండి మరునాఁడు సోద రుని..................పెట్టితిని. ఈవిధముగ నే నేసోద రుని నా హస్తములతో సంతోషపూర్వకముగా దేశహితా ర్థము సమర్పించు భాగ్యము కలుగునని నే నెన్నడు భావించ లేదు. మనమిరువురము గలసికొన్నపు డాదినము నాఁటి చర్య తెలిపెదను.

సోదరుఁడు రాజమండ్రిలో మహాత్ముని జన్మదినమం దిచ్చిన యుపన్యాసమునకయి పట్టుకొనఁబడిరి. అందువలన విచారణకుఁ గాకినాడ తీసికొనిపోయిరి. నేను, అమ్మ పెద్దమ్మ కాకినాడ సోదరుని పంపుటకుఁ బోయితిమి. నే నచ్చట ఆఱు దినములుండి వచ్చితిని. మనకు హరిశ్చంద్రుఁడు సహాయము చేయుటయే గాక మన స్నేహితునకు సహాయము చేయుచు న్నాఁడు. నా కన్నివిధముల సహాయము చేయుచున్నాఁడు. ఏమి కావలయునన్న నది నాకు సహాయము చేయుచుండునని

చెప్పినారు. నేను పడుచున్న యార్థికబాధ తగ్గినది. మీకు హరిశ్చంద్రునియం దెంత భక్తి ప్రేమలున్నవో నాకు నారాయణరాజునం దంతగానున్నవి. మీకు మీ స్నేహితుడగు హరిశ్చంద్రుఁ డెంత సహాయము చేయుచున్నాడో, అదేవిధముగాఁ బ్రతి స్నేహితుని ధర్మము స్నేహితుని కష్టసమయమం దాదరించుటకాదా? ప్రపంచమునకు నేను భయపడుదానను గాను. నేను కేవలము మహాత్మునియొక్కయు, మీయొక్కయు నిచ్ఛానుసారము నడచుటకుఁ బ్రయత్నించుచున్నాను. మిమ్ముఁ దృప్తిపఱచుటయే నా వాంఛ. సోదరీసోదరులను సమానముగాఁ బ్రేమించుట నేర్చుకొంటిని. మీరున్నపుడు మీ రెంత స్వేచ్ఛగానుండుమన్నను నే నుండఁజాలనైతిని. పద్మజ స్నేహమువలన నా లజ్జాభయములు తగ్గినవి. మీరు అమెరికానుండి వచ్చుసరికి నేను మీ కనుకూలముగా నచ్చుట స్త్రీల కున్నంత ధైర్యముతో సంచరించుట మీరు కనుఁగొనఁగలరు. సత్యధర్మములకు విరుద్ధముగా నేనాటికీ కార్యమును జేయనని నమ్ముఁడు. అంతవఱకు మీరు నాకు స్వేచ్ఛనిండు. మీ రితరుల మాటలు నా విషయములో నమ్మకుందురని నా నమ్మకము. నిజముగా మీరన్నట్లు నిజమైన స్నేహితులే మన యాపత్కాలమందుఁ దోడ్పడఁగలరు. సోదరుఁడు కాకినాడ పోయినపుడు విచారణ 19వ తేదీవఱకుండుటవలన నా దినమునాఁటి కందఱు వచ్చి,

నుద్దేశముతో నీలోపుగ నెవరును రాలేదు. ఇద్దరు ముగ్గురు వచ్చి మరలఁ బోవుచున్నారు. ఆ దినమున ననేకమంది వచ్చు నట్లు తెలియుచున్నది. ప్రతిష్ఠలమునం దాయన చేసిన త్యాగ మునకు, సేవకుఁ గొనియాడుచు నభినందించుచున్నారు. నేను ప్రథమమున నాయనతోఁ బో నుద్దేశింపలేదు. దైవికముగా నేను వచ్చితిని. పోయితిని. నేను పోకున్నఁ బాపము కష్టముల పాలయ్యెడివారే. నేను పోవుటవలన సోదరుఁడు హరిశ్చం ద్రుఁడుగారు చాల సహాయముచేయుచున్నారు. జగన్నాథ రావుగారు (క్రోలి. సుబ్బారావు అల్లుఁడు) చాల సహాయము చేసినారు. అనేక సదుపాయములు హరిశ్చంద్రునివలనఁ గలిగి నవి. భోజనము, వారింటికడనుండియే రెండు పూటలు పం పుచున్నారు. ఇదియంతయు భగవంతుని సాహాయ్యము. మన దేమియులేదు. మీరు వ్రాసిన జాబుఁ జూచి రాజన్నకుఁ గలిగిన సంతస మింతంతయని వర్ణించుటకలవిగాదు. మీరు స్వదేశమునకు విచ్చేసిన వెంటనే యితనినిఁ జూచుటకు జైలు నకు మనము పోవలెనఁట. నన్ను కాకినాడలోనుండుమని కోరిరి. నేనున్న నాల్గు దినములు సంతోషముగా జరిగినవఁట. రెండు పూటలు భోజనము వేళకు నేను వెళ్లి మాట్లాడుచుం డెడిదానను. భోజనము మొట్టమొదట నే నాయనకుఁ బెట్ట వలసివచ్చినది. తరువాత నెవరైన నొకరుండి పెట్టుట కవ కాశమిచ్చిరి. ప్రతిదినము చూచుట కవకాశమీయనందు

వలన నేనే భోజనము పెట్టుచుండెడిదానను. అందుచే నాయ నకుఁ గొంత సంతోషముగనుండెడిది.

కష్టములోనున్న సోదరు నేవిధముగనైన సంతోష పెట్టుటయే నిజమైన స్నేహితుల విధి. నీడూజీ! మీరున్న నేను మీ పాదపద్మములఁబట్టి సోదరుని విచారణ యగునంత వరకు మనమిరువుర మచ్చటనుండుటకుఁ బ్రార్థించి యిచ్చుటనే యుండెడిదానను. అట్టి యవకాశము నాకు లేకపోయినది. ఆ భాగ్యము నాకెపుడు లభించును? మీరు త్వరలో వచ్చె దరనియు మీరు నాకడనున్నఁ బ్రపంచములో నా కేవిధ మగు బాధలుండవనియు భావించుచుంటిని. ఆయాశతో నీ ప్రాణములఁ గాపాడుకొనుచుంటిని. మీ రస్యమనస్కులయి యుండిన నే నెన్నడో యీ ప్రపంచమును విడిచియుందును. ప్రపంచముననుండుటకు నాకంతయు సహ్యాముగనున్నది. మీ రచ్చట సోదరీమణులతో నెంత కలసి మెలసి తిరుగుట లేదు? ఎందరు మీకు భోజనమందు వడ్డించుటలేదు? అందు లకు నేను సందేహింపవలసినదేనా? ఎందరెందరు నారీమణు లతో స్వేచ్ఛగా సోదరభావముతో నుండుటలేదు? ఈపాడు హిందూదేశమున నాభావ మెందులకుండదు? సందేహ మెందు లకు? ఇది యాంధ్రదేశమున మెందు. బొంబాయి మొదలగు ప్రదేశములం దీవిధముగనుండదు. మీరు నాకడ లేకపోవుట వలన నాకుఁ గష్టములు మెందు.

ఆఱు మాసములు ఎపుడు గడచునాయని నిరీక్షించు చున్నాను. నేనీ యుద్యమములోఁ బ్రవేశించి పని చేయు చున్నందులకు మీ బంధువుల మూలమునఁ గలుగు బాధలు చెప్ప నలవికాదు. మీ తండ్రిగారు, ఉద్యోగస్థులును, బానిస వృత్తియందున్నవారుననగు వారికడకేగి "మా అబ్బాయికి కోడలు పనిచేయుట యిష్టములేదు. వచ్చిన తరువాత మా కోడలిని అబ్బాయిదగ్గర నుంచుకొనఁడు. ఉద్యోగము చేయిస్తాఁడు. మాకు నామెకు సంబంధములేదు" అని యనేక దుర్భాషలు పలువురికడ నాడుచుందును. మీరాక సమీపించుకొలఁది నన్నీ యుద్యమమునుండి మరలుమనియు మీ యుద్యోగమునకు భంగము వచ్చుననియు మీ యన్నగారికి మీ నాయనగారికిఁ గష్టముగానుండి యింటిలోనుండి కదల వద్దనుచున్నారు. నే నింటిలోనున్నను, నే నీప్రపంచమును వదలినను గవర్నమెంటువారికి నేను భయపడి యుద్యమ విముఖురాలనయితినని యేనాటి కనుకొనరు. వారికి నాపై సందేహ మెల్లకాలముండును. నేనట్టి స్వభావము గలదాననుగానని వారికిఁ దెలియును. భర్త సంపాదనార్థము, ఈశ్వరేచ్ఛకు వ్యతిరేకముగా వర్తించి జీవించుటకన్న మృత్యువు మేలు. ప్రాణేశ్వరా! నేను మీ యుద్యోగమునకుఁ గాని, మరియే యితర సౌఖ్యములకుఁ గాని యాటంకముగానున్నయెడల తెలియఁజేయుఁడు. మీ సంతోషార్థ మీ లోకమును విడిచె

దను. ఇది నిజము. కేవలము వ్రాయుటకాదు. చేసితీరెద. శరీరారోగ్యార్థము నే నిదివరకువలె నెచ్చటకు విశేషముగాఁ బోవుటలేదు. ఈమధ్యఁ బరిశ్రమాలయ ధనసంపాదనార్థము భీమవరము పోయియుంటిని. శరీరారోగ్యము నిమిత్తము పడమట లంక పోయియుంటిని. ఉపన్యాసములిచ్చి సంవత్సరమైనది. ఈవిధముగ నేనుండగా మీ నాయనగారు, సీతయ్యగారు నావలనఁ బెద్దమనుష్యులలోఁ దలలెత్తుకొనఁజాలకున్నారఁట. ఉద్యోగస్థులకు, స్వార్థపరులకు నా దేశభక్తి రుచించునా? వీరినిమిత్తము నే నెచ్చటకుఁ బోఁగూడదఁట. సీతయ్యగారు నడచునట్లు అందరు నడువవలయునా? ఉద్యోగస్థుల దయకుఁ బాత్రుఁడై, అన్యాయపరుఁడై తిరుగుచు సుసమయమున దేశసేవను చేయఁజాలకున్న సీతయ్యగారికి నా దేశసేవ యెట్లు రుచించును? నా బంధువు లీవిధమగనున్నారని నాకెంత దుఃఖమగనున్నదో చెప్పవలెనా? నామూలమున వీరికిఁ దలవంపులేమి? నేను మీ యిచ్ఛానుసారము నడచుట యేమి? అటువంటి దుర్దశ నాకు సంభవించిన నాత్మహత్య చేసికొనుట నిశ్చయము. మీ దయయున్న మీ రితరుల మాట నమ్మక నాయందు విశ్వాసమున్న నన్ను రక్షించిన రక్షింపుఁడు. వీరిరువురు గలసి మోతేరాజుగారి దగ్గర మొరపెట్టుకొన్నారఁట. నా మూలమున అడుసుమిల్లి, కోవెల

మూడి గోపాలకృష్ణయ్యగార్లకుఁ గష్టముగనున్నదఁట. వారి కవమానముగనున్నదఁట.

భగవంతుని సృష్టిలో నే నొక క్షుద్రజీవిని. నామూలమున వారి కంతకష్ట మెందుకుండవలయును? నాకును వారికి నేమి సంబంధమున్నది? మోతే రాజుగారితోఁ బోయి చెప్పుటకు వీరికేల సిగ్గులేకపోయెనా? మోతే రాజుగారిని నాతోఁ జెప్పి మాన్పింపుఁడన్నారఁట, ఈ యవమానము నేనెట్లు సహింతును? మోతేరాజు చెప్పి మాన్పించుటకాతఁ డెవఁడు? ధనము ఋణమిచ్చినాఁడని యతని మాటలు వినవలయునా? మీరు తంతి పంపినారనియు నీమాటలు నాకుఁ జెప్పి మాన్పింపఁగోరినారనియు నాన్నగారిని రమ్మని కబురు పంపినాఁడఁట. ఈ మాటలన్నియుఁ జెప్పి యింక బయటికిఁ బోకుండఁ జేయుమన్నాఁడఁట. నా తండ్రి మాట్లాడక యూరకున్నారఁట. నా పతియొక్కరు నాకడలేకపోవుటవలన నే నన్నివిధముల నవమానములపాలయితిని గదా! మీ యభిప్రాయమేమి? మీ తండ్రి యీవిధముగా నన్నేల బాధపెట్టుట? సీతయ్యగారి కెందుల కవమానమో తెలియకున్నది? మీ నాయన యీ విషయములుగూర్చి చాడీలువ్రాసి నాయందు మీకున్న ప్రేమ తగ్గింపఁ బ్రయత్నముచేయుననియే యీ సత్యవార్త దెలియఁ జేసితిని. దూరముగానున్న మీకు నా విషయములవలన

బాధ కలుగఁజేసి విద్యకు భంగము కలుగఁజేయుట కిష్టము లేదు. నేను ప్రజలకు భయపడను. ఎవరేమనుకొన్నను నాకు నష్టములేదు. మీరు మాత్రము దయగానున్నఁజాలును. కుటుంబవ్యవహారములనుగూర్చి యనవసరముగా మీనాయన చేసినదే. ఎవరేమి తొందరచేయుటలేదు. మీరు వచ్చువరకే కష్టములు సంప్రాప్తించవు. హరిశ్చంద్రుఁడు వ్యవహారమును గూర్చి వ్రాయును. మీ రేమియు నాతురతతోనుండవలదు. మీరు వచ్చిన తరువాత మరల పోవుట సంభవముగాదు. మీరు కష్టపడి ఆరుమాసము లుండుఁడు. నన్ను దేశసేవ చేయనీయకున్న నాదినములు గడచుటెట్లు? తండ్రీ! రక్షింపుము! నా ప్రాణము పోయినదని మీకుఁ దెలిసినను మీరు బయలుదేరి రావలదు. అనఁగా నెన్ని యాటంకములు వచ్చినను మీవిద్య పూర్తికానిదే రావలదు. ఇతర విషయములు తరువాత వ్రాసెదను.

అయ్యా? మీ కొక మనవి. రాజుగారికి మరేమి కఠినముగా వ్రాయక మీ యిష్టానుసారము దేశసేవ సేయుచున్నాననియు స్త్రీలు స్వతంత్రము మీ రేమియు నాటంకముగానుండరనియు, అన్నివిధములవారికి సాహాయ్యము చేయుచుఁ బురుషులతోపాటు సేవచేయుట మీ కిష్టమనియు, మీ కుద్యోగమునం దాశలేదనియు, నామె సత్యమునకు,

ధర్మమునకు వ్యతిరేకమైన పనులు చేయుటలేదనియు, నట్లు చేయదనియు, హిందూదేశములో నెందరెందరో స్త్రీలు దేశ సేవ చేయుచున్నారనియు, నేను వారందరివలెనే చేయుచుంటి ననియు, దేశసేవ చేయుచున్నఁ దప్పులేదనియు, అవసరమున్న పుడు ప్రచారమునకుఁ బోవుటలో నాక్షేపణలేదనియు వ్రాయుఁడు. మీకు జ్ఞాపకమున్నదా? మీరు స్కూళ్లు పెట్ట మనియు, గ్రామములకుఁ బోయి స్త్రీలకు సహాయముచేయు మని వ్రాసిన తరువాతనే బయలుదేరితిని. కనుక మీరు వ్రాయండి. మీరు వ్రాసినతరువాత నే నీవిధముగఁ జేయు చున్నానని బాగుగా వ్రాయుఁడు. మీ నాయన కుద్యోగమం దలి యాశచే, దెలియక యీవిధముగఁ జెప్పుచున్నాఁడని వ్రాయుఁడు.

నీడూ,

నే నెందరినో స్నేహితులను సంపాదించఁగలిగితిని. వారందరు భక్తిమార్గావలంబులు; స్వార్థరహితులు; దేశ సేవాతత్పరులు; సచ్చరిత్రులయిన స్నేహితుల సంపాదించి తిని. మీరు వచ్చిన తరువాత మీకే తెలియును. సద్గుణ సంపన్నుల సహవాసమువలన నా స్వభావము బాగుపడు సూచనలు కన్పట్టుచున్నవి. నేను సచ్చరిత్రనయితే మీకు సంతోషము గదా! నా ముఖ్యస్నేహితులలో నొకరగు

ముష్టి లక్ష్మీనారాయణగా రిదివరకు ప్లీడరుగానుండి యుద్య మములోఁ బ్రవేశించి ప్రస్తుతము తాలూకా కాంగ్రెసు కమిటీ సెక్రటరీగానున్నారు. భీమవరం నే నెపుడు వచ్చినను వారి యింటనుందును. వారికి తోటలన్న నెక్కుడు మక్కువ. మీ దగ్గర నెన్నివిషయములో తెలిసికొనవలయుననియున్నారు. ప్రస్తుతము మన దేశములో ఫలించు కూరగాయలు ఫలవృక్ష ముల విత్తనములు పంపుమని వారు వ్రాయుమనిరి. అవి ఏ విధముగా నాటవలసినది, ఏమేమి యెరువు వేయవలసినది మొదలగు విషయములు వ్రాయఁగోరెదను. నా కెన్నియో విధముల సహాయము చేయుచున్నవారి కింతమాత్రము సహా యము చేయుటకు వెనుదీయరని నమ్ముచున్నాను. ఇదియును గాక వారికి సెకండుహాండు మంచి కేమరా కావలయునఁట. నూరు రూపాయిలులోపు 80 రూపాయలవరకు ప్రయత్నింప వలెనఁట. ధన మాయనయే పంపెదరు. పంపించుచో నెక్కువ ధనమయిన మీరు వచ్చేటప్పుడు తీసికొని రండు. ఇప్పటి నుండి ప్రయత్నించినఁగాని మంచిది లభింపదు. ఈసహాయము తప్పక చేసెదరని నా నమ్మకము. వారి చిరునామా యిది.

ముష్టి లక్ష్మీనారాయణగారు,
భీమవరము,
కృష్ణా జిల్లా.

విత్తనము లేవిధముగ నాటునది వెంటనే వ్రాయఁ గోరెదను. ఆలస్యము చేయవలదు. ఇంతమాత్రము సహాయము చేయలేనియెడల నంతదూర మేగినందులకు భరత మాత కేమి ప్రయోజనము. పూలవిత్తనములు క్రొత్త రకములు బాక్బైంకు క్రొత్తగాఁ గనిపెట్టిన గింజలులేని ఫలములు మొదలగు విత్తనములు మీరు మన దేశములోఁ దయ్యారు కాఁగలవి, మంచివి, క్రొత్తవి తప్పక పంపుమని వ్రాయుమన్నారు. గింజలు కొలఁది కొలఁదిగా (మచ్చు) పంపవలెను.

ఇట్లు,
మీయొక్క
మా. అ. దేవి.

57 వ లేఖ

మోహనదాసు ఖద్దరు
పరిశ్రమాలయము ఏలూరు.
25-10-22.

ప్రియసీదూ,

మీరు దయపూర్వకముగా వ్రాసిన పత్ర మందినది. మీరిదివరకు వ్రాసినజాబునకుఁ బ్రత్యుత్తర మిచ్చియుంటిని. అందువలన మరల వ్రాయుటవలన నుత్సాహభంగము, కష్టము ఆగ్రహము, బాధ మొదలగునవన్నియుఁ గలుగుట కవకాశ

మిచ్చినందులకు మిక్కిలి దుఃఖముగనున్నది. అందులకు మన్నింపఁగలరా? మీసేవ మీయాజ్ఞను సంతోషచిత్తమున నాకర్ణించి యాచరించుట, మీకష్టసుఖముల నేనుగూడ ననుభవించుట నిజమయిన పతివ్రతలక్షణము. సేవకురాలు, ఆజ్ఞానువర్తిని పతివ్రతయగు భార్య లభించినందువలన మీరు పడుచున్న యిడుముల కంతములేదు. ప్రథమమున మీ రెంతయో యాలోచించియుండవలసినది మీ జీవితకాల మెవరితోఁ గడుప నుద్దేశించితిరో, మీ జీవితకాలమును కష్టసుఖముల సమముగా ననుభవించుట కెవరర్హులో, నీ యుద్దేశానుసారముగ నెవరు వర్తింపఁగలరో, అట్టి సద్గుణపుంజమును, నారీమణిని వెదకి భార్యగ గ్రహించుట పురుషులకు కర్తవ్యము. మీ తుచ్ఛ ప్రపంచము సౌఖ్యములకయి లభించినఁ జాలునని భావించి వివాహమాడినపుడు సహింపవలసియుండును. అట్టి వివాహములందుఁ ప్రేమ, ఉన్నత సంకల్పములు ఫలించునను నాశలో నుండుట హాస్యాస్పదము.

"మీవిద్యకు వివాహము భంగకారణమయ్యెనని ప్రజలను కొనునట్టి యవకాశమును గలిగింపవలదు."

ప్రపంచములోనున్న మానవులు బాపినీడుగారి విద్యా నాశనమునకు మూలకారకురాలు అన్నపూర్ణయని చెప్పుకొని మెదరా? లోకమునిందించుటకుఁబూర్వము ఇట్టి యవకాశము

మీకు లభించినదిగదా! ఆవిధముగఁదోచిన మీరు స్పష్టముగా వ్రాయఁగూడదా? లోకము నిందించునన్న నేనుభయపడి మీకుఁ బ్రోత్సాహము చేయుదుననుకొంటిరా? లోకమున కెన్నటికి భయపడుదాననుగాను. మున్మాటికినిగాను. “నే నీభువిపై నెవనికి భయపడుదాననుగాను. కేవల మొక్క పరమేశ్వరుని గాంచియే భయపడుదానను.” ఇవి నాగురువాక్యములు. లోకము నిందించు నని భయపెట్టుటకన్న మీరు భయపెట్టుట బాగుండెడిది. వివాహమాడిన నీవిధమగు నాటంకములు సంభవింపవచ్చునని తెలియదుకాఁబోలును. వివాహకాలమునాఁడు మీరు యుక్తవయస్కులుగ నుండక పోవుటచే నీవిధముగాఁగాదనెనా? మీరు ప్రవాసమునకు శీఘ్రముగాఁబోవలసి వచ్చినపుడు పోవుటకుఁబూర్వము వివాహమయిన నుత్తమముగ నుండదని మేమందర మంగీకరించితిమా? మీ రాతురతతోఁగావలెనని యీకష్టము కోరి తెచ్చుకొంటిరి. వివాహమాడుటవలన మీకుఁ గలుగుచున్న నష్టముగాక నాకు వేయిరెట్లు నష్టము కలిగినది. మీ ప్రపంచ తుచ్ఛసౌఖ్యమునకై బ్రహ్మచారిణి నగు నన్ను, యీగతికి మార్చితిరి. ఈ బ్రహ్మచర్య వ్రతము మీవలన భంగమయినది. అట్లు లేనిచో జీవితమంతయుఁ బవిత్రబ్రహ్మచారిణి నయి యుండెడిదాననుగదా! స్వేచ్ఛావిహారిణి వివాహముచే బంధింపఁబడినది. బంధనవిముక్తి యెపుడు? పెండ్లివలన

సంతోషము లేకపోవుటయేగాక స్వాతంత్ర్యనాశనమును, మరి యొక మానవుని సుఖదుఃఖములు భాగించుకొనుటయుఁ గలిగి నవి. మీకుఁ బెండ్లిమూలమున విద్యాభివృద్ధికి భంగము కలి గినపుడు వివాహవిషయము మరచిపొండు. మీరు దూరదేశ మునం దున్నపుడు వివాహవిషయ మెందులకు జ్ఞాపకముండ వలెను? అప్పుడప్పు డీ చంచలహృదయ వ్రాయుజాబులు వ్రాయకుండిన మరచిపోయియుందురు. వివాహమయినదని ఇరువురము మరచిపోవుదము. అవసరము వచ్చినపుడు జ్ఞాప కముచేసికొనుటకుఁ బ్రయత్నింపవచ్చును. అట్టి యవసరము రాకుండనుండవలెనని నాకోరిక. ప్రస్తుతము మీయభివృద్ధి కాటంకముగానున్నది భార్య. భార్య మిమ్ముఁబ్రోత్సాహ పరచక నిరుత్సాహపరచవలసివచ్చెనుగదా! నేను చపలచిత్త నయినను మీరు దృఢసంకల్ప చిత్తులయి కర్తవ్యమూహించి అదేప్రకారము వర్తించుచున్నందులకు సంతసము. నాచపల చిత్తము, వజ్రహృదయము మీకింకఁ దెలియకుండునుగాక! ఇఁక నావద్దనుండి జాబుకై నిరీక్షింపకుఁడు వ్రాయనువలదు. నాకు వీలయినపుడు దేశసేవచేయుటకుఁ బ్రయత్నించుచు న్నాను. ఎపుడయిన మీసేవలభించిన, చేయఁగలిగినఁ జేసెదను. దీర్ఘలేఖవ్రాసి శ్రమయిచ్చినందులకు క్షమింపుఁడు. మీవిగ్ర హమును నామనస్సునం దుంచుకొని యారాధించుటయే నా కర్తవ్యము. మీరూహించునట్లు నేను గాలికి దిరుగు గిలక

వలెఁ జంచలచిత్తనుగాను. స్థిరబుద్ధిని సంపాదించుటకుఁ బ్రయత్నించుచున్నాను. నాహృదయము పాదపీసమువలెఁ బరుగెత్తుచుండును. మీరచ్చటనున్నను మీ దివ్యసుందర విగ్రహము వంటి పతిని బ్రసాదించినందులకు దైవమునకు బ్రణమిల్లుచున్నాను.

ఇట్లు,
మీ యొక్క—
మా. అ. దేవి.

58 వ లేఖ

ఏలూరు,
13-12-22.

ప్రియుఁడా,

మీ జాబు లందుచున్నవి. నాప్రతిజ్ఞానుసారము విశేషకాల ముండకపోవుట మీలేఖనుఁజూచియే. మీలేఖ చదివి నప్పటినుండియు నా పత్రముమూలమున మీ కమితబాధ కలిగియుండవచ్చుననియుఁ నన్నుగూర్చి విద్య పూర్తిగాక పూర్వము స్వదేశమునకువత్తురని విచారించి తంతివార్త కాకినాడనుండి పంపితిని. అందువలన నా ప్రతిజ్ఞానుభంగమయినది. పరులు నా ద్వారా అష్టకష్టముల పాలగుట నేనెంతమాత్రము సహింపను. నా జీవితాధారమునకు, జీవితోన్నతికి, జీవితానందమునకు-మూలకారకులగు మిమ్ములను గష్టపెట్టఁగలనా?

మీ నిమిత్తము నా సర్వస్వమును సమర్పించుటకు సిద్ధముగ నున్న నేను మీ బాధచూచి యెట్లు సహింపగలను ? అది యునుగాక మీరు మీ ప్రాణముకన్న మీ దేవి నెక్కువ ప్రేమించుచున్నారని గ్రహించితిని. ఈప్రపంచములో సమస్త మానవకోటిలో నా మనస్సునం దగ్రస్థానము వహించిన మీకు నేనేవిధమయిన సాహాయ్యము చేయఁజాలనందులకు విచారించుచున్నాను. సమస్తప్రపంచములో జన్మదాతయు, ముక్తిదాతయునగు భగవానుఁడు మనకందరికిఁ బ్రియుఁడు. మనమాతని మనప్రాణములకన్న నెక్కువగఁ బ్రేమింపవల యును. ఉత్తమ గుణాన్వితుఁడు. సరళహృదయుఁడుభక్తుఁడు. భూతదయాపరుఁడు, సుగుణవంతుఁడు, ప్రేమస్వరూపుఁడగు భర్త కనుకూలవతియగు భార్యనుగానని నేనెక్కువ విచారిం చుచుందును. మీయందన్నియు సుగుణములు నాయంద న్నియు దుర్గుణములు. ఈభార్యవలన మీకేమియానందము ? నా పూర్వజన్మ సుకృతఫలంబున మీకు భార్యనగుట కలిగి నది. మీరు క్షమాశీలురు. కనుక నాయందు మీరు సంపూ ర్ణకటాక్షమున్నది. ఈభావమే నాయందు సర్వకాల సర్వావస్థ లయందుండునట్లు ప్రసాదించుమని భగవంతుని ప్రార్థించుచుం దును. నాయందు భగవంతునికెంత దయయుండుటవలన సద్గు ణవంతుని భర్తగాఁజేకూర్చెనో యని యాలోచించుచుం

దును. నిజముగ నే నదృష్టవంతురాలను. అనుకూలదాంపత్య సౌఖ్యముకన్న వేరు సంతోషమేమియున్నది? మీ కాజాను వ్రాసియున్నప్పటినుండియు మీాయం దిదివరకున్న ప్రేమకంటె భక్తిగౌరవములు పెంపొందుచున్నవి. మీా సద్గుణవిశేషము లను నేనెక్కువ గ్రహింపఁగలుగుచున్నాను. నన్ను నేను దూషించుకొనుచున్నాను. ఎందులకనగా—మీాకున్న సుగుణ ములు నాకులేవనియు, మీాకుత్తమభార్యను గాకున్న నాజీవి తము నిష్ప్రయోజనమనియు.

నీమూ, నీవు నా జీవిత సర్వస్వమవు. నిన్నేమని సంబో ధించుటకు వీలుగాకున్నది. అన్నియు నీవే. నీవని వ్రాసినందు లకు క్షమింపుము. ప్రేమ నన్నిట్లు వ్రాయుమనుచున్నది. 16వ తేదీ కాకినాడకు వెళ్లుచున్నాను. 19వ తేది విచారణ. వాయిదావేసిన మరి నాలుగు దినము లుండెదను. మీా పెద్దక్క నాతోనున్నది. ఆమె కాంగ్రెసునకుఁ బోవుచున్నది. అందువలన సోదరుని కెక్కువ సాహాయ్యము చేయుటకు వీలు లేకున్నది.

ఇట్లు

మా. అ. దేవి.

## 59వ లేఖ

శ్రీచిగోడ్డు,
విశాఖపట్టణము,
30-5-23.

ప్రియతమ సీదూ,

మీరు దయతో వ్రాసిన జాబు అందినది. నేను చెన్నపట్నం 10వ ఏప్రియలు తేదీని పోయియుంటిని. అచ్చట నా మాసాంతమువరకుంటిని. రెండు కడదంతములు తీసినారు. మరి రెండు బాగుచేసినారు. నేను ఏలూరు వచ్చిన దినమున నేమి జాబు వచ్చినది. ఆ లేఖలో మీరు రాఁబోవు వారములోఁ బరీక్షాఫలితములు, మీరాక తెలియఁజేసెదనని వ్రాయుటవలన నత్యాంతాతురతతోఁ బ్రతివారము నిరీక్షించుచుంటిని. 28-5-23 హరిశ్చంద్రునకుఁ దంతినిచ్చి మీ క్షేమము తెలిసికొంటిని. ఆదినమే మీలేఖ వచ్చినది. పరీక్ష ప్యాసయినందులకు సంతోషమే కాని మీ రింకను వచ్చుట కాలస్యము చేయుచున్నారు. మీరచట బయలుదేరునపుడు మాకుఁ దంతినీయఁ గోరుచున్నాను. ఇంకను నుత్తరముల వ్రాయుచుండుమని వ్రాసితిరి. మీరు జూలైలో రానున్నపు డింకను జాబులేల? వ్రాసినను మీకందవు గదా! మిమ్ముల స్వయముగ దర్శించువరకు నాకు భయముగనేయున్నది. మాకుఁ దెలియచేయకయే స్వదేశమునకు మరలి వచ్చినట్లు

నాలుగుసార్లు కలనుగంటివి. నాకేమి తీసికొనివచ్చెదరు? అమెరికా చిత్రపటము లెన్ని తీసుకొనివచ్చుచున్నారు. సిగరెట్టు మార్కు ఆల్బమొకటి తీసికొనిరాఁగోరెదను. మామూలు ఫోటోలు నుంచుకొనుటకు మరియొకటి అట్టపుస్తకములు ఆల్బమును తీసికొనిరాఁగోరెదను. చేవ్రాలు (Autography) తీసికొనిరండు. చేతిసంచులు వీలయిన తీసికొనిరండు. మీరు టైపురైటరు కొంటిరా? ఒక మ్యాజికులాంతరును తీసికొనిరండి. వ్యవసాయాభివృద్ధిని మ్యాజికులాంతరు ద్వారా తెలియఁజేయుటకయి బొమ్మలు తెచ్చుకొనుఁడు. అదియునుగాక త్రాగుడు విషయము బీదవాండ్రకుఁ జూపవలెను. మనకుఁ గొన్ని పరిశ్రమాలయమునకయి కావలసియున్నవి. అవియవసరము. బొమ్మలు మాటలకన్న మ్యాజికులాంతరు ద్వారా మీరు వ్యవసాయమును గురించి చూపఁగలిగిన లాభముండును. మీరు నాకేమి తెచ్చినను, దేకున్నను మీరే నాకుఁ గావలయును. అందరికన్నియుఁ దేవలెనని ధనము వ్యయపరచవలదు. మనము నిరుపేదలమని నమ్ముఁడు. బంధువులందరు భాగ్యవంతులు. ధనవంతుల కేమి పెట్టవలసిన యవసరములేదు. జులై యేవారము బయలుదేరెదరు? జపాను పోయెదరా? చైనాలో విదేశీయుల నెత్తుకొనిపోవుచున్నారని తెలియుచున్నది. మీ రున్నారేమోయని భయపడితిని. మీరు చైనా పోవలదు. మరి యెచ్చటకేని పోయెదరా?

విద్య కింతములేదు. బి. యస్. సి. కనిపోయియుంటిరి. అందులో జయముగాంచగనే యం. యస్. సి. ప్యాసు కావలెనని యున్నది. అందు జయముపొందిన తరువాత మరి రెండు పరీక్షలున్నవనుచున్నారు, ఆపరీక్షలేవి? యం. యస్. కి. సంబంధించినవా? లేక వేరేమయినను? మీ రెపుడు వత్తురాయని నిరీక్షించుచున్నాము. బిళ్లలు తగ్గుచున్నవి. నెల దినములకుఁ బూర్తిగఁ దగ్గును. జూను మాసాంతమునకుఁ గాని జులై 15వ తేదీకిఁగాని పలూరు వెళ్లుచున్నాను. మీరు యెపుడు బయలుదేరునది, యెవ్వడిచటకుఁ జేరునది తంతిమూలమునఁ దెలియఁజేయుఁడు. మీరు కలకత్తా వచ్చిన మిమ్మాహ్వానించుటకు వచ్చెదను. లేనియెడల రాను. నాకు రావలెనని యున్నది. ఓడ యచ్చటనే దిగవలెను. కుటుంబవిషయమయి మీరేమియు నాలోచింపవలదు. మీకంత విచారమున్నఁ ద్వరగా రండు. ప్రస్తుతము నేను బాగుగనేయున్నాను. మీరు కలకత్తాలో దిగవలెనని నా కోరిక. నే నచ్చటకు వచ్చెదను. కాశీలో నొక నెల యుండవలెననియున్నది. మీరు తప్పక కలకత్తా రాఁగోరెదను. మా స్నేహితులనందరిని జూడ వీలుండును.

ఇట్లు,

మీయొక్క,

మా. అ. దేవి.

## 60వ లేఖ

విశాఖపట్టణము
25-3-22

నా ప్రియమైననీడూ,

మీ ప్రేమపత్రము లందుచున్నవి. ప్రత్యుత్తరమీయ నందులకు క్షమింపుఁడు. ప్రతిదినము జాబులు వ్రాయనుద్దేశించుచుందునుగాని వ్రాయుదమన్నఁగలము సాగదు. అయ్యది కేవలము నాదోషముకాదు. నన్నావిధముగ భగవంతుఁడే చేయుచున్నాఁడేమో నాకుఁదెలియకున్నది. మీ రెపుడు వత్తురాయని దినమొక యేఁడుగా నిరీక్షించుచున్నాను. పరీక్షలయిన వెంటనే రాఁగలందులకుఁ బ్రార్థించుచున్నాను. నామనస్సు సదా మీయందుండుటంజేసియు దేశసేవచేయఁజాలనందులకు విచారముగానుండుటవలన మనస్సు స్థిమితముగలేదు. వేసవికాల మిచ్చట గడపుటకువచ్చితిని. విశ్రాంతినిమిత్తము ఇచ్చటకువచ్చుట యీసంగతి మీకు హరిశ్చంద్రునిద్వారా తెలిసియుండవచ్చును. పుప్పిపండ్లబాధ యెక్కువగానున్నది. మన వంశమునందున్న పుప్పిపండ్లబాధనుండి తప్పించుకొనలేకపోయితిని. అవి బాగుచేయించుటకు దంతవైద్యునికడకు చెన్నపట్నం పోవలెననియున్నది. ఫలాహారము దాదాపు 9 మాసములుతీసికొనుటవలన లావు తగ్గినాను. లావుగానున్న బాగుందునా? బాల్యమునుండియు నేను లావుగానున్నానా ?

మదనపల్లి వెళ్ళిన తరువాత శరీరము పెరిగినది. ఆ బలుపు తగ్గినది. నా విషయములో మీరేమాత్రము విచారింపవలదు. దూర దేశముననున్న మీకొరకు నే నాలోచింపవలయునుగాని, నా నిమిత్తము మీరాలోచింపవలదు. బంధుమిత్రుల నడుమ నేనున్నాను. నాకేమియుఁ గొరంత లేదు. మీరు నాకడ లేరను లోపము తప్ప మరేమియు లేదు. నేనిచ్చటకు విశ్రాంతినిమిత్తము వచ్చితిని. నాకేమియు జబ్బు లేదు. కొంచెము బలహీనముగా నుంటిని. ఈయూరు వచ్చిన తరువాత బాగుగ నేయున్నాను. మీరు వచ్చేయు పర్యంతము నచటనే యుండఁదలచితిని. నేను సంపూర్ణారోగ్యమునుఁ బొందినగాని మీకు ముమ్ముందు లాభకారిణిగ నుండఁజాలను. మూఁడు సంవత్సరములైన తరువాత వచ్చిన భర్తకు భార్య లేవిధమైనస్థితిలో నుండవలెనో, ఆస్థితిలోనుండుటకుఁ బ్రయత్నించుచున్నాను. నేను జాబులు వ్రాయుట లేదని విచారింపవలదు. నాకోరిక మిమ్మెప్పుడు చూడఁగలుగుదునాయనియే. ప్రతిదినము మీరు స్వప్నములో గన్పట్టుచున్నారు. మిమ్ముఁజూచుటకు బుద్ధిపట్టుట లేదు. ఎంతఁ త్వరలో దర్శింపఁగలిగిన నంత లాభము. నా కాతురతగానున్నదని తొందరపడవలదు. మీరు వ్యాసుకాకుండ వచ్చినను సంతోషము లేదు. ఇన్ని దినములుండఁ గలిగినదానను మరి రెండుమాసములుండఁజాలనా? నాయందు మనస్సుంచి దూర దేశమున కెందు నిమిత్తము పోయితిరో మరువకుఁడు. విద్యార్థి

14

వేతనము మూలమున మీరు విద్య నభ్యసించుచున్న సంగతి జ్ఞాపకముంచుకొనుడు. మీవస్తువును నన్ను జాగ్రత్తగా మీయత్తమామలు, స్నేహితులు చూచుచున్నారని నమ్ముడు. ఇచ్చట మీస్నేహితుడు నారాయణరావునాయుడు (కాకినాడ) సబ్ జడ్జిగారు చాల సహాయము చేయుచున్నారు. నాకేమియు గొదువలేదు. మీపరీక్ష లెప్పుడు ప్రారంభమగును? రెండుమాసములున్నది. జూనులో బయలుదేరివచ్చెదరా? పరీక్షలయిన తరువాత విజయలాభమును బొందినసంగతి తెలియగనే బయలుదేరిరండు. మీరు పరీక్ష ప్యాసుకానియెడల మరికొన్ని మాసము లుండవలసివచ్చును. ఇం కెన్ని దినములు మిమ్ము విడనాడియుండగలను? సర్వవిధముల బ్రయత్నము చేసి జూనులో ప్యాసయిరండి. ప్యాసుగాకుండ రావలదు. మనకు డిగ్రీలతో పనిలేకున్నను మీరు చదువుచున్నపుడు ప్యాసయిరావలెను. అదియునుగాక మీరు విద్యార్థివేతనము బొందుచున్నపుడు పరీక్షయం దుత్తీర్ణులుకాకుండ వచ్చుటకు వీలులేదుగదా! అట్లు విచ్చేసిన నాకు సిగ్గుగనుండును.

నా ఫోటో కావలయునని యెన్నిపర్యాయములో వ్రాసియున్నారు. మీరు నన్ను విడనాడిపోయిన దాదిగ నన్నెందరు బలవంతముచేసినను ఫోటోతీయించుకొనియుండలేదు. మీతోగలసి తీయించుకొనుటకు బ్రాణమొప్పకున్నది. మీరు విచ్చేయుపర్యంతము తీయించుకొననని ప్రతిజ్ఞ చేసికొంటిని. నా ప్రతిజ్ఞను భంగ మొనరింపజాలను. ఇక

రెండు మూఁడు మాసము లింతకాల మోపికపట్టించు దుండఁ జాలరా! 2 మాసములలో మీ భార్యను కలిసికొని సుఖ సంతోషములం దోలలాడనున్నపు డీ మాయాచిత్రపట మెం దులకు? ఎవరేమి వ్రాసినను నమ్మవలదు. మీరు నిర్విఘ్న ముగాఁ బరీక్ష ప్యాసయి రండు. నేను మీదాననే కదా! సర్వదా మీకడనేయుందును. లావు తగ్గిననేమి? నాకు బల మున్న చాలదా? ఎక్కువ లావుగనున్న నసహ్యము. నా కిపుడేమి బాధయులేదు. ఫలాహారమువలనఁ గొంచెము బల హీనత కలిగినది. అంతియే. కేవల ఫలాహారముననే కాదు. తొట్టిస్నానముచే బలహీనత కలిగినది. అయితే యిపుడెప్పటి యట్లున్నాను. స్నానముమానితిని. ఇపు డొకపూట నన్నము, మరియొకపూట రొట్టె తీసికొనుచున్నాను. మాంసాహారము తీసికొనుటలేదు. కూరగాయలే. పుప్పిపళ్లు నాలుగయిదుం డుటవలన గవదబిళ్లలు కట్టినవి. ఆ బిళ్లలు పండ్లూడదీయిం చిన తగ్గునని చెప్పుచున్నారు. అంతియేకాని మరేమియు లేదు. పండ్లవలననే కాని వేరు వ్యాధికాదని రూఢియయినది. మీరు వేరుగా భావింపవలదు. తెలియక యెవరేమి వ్రాసినను నమ్మవలదు. నే నబద్ధమాడనని మీకుఁ దెలియును గదా! నా కేవిధమగు బాధయులేదని ముమ్మాటికి నమ్ముఁడు. నా కితర వ్యాధులేమియు లేవు. హరిశ్చంద్రుఁడు నా కన్ని విధముల నన్నవలె సాహాయ్యము చేయుచున్నాఁడు. హరి శ్చంద్రుఁ డన్నయ్యకు చేతిసంచులు రెండు కావలయునఁట. మనకున్నను, లేకున్నను, ఆయనకుఁ దప్పక తీసికొనిరండు.

ఇతరుల సామాను లేమియుఁ బెట్టుకొనకుఁడు. 50 రూపాయలకు కెమెరా తీసికొనిరావలెను. మీకు ఓడనిమిత్తము పైకము పంపునపుడు పంపించెదము. మనకొక మ్యాజిక్ లాంతరు కావలయును. అది మీ నిమిత్తము. పరిశ్రమాలయమున కొకటి కావలసియున్నది. చౌకగనున్నఁ దెలియఁజేయుఁడు. త్రాఁగుఁడుచేఁ గలుగు నష్టములను దెలియఁజేయు బొమ్మల మ్యాజికులాంతరు కావలయును. ప్రతిదినము మీ రాక కెదురుచూచుచున్నాను. మీ జాబులకయి నిరీక్షించుచుందును. నేను వ్రాయుటలేదని మీ రూరకుండవలదని నా ప్రార్థన. నే నెంతప్రయత్నించినను జాబులు వ్రాయుటయం దాశలేదు. మిమ్ముఁ జూడవలెనను కోర్కె యొక్కటియే. అన్నిటియం దసహ్యముగనున్నది. ఏమియుఁ జేయవలెనని యుండదు. తోఁచదు. ఉత్తరములయం దిచ్ఛలేదు. మీ జాబులందినఁ గొంత శాంతిగనుండును. నాయందు మీకు దయయున్న జాబులు వ్రాయుట మరువకనుకొందును. మీరు వచ్చిన నా కే బాధయుండదు గదా! బాధ యనగా విచారము; మీరు లేని లోపము. మీరు జపాను, చైనా త్వరలోఁ జూచి రండు. ఎక్కువకాల మాలసించిన నేను సహింపఁజాలను. మీరు పంపిన ఫోటోలు బాగుగనున్నవి. మీరు పంజాబు దేశస్థునివలెయున్నారు. మీరిదివర కాంధ్రుని వేషము వేసికొన్నదానికన్న వేయిమడుగులు బాగున్నది. అయ్యది కోటిరూపములను దాల్చినది. మీ రెపుడయిన నే విధముగ వేషము ధరించియుంటిరా ?...............

# శ్రీ దేవి లేఖలు—పరిశిష్టము

## శ్రీయుతులు దండు నారాయణరాజుగారికి వ్రాసిన లేఖలు

### ౧-వ లేఖ

మోహనదాసుఖద్దరు పరిశ్రమాలయము, ఏలూరు. ౧౭-౧౨-౨౨.

ప్రియసోదరా,

నిరాటంకముగా నీయూరు భగవదనుగ్రహమున చేరితిని. నాశరీరారోగ్యము ఎప్పటియట్లున్నది. అధికమగు మార్పు గన్పట్టలేదు. ప్రకృతి చికిత్సాభ్యాసము సల్పుటకంత యవకాశము లభించుటలేదు. నా దేహస్థితినిగూర్చి మీ రేమాత్రము కలవరపడవల దని నా ప్రార్థన. మీ నా యోగక్షేమము లారయుటకు భగవాను డుండగా మనమేల యాతురతతో నుండవలయును? ఆప్రేమస్వరూపుఁడు సర్వకాలసర్వావస్థలయందుఁ దన బిడ్డలయం దపారప్రేమ వర్షించుచు రక్షించుచుండ మీ రేల భయపడవలెను? భగవానునియందు పరిపూర్ణ విశ్వాస ముండి ఆప్రేమమయునియం దెవ రాధారపడి యుందురో వారి యోగక్షేమములఁ దానే వహించుచుఁ నని

వాగ్దానము చేసియున్నాఁడు. అందువలన నాశరీరాత్మల పవిత్రతయొక్క బాధ్యత యాయనయందే యున్నది. నే నున్నతదశకు వచ్చుట భగవంతునిస్వాధీనము; భగవంతుని ఇచ్ఛాధీనము. నేను భగవంతునిదాసను. ఏయుద్దేశ్యముతో నా కృపాసముద్రుఁడు న న్నీలోకమున కంపెనో, ఏయుద్దేశ్యముతో నన్ను తనవిచిత్రసృష్టిలో నొక ప్రాణినిగాఁ జేసి నన్ను రక్షించుచున్నాఁడో, ఏయుద్దేశ్యముతో నన్నుఁ దనసృష్టిని సేవించుటకై పంపెనో యాయుద్దేశ్యము మనఃపూర్వకముగా, ఆనందముగా నెఱవేర్చుటకు నేను ప్రయత్నించుచున్నాను. నా తండ్రి యిచ్ఛానుసారము తృప్తికరముగ, నాతని దివ్యనామోచ్చారణముఁ జేయుచు దీనరక్షకునిసేవ చేయఁజాలకున్నను, నాతనినిఁ దెలిసికొనఁజాలకున్నను నాగురువు (గాంధిమహాత్ముఁడు) దయ యున్నచో నేనాటికైన నాతని నాహృదయపద్మమున బంధించుశక్తి నామహాత్ముఁడిచ్చు నని నావిశ్వాసము. ఆకరుణానిధివంక దృష్టి మరల్చిన సర్వమానసికసంతాపముల నపహరించి సంపూర్ణశాంతినిఁ బ్రసాదించును. ఆవిశ్వాసము వృద్ధి నొందించుటకు నా శక్తివంచన లేక ప్రయత్నించుచున్నాను. ఆపవిత్రవిశ్వాస మింకను పవిత్రతరమై నా హృదయమును పావనము గావింపలేదు. నాహృదయ

మును పవిత్ర దేవాలయ మెప్పుడు చేయగలనో? ఎప్పుడు దయామయుని నాహృదయ పేటికయందు పావనతామూల మున బంధించగలనో? అనుక్షణము చూచుచున్న భగవానుని మానవులహృదయములందు నివాస మేర్పఱచుకొన్నను దెలిసికొనఁజాలకున్న పరమేశ్వరుని ప్రార్థన (ఏకాంతముగా) మను తాళము చెవితో నాహృదయ పేటికనుఁ దెరచి పవిత్రజ్యోతిమూలమున నా రత్నమును ప్రకాశింపఁజేయు భారము నాయం దున్నది.

సోదరా, నేను మీకడనుండి వచ్చుటకు పూర్వము మీకు ఆత్మసాధనవిషయమునుగూర్చి హితోపదేశము చేయవలయు నని కోరితిరి. సోదరా, నేను పరుల కుపదేశింప సమర్థతకలదాననా? స్వయముగ నుత్తీర్ణు లయినఁగాని పరులఁ దరింపఁజేయుట కేమాత్రము తోడ్పడఁజాలరు.

ఆప్రేమమయుని ప్రేమింపఁజాలని నేను మీ కాపరమాత్మునివిషయ మేమి యుపదేశింపఁగలను? భగవంతుని ప్రేమించుట యనగా నా మహామహుని సృష్టిలో నున్న ప్రతిజీవమును సమభావముగా, సరళహృదయముతో, పవిత్రభావముతో ప్రేమించుటయే. ప్రేమ లేని మానవుడు పరమాత్మ నేనాటికిని గ్రహింపఁజాలడు. అయ్యో! భగవంతుడా! నన్నేల నిన్ను పవిత్రహృదగా

ముతో ప్రేమింపనీయ వని నే నేడ్చుచుందును. పసిబిడ్డ తల్లి కాన్పించనిచో నెంతయో పరితపించి ఆమెదర్శన మగునంతవరకు శాంతపడ దే? ఆబిడ్డ కున్న ప్రేమ మన కేల యుండదు? మన కనేకజన్మలు ప్రసాదించి, ఎన్ని తప్పులు చేయుచున్నను, సన్మార్గమునుండి దూరులమై పాపపంకమునఁ బడుచున్ననుఁ బ్రేమతో లేవనెత్తి దయా ర్ద్రహృదయముతోఁ గాపాడుచుఁ గడుదుర్మార్గుల నేవిధ ముగనైన నుద్ధరింపవలెననెడి దయాప్రేమలుగలిగి, యెన్న డును దన దివ్యనామోచ్చారణఁ జేయని పాపులను రక్షిం చుటభగవంతునిసృష్టిచిత్రములలోనొకయద్భుతకార్యము.

కడు దుర్మార్గులకుఁ దన్నుఁ దెలిసికొనుట కెక్కు డవకాశమును గలుగఁజేయు మహామహుఁ డీపాపిని నుద్ధ రింపఁడా? నేను పాపినిని. సచ్చరిత్రులగు బిడ్డలఁ జూచి జననీజనకు లానందించి వారిమూలమునఁ దమతమ వాంఛలు ఫలింపఁజేసికొని యత్యధికానందముతో గౌరవ పాత్రులైనను నాతల్లిదండ్రులు దుర్మార్గు లగు బిడ్డ లున్న వారి నేవిధముననైన సచ్చరిత్రులఁ జేయవలయు ననెడి సంకల్పముతో సర్వదా విచారించుచుందురు. వారి హృదయావేదన వర్ణనాతీతము. సుపుత్రునియం దుండు ప్రేమ దుష్టపుత్రునియందు దయారూపమున నెక్కువగా నుండును. ఆసంతోషముకన్న నీదయ, వేదన, చింత

యెక్కువగ నుండి బిడ్డయొక్క బాధ్యత విశేషముగ వహింతురు. నిజ మయిన తల్లిదండ్రులవిధి యిది.

మానవులే యీవిధముగ నున్న భగవంతునకుఁ బాపియం దెంత ప్రేమ, దయ యుండునో దీనివలన గ్రహింప వచ్చును. భగవంతుఁడు భక్తుని ప్రేమించుచు, సంతసించుచు భక్తుని కేవిధముగఁ గష్టముఁ గలుగనీయ కున్నను పాపిని దరింపఁ జేయుటలో నాయనకు ఉన్న ప్రేమ, దయ భక్తునియం దుండ దని నాభావము. సమస్త ప్రపంచమున కాధారభూతు డగు భగవంతుని కున్న గొప్ప యే మున్నది? ముమ్మాటికి ప్రేమస్వరూపు డట్టి కఠినాత్ముడు గాఁడు. ప్రస్తుతము ప్రపంచమున తల్లిదండ్రులు తమతమ వాంఛలకు వ్యతిరేకముగా ప్రకృతినియమములకు విరుద్ధముగ జనించుచున్న యీ దుర్బల సంతానమునందుఁ జూపుచున్న ప్రేమ, వారి విషయములలో వీరు వహించుచున్న బాధ్యత సచ్చరిత్రులఁ జేయుటలోఁ బడుచున్న పాట్లు మనము చూచుచున్న వేకదా! భగవంతుడుమాత్రము దనసంతతి యెడ నీవిధముగ ప్రవర్తింపఁడు. కేవలము సంతానము కలుగగనే తల్లిదండ్రులు వారిని విడిచి వేయుచున్నారా?

భగవంతుఁడు ప్రప్రథమమున భక్తుల కనేక కష్టముల సంప్రాపింపఁజేసి వారివారి

క్షించుచుండును. నిజమయిన భక్తులు సర్వదా కష్టముల పాలు సేయు మని భగవంతుని ప్రార్థించుచుందురు. భగవంతునకు మహాభక్తునియం దెంత ప్రేమయో మహాపాపియం దంతియే ప్రేమ. ఆ ప్రేమ దయారూపమునఁ బ్రకాశించుచుండును. సామాన్యమానవులతో సమానుఁడయినయెడల భగవంతుఁడు నాకు సాహాయ్యము చేయక పోవచ్చును గాని, మహాపాపులఁ బవిత్రులుగఁ జేసి తన యద్భుతసృష్టిని మరింత యద్భుతముగఁ జేయుకృపాసముద్రుఁడు నన్నేల రక్షింపఁడు? నన్నేల తన్నుఁ దెలిసికోనీయఁడు? మానవుల కున్న పక్షపాత మా దయామయునికడ నుండునా? పక్షపాతము చేయుటయే విధ్యుక్తధర్మముగ మానవు లూహించుచున్నట్లు ఆ దయానిధి భావింపఁడు. మానవునివలె భగవంతుఁడును వర్తించిన వా రిరువురకును భేద మేమి? భగవంతుని కున్న యద్భుతశక్తి మానవున కేల లేదు? భగవంతునకు మానవునకును భేదము లేకున్న సృష్టిలోని యేపదార్థమునైన సృష్టించుట మానవునకు సాధ్యమగుచున్నదా? ఈశ్వర విధానమును దెలిసికొనుట కశక్తు లగుమానవులు ఈశ్వరసృష్టికిఁ బ్రతిసృష్టి చేయఁగలరా? అసంభవము. ఇందువలన మనము భగవంతుని శక్తి కెంత దూరముగ నున్నామో స్పష్టపడఁగలదు. భగవంతుని సృష్టివిషయము తరువాత వ్రాసెదను.

ప్రేమస్వరూపుఁ డగు భగవంతుఁడు పాపుల రక్షించుచుండ నావంటి పాపిని రక్షింపఁడా? ఏనాటికైనఁ దన్నుఁ దెలిసికొనుట కవకాశ మీయఁడా? భగవంతునకు భక్తులయందుఁ బ్రేమ. పాపులయందు దయ. జనని బిడ్డ యస్వస్థుఁ డయి, కురూపియై యధిక బాధ నొందుచున్నపుడు తక్కినబిడ్డల సంతోషమునకు, గౌరవమునకు సంతసించునా, లేక యాబిడ్డబాధను నివారింపఁ జేయుటకుఁ బ్రయత్నించునా? పాపి యనఁగా మానసిక రోగములతో నుండువాఁడు. పాపి యనఁగాఁ గామ క్రోధాదులు గలవాఁడు. పాపి యనఁగా భగవంతుని తెలిసికొనక యహంభావముతో నీప్రపంచసౌఖ్యముల యందు మునుఁగువాఁడు. పాపి యనఁగా స్వార్థపరుఁడు, ప్రపంచమును బ్రేమింపనివాఁడు, మానవసేవ చేయని వాఁడు, దుర్బలుఁడు, ఇంద్రియనిగ్రహము లేనివాఁడు, చిత్త చాంచల్యము, మనోవికారముగలవాఁడు. ఆవిధముగ నేను పాపినిని. సోదరా, మన కితరప్రపంచముతో సంబంధము లేదు. ప్రతిమానవునకును వేర్వేఱుగఁ బ్రపంచ మున్నది. ఆప్రపంచమును జయించి ఈశ్వరప్రపంచమునకుఁ బోవలసి యున్నది. ప్రతివ్యక్తికిని స్వానుభవప్రపంచము కంటకావృతమయి పైనుడివిన దుర్గుణములతో నిండియుండును. త్రాఁచుపామువిషమును శరీరమునుండి దూర మొనరింప

వీ లుండునుగాని యీవిషయము విషమును మానవశరీ రాత్మలనుండి బహిర్గతము చేయుట కనేకజన్మములు పట్టును.

పూర్వజన్మఫలమున, అదృష్టవశమున నొక జన్మ ములో భక్తులు, పాపులు తరించుట కవకాశ మున్నది. సోదరా, ఒకయీశ్వరభక్తుఁడు, మహాపాపి బాగుపడు టకుఁ గృతసంకల్పులయి యున్నారు. ఎవరు జయింతురో నిరీక్షించిచూచెదము. ఈజయాపజయములనుబట్టి భగవం తుని దయా ప్రేమలు వెల్లడియగును. మానవుఁడు ప్రపంచ ములో నందరికన్నఁ బరమనీచుఁ డనుభావముతో నుండి భగవత్స్వరూపు లగు జీవకోటికి విధేయు లైయుండ వలెను. అదియునుగాక ప్రత్యేకప్రపంచమునకుఁ జెంది యున్నా మని భావించి, ఈశ్వరసేవఁ జేయుచు దుర్గుణ ముల నశింపఁజేసికొనవలయును.

భగవంతునిఁ దెలియఁజాలనివారు పాపులుగారా? ఆవిధముగ నేను పాపిని గానా? భగవంతుని ప్రేమకుఁ బాత్రురాల నెప్పుడు కాఁగలను? ఈ హృదయమునఁ బ్రేమప్రవాహ మెపుడు తరంగరూపమునఁ బ్రవ హించునో, ఎపుడు నాజన్మ సార్థక మగునో, ఆసుదిన మునకు నేను నిరీక్షించుచున్నాను. సోదరా, జీవితో న్నత్యమునకై కృషి సలుపవలె నన్నఁ బ్రపంచమున

మనకన్న నీచులు లేరనుభావముతో మనము మన దుర్గుణముల నశింపఁజేసికొనవలెను. అంతియేకాని మనము ప్రపంచమున ననేకులకన్న గొప్పవార మనుభావ ముదయించిన బాగుపడుట కవకాశ ముండదు. ప్రతివ్యక్తియు తాను బాగుపడి, భగవంతుని దెలిసికొని పవిత్రహృదయముతోఁ బవిత్రసేవ చేయువలయు నను భావము నలవరుచుకొనవలెను. మరేయభిప్రాయమును హృదయమున నుండఁగూడదు. అసూయ, ఈర్ష్య, అహంభావము, ఆత్మస్తుతి మొదలగు భావము లున్నఁ బాపము గాదా? ఈభావము కొలఁదిగా నాలో లేకపోలేదు. అందువలన నేను పాపినిని. ప్రపంచమున జనన మొందినది భగవంతుని సేవఁ జేయుటకొరకే. ఆ భగవత్సేవ యనునొకచే భవార్ణవమును తరించుటే నా జీవితపరమావధి.

సోదరా, కాఁబట్టి యొకయంధుఁడు మరియొక యంధుని కెంత సహాయకారిగ నుండునో నాసహాయము వలన మీ కంత లాభ ముండును. భగవానుఁడు నన్ను బాగుచేయుటకు మీవంటి భక్తులస్నేహము లభింపఁ జేయుచున్నాఁడు. కృపాసముద్రుఁ డెంత యవకాశముఁ గలుగఁజేసినను నేను బాగుపడుటలేదు. సోదరి మీకు భగవంతునివిషయ మేమియు నుపదేశింపఁజాలదు. లాభము లేదు.

ఈజా బంతయు నొకవిషయముతో నిండియున్నది. ప్రథమమున ననేకవిషయములనుగూర్చి దీర్ఘలేఖ వ్రాయఁ దలఁచితిని. ఆభావములు వ్రాయుట కవకాశము లేక పోయినది. రెండుమూఁడుపుటలు వ్రాసి ముగించఁదలఁచియుఁ గేవల మొకవిషయమైనను కొంతవరకుఁ బూర్తిఁ జేయఁ దలఁచి వ్రాసితిని. పరిశ్రమాలయకార్యములఁ జూచుచు వ్రాయుచున్నందువలన నే నేమియో వ్రాసితిని. పోస్టువేళయైనది. టైము లేదు. ఇతరవిషయములను గూర్చి వ్రాయఁదలఁచుకొనలేదు. మీ రీవిధమగుజాబులు వ్రాయు మని కోరుటవలన వ్రాయుచుందును. కాని సూపరింటెండెంటుగారికి నాలేఖలు చదివి యిచ్చుటకు విసువుగ నుండు నని భయముగ నున్నది. యథాసమయమునకు భోజనము వచ్చుచున్నదా? ఏమియు లోపము లేదని తలఁచెదను. ఇంతవరకు జైలుసూపరింటెండెంటుగారన్నివిధముల సదుపాయముఁ గలుగఁజేయుచున్నారు గదా! నాయుత్తరములు పఠించి యిచ్చుటకు సమయాభావముగ విసువుగ నుండు నని భయముగ నున్నది. అమ్మ, అందఱు వందనము లంపుచున్నారు.

ఇట్లు

సోదరి.

## ౨-వ లేఖ

మోహనదాసునిలయము, ఏలూరు. ౧౨-౧౨-౨౨.

ప్రియమిత్రమా,

నిన్న నే యొకజాబు వ్రాసియుంటిని. అది యంది యుండవచ్చును. తొందరగ వ్రాసియుంటిని. వ్రాయఁ దలఁచినంత వ్రాయఁజాలనైతిని. ఈదినము దీర్ఘలేఖ వ్రాయ నుద్దేశించితిని. నే నెంతవఱకు లిఖియించఁగలనో యూహించఁజాలకున్నాను. రేపు అమెరికాకు నుత్తరము వ్రాయవలయును. మీసోదరునికి వ్రాయుట యనినఁ గొంతకాలము లేఖ లిఖించుటయందు వినియోగించవలసియుండును. సర్వదా దీర్ఘలేఖలకు నిరీక్షించుచుందురు. శ్రీమతి మాణిక్యాంబగారు దూదినిమిత్తము కంచంచర్ల కేగినారు. ౧౭-వ తేదీకి వచ్చెదరు. మే మిచ్చట కేతెంచిననాఁటిరాత్రి వెళ్లుటకు వీలు కానందున గతదినము సాయంకాలము పోయియుండిరి. మీవిచారణ ౧౬-వ తేదీ కాఁగల దని తెలియుచున్నది. అయితే యయ్యెది సుస్పష్టముగఁ దెలియుటలేదు. సహాయనిరాకరణవాదులు పలువురు విచ్చేయకుండ నీలోపుగా రహస్యముగా విచారించ సమకట్టిరా యేమి? సోదరా, పలువురు విచారణదినమునకు మీదర్శనార్థము రాఁగలరు. గుత్తా రామస్వామిగారు నిన్న నిచ్చటికి వచ్చి

మీరు వ్రాసినప్రకారము ౫౦ రూ. లిచ్చినారు. ౧౮-వ తేదీని వచ్చెదరఁట. మంగయ్యగారు ప్రస్తుత మీపుర మున లేరు. తాడిపత్రి పోయిరి. పరిశ్రమాలయపుజమా ఖర్చులు ప్రచురింపలేదు.

౬-వ తేదీని రాజా బెజవాడ వచ్చినట్లు తెలిసి నది. పరిశ్రమాలయ విషయమునుగూర్చి ప్రయత్నించు చున్నా రని నాభావము. నిన్న తంతివార్త నంపితిని. నేఁడో రేపో రావచ్చును. ప్రస్తుతము మీ సహాయము లేనందునఁ బరిశ్రమాలయమునకుతీరనికొఱఁతగానున్నది. కొలఁది దినములు మీరు లేకుంటచేతనే చాల నష్టము కలుగుచున్నది. సోదరా, ఇందువలన నా కెంతమాత్రము విచారము లేదు. కష్టములపా లయి విఘ్నములు పదేపదే కల్గుచున్నను తుదకు జయము కలుగును. కష్టములమూల మునఁ బొందినజయము చిరస్థాయిగ నుండును. ప్రపంచ భార మంతయు నిర్వహించు భగవానుఁడు, మీ నా భారము వహించి నిరంతరముఁ బ్రోచుచున్న మహాను భావుఁడు, మనపరిశ్రమాలయ భారము వహింపఁడా? మోహనదాసుని ఆశీర్వాదబలంబున మోహనపరిశ్రమా లయము అభివృద్ధికి రాదా? ఇంతవఱ కభివృద్ధికి వచ్చె నది మనమూలమునఁ గాదు, భగవంతునిదయవలననె. ఆప్రేమస్వరూపుని ప్రేమించుచు నాతని సేవ ప్రేమ

పూర్వకముగఁ జేయుటయె యీ జీవిత గమ్యస్థానము. అందులకై యీ మహామహులు మనకు వలసిన సమస్త వస్తువులఁ బ్రసాదించి తాను జేసిన యద్భుత సృష్టియం దలి మానవులు సోమరులై యుండకుండఁ గొన్ని కార్య ములను మనచేఁ జేయించుచుండును. మానవులద్వారా తనయద్భుత సంకల్పముల నెఱవేర్చుకొనుచుండును. కాఁబట్టి మీరు లేనందువలన నిచ్చట జిల్లాసంఘమునకు పరిశ్రమాలయమునకు నష్టము వాటిల్లుచున్న దని చింతింపవలదు. కేవల మొకరిపై నాధారపడి యున్న పలువురను గార్యశూరులుగఁ జేయునుద్దేశ్యముతో భగ వంతుఁ డీవిధముగ ననకాశ మిచ్చుచుండును. కొన్ని దినములు భగవంతుఁడు తనభక్తులు లేనిలోపముఁ జూపి తనబిడ్డలను గార్యదీక్షితులఁ జేయును. మహాత్ముఁడు దనయనుచరు లెల్లకాలము తనమీఁదనే యాధారపడి యుండకుండ దనయాదర్శములను వారికి చక్కఁగా బోధించి పిమ్మట వారిశక్తిసామర్థ్యములు, దీక్ష పెంపొం దించుటకే తాను పోయి జైలునం దున్నాఁడు. మరియు తనప్రియభక్తుల, కార్యశూరులఁ గొందరిని దనతోఁ పాటు జైలునకుఁ బంపుచున్నాఁడు. ఎంతప్రేమ లేకున్న నాయన తనప్రియశిష్యుల జీవితోన్నతికి, శరీరాత్మపవిత్ర తకు శ్రీకృష్ణజన్మమందిరమునకుఁ బంపుచున్నాఁడు ?

మీ కీశ్వరునియందు దృఢమగు భక్తివిశ్వాసములు, నిశ్చలమగు ధ్యాననిష్ఠ యుండుటంజేసి మీయందు ప్రేమ మెండు. మిమ్ముఁ ద్వరలోఁ బవిత్రభక్తునిగాఁ జేయ నుద్దేశించి మీ కన్నివిధముల సహాయముచేయుచు సదుపాయముఁ గలుగఁజేయుచున్నాఁడు. అయిన నాయందు భగవంతునకుఁ బ్రేమ లేదా? నాజీవిత మీ విధముగఁ గడుపవలసినదేనా? మీరు త్వరలో నభివృద్ధికి రాఁగలరనియు, నేను బాగుపడుట కెక్కువకాలము పట్టుననియు మీకు ముం దవకాశము గలుగఁజేసినాఁడా యేమి?

పరిశ్రమాలయభారము మీయందున్న నాకు శరీరారోగ్యలాభముఁ బొందుటయే కాక ఆత్మశాంతి, ఆత్మపవిత్రత మొదలగువానికిఁ గొంత యవకాశ ముండెడిది. భగవానుఁ డేకష్టము సంప్రాప్తింపఁజేసినను మన మేలు కొఱకే గనుక యేయుద్దేశ్యముతో నీవిధముగఁ జేసెనో తెలియకున్నది. అయిన నాయందలి దయాప్రేమముచేఁ దన్ను బాగుగఁ దెలిసికొనుట కీవిధముగఁ జేసెనా యేమి? ఆహా! భగవంతునిలీల లగమ్యగోచరములు; మానవాతీతములు.

ఇఁక మనవిషయమునకు రండు. మన కితరవిషయములు వలదు. ప్రాపంచికరాజకీయసాంఘికవిషయముల నటుంచుఁడు. మనకు జన్మజన్మాంతరములవిముక్తికిఁ గార

ణంబగు ధార్మికవిషయంబులగుఱించియే ముచ్చటింతము, చర్చింతము, ఆలోచింతము, పఠింతము, లిఖింతము, భావింతము. ఆ యుద్దేశ్యములతో మన ప్రాణముల సమర్పించెదము. మనోవాక్కాయకర్మలయం దమ్మహాత్ముని సేవించి, భజించి, ధ్యానించి పవిత్రులమై జీవితముల సమర్పింతము. అదియే నాజీవితోద్దేశ్యము; అదియే నావాంఛ; అదియే నాసంకల్పము. నే నస్వాదపడుదు, వాస్తవముగా మహాత్ముని సత్యాగ్రహవ్రతమును అహింసా వ్రతము ననుసరించి యభ్యసించి యాచరించుచున్నానా? లేక సహాయనిరాకరణవాద నని ప్రపంచమునకుఁ జాటుటకై కేవల ముద్రేకమున, ఉత్సాహముతోఁ బ్రవేశించితినా? ఇంకను నుద్యమతత్వమును బాగుగాఁ దెలిసికొనఁజాలనైతినా యని విచారించుచుందును. ఉద్యమతత్వము బోధపడిన మానవులకు మహాత్మునియనుచరులమని, భక్తులమని, శిష్యులమని భ్రమపడు మనమే గురువు వాంఛానుసారము, ఆదేశానుసారము హితోపదేశముల నెంతవఱకు గ్రహించఁగలిగితిమాయని సందియము గలుగుచున్నది.

సోదరా, మహాత్మునిశిష్యుల మయిన మనము స్వార్థత్యాగులము, వైరాగ్యసంపన్నులమై ఈశ్వరసేవ పవిత్రహృదయముతోఁ జేయుచు మనఃపూర్వకముగా

సేవించుటలేదా? పరులవిషయము మనకు వలదు. ఎవరి విషయము వా రాలోచించుకొందము. మనవిషయము మనమాలోచింతము.

వైరాగ్యమనఁగా నేమి? ధ్యాన మనఁగా నేమి? ఈశ్వరసేవ యనఁగా నేమో తెలిసికొందము. ఈవిషయములనుగూర్చి నాకుఁ దెలిసికొనవలయు నని కుతూహలముగా నున్నది. మిత్రమా, మీరు గ్రహించిన దానిని నాకుఁ దెలియనీయక యాలాభమును మీరే పొందుచున్నారు. ఇది స్వార్థపరత్వముసుమా! సోదరి మున్ముం దభివృద్ధికి వచ్చునేమో యని భయముగ నున్నదా? సోదరుని ధర్మ మేమి? సోదరికి సాహాయ్యముఁ జేయుచు సర్వదా యీశ్వరభక్తురాలై యీశ్వరసేవ ప్రీతితోఁ జేయునట్లు చేయుభారము మీయందు లేదా? భగవానుఁడు తనభక్తులను నా స్నేహితులుగాఁ జేసి నన్ను వా రతనివిషయమును గ్రహించుటకు సాహాయ్యముఁ జేయు మనినను జేయకున్నారు. నే నెట్టి విరాగిణిని? సత్యమైన విరాగిణినా? పవిత్రమైన విరాగిణినా? బాహ్యసంపద త్యజించి కాషాయవస్త్రధారుఁడై భస్మము బూసికొని మౌనము దాల్చునట్టి సన్న్యాసిని బోలు విరాగిణినా? అట్టివైరాగ్యము నాకు ముమ్మాటికిని వలదు. నిజమగు వైరాగ్యమునకు బాహ్యలక్షణము

లుండవు. నే నితరులకు విరాగిణినని కాని, వైరాగ్య లక్షణము లున్న వని గాని తెలియసీయవలయు నను భావము గలదానను గాను. అట్లు తెలిసిన నాహృదయ మమిత వేదనను బొందును. సాధ్య మైనంతవఱకు నే నట్లాచరించుచున్నా నని యితరు లనుకొందు రని లజ్జా భయములు నన్నావరించి యప్పుడప్పుడు బాధించు చుండును. ప్రస్తుతము నే నాచరించుచున్న పద్ధతులవలన నితరులు సందేహపడుదు రేమో యని యాలోచించు చుందును. ఆకఠినాభ్యాసములలో నాయింద్రియములకు లోఁబడకున్న, ప్రపంచసౌఖ్యముల నెక్కువ యనుభ వించుచు ననేకరుచుల కలవడియున్న, వివిధవస్త్రాలంకార ముల కలవడియున్న యీశరీరము నేవిధముగనైన, విషయదాస్యమునుండి తొలఁగించి ప్రపంచములోఁ బరమ శత్రువును, స్వాధీనదుర్లభమును అగు మనస్సును స్వాధీన పఱచుకొన నుద్దేశించి యీ వ్రత మాచరించితిని. సాధ్య మైనంతవఱకు సకలసౌఖ్యముల విసర్జించుటకుఁ బ్రయ త్నించుచున్నా నని మీకుఁ దెలిసియేయున్నదికదా! అందఱు నింతటి కఠినవ్రత మాచరించినయెడల భగ వంతుని గ్రహింపఁజాల రని నాభావము గాదు. అనేకా భ్యాసములలో నిది యొకటి కఠినముగా నుండవచ్చును. అంద ఱీవిధముగ నాచరించవలసినయవసర ముండదు.

ఇంద్రియనిగ్రహమునకు జిహ్వాచాపల్యమును జయించిన సులభ మని గ్రహించి యాహారమును మార్చితిని. భగ వంతుని దెలిసికొనుటకు దుర్గుణములు నశించినఁగాని జయ ముండ దని కఠినవ్రతముల నాచరించుటయే నాప్రధానో ద్దేశ్యము; పరులు చూచిన సంతసించెద రని కాని, గౌర వించెద రని కాని కాదు. ఆవిషయము నేను వేఱుగ వ్రాయు టనవసరము. నామనమును వైరాగ్యమునం దలవడఁజేయుటకుఁ బ్రయత్నించుచున్నాను. శరీరము వైరాగ్యలాభమును బొందిన లాభము లేదు. హృద యము, మనస్సు పరిపూర్ణవైరాగ్యలాభమును బొందు టకై ప్రయత్నించుచున్నాను.

వైరాగ్యమునకు బాహ్యలక్షణములు లేవు. అది యంతరంగముననుండియే ప్రకాశించును. ఇతరులకుఁ గన్ప ట్టదు. అంతరంగవైరాగ్యము భిన్నము భిన్నముగ నుండును. కొందఱు సంపదలమధ్యమున నుండియే యంత రంగవైరాగ్యలాభమును బొందుదురు. ఆంతరంగికవైరా గ్యము (ఆత్మసన్న్యాసము) సర్వమానవులయందు సమాన ముగ నుండదు. అట్లుండు టసంభవము. యౌవనమున నేది వైరాగ్యమో యయ్యది వృద్ధాప్యమున వైరాగ్యము కాదు. ప్రపంచతుచ్ఛసౌఖ్యములయం దుండు విరక్తి భావము వైరాగ్యమె. అంతరంగమం దుండు వైరాగ్య

మెట్టిది ? సంసారము, ఇంద్రియాసక్తులు ఉత్తేజమునకు మూలకారణములు. అసార మైనదియు, సమస్తపాప ములకు ముఖ్యకారణము నగు సంసారమును నిరసిం చుట, అనఁగాఁ దుచ్ఛసౌఖ్యములయం దనహ్యాభావముఁ గలిగి విరక్తిఁ జెంది విముక్తు లగుట, దుర్గుణముల నశింపఁ జేసికొని మనోవికారముల రూపుమాపి పవిత్రమనముతోఁ బవిత్ర భగవన్నామమును జపించుచుఁ బవిత్రసరణి ప్రేమతో నీశ్వరుని ప్రేమించుచు, జగత్తును ప్రేమిం చుచు నీశ్వరసేవ చేయుటయే వైరాగ్య ముదయించుటకు మూలసూత్రము. పవిత్రవిరాగిణి యయినఁదరువాతఁ జేయవలసినపను లివియే. లోకకల్యాణార్థము విరాగి యగుట భక్తునిలక్షణము. సత్యబద్ధులమై, పాపచ్యుతు లమై, సుఖాసక్తిని జయించి, హృద్గతవైరాగ్యానుభవ మును బొందుదము. వైరాగ్యమునకు ధనాహారవేష ములయందును, ఇంద్రియసుఖములయందును వాంఛను నశింపఁజేయుట యొకశిక్ష. అది యింతవఱకుఁ బూర్వము నుడివియుంటిని. సోదరా, వైరాగ్యావేశమునను, ఆదే శమునను, భోగేచ్ఛను, సుఖమును నిచ్ఛాపూర్వకముగఁ గఠోరనియమముల నణచి నాశనముఁ జేయుట యుత్తమ మని నాభావము. మనమునఁ బాపబీజము లేకుండఁజేయ వలయును. మనస్సును శిథిలపఱచక నిత్యానందులమై

యుండవలయును. వైరాగ్య మను త్రాటితో మనస్సును సంసారవిషయములయందుఁ జొరనీయకుండ బంధించవల యును. మనము ముఖ్యముగాఁ జేయవలసిన దదియె. శరీరరక్షణార్థ మావశ్యకనియమములఁ బాలించి స్వాస్థ్య భంగము గాకుండఁ జూచుకొనవలెను. నియమముల నుల్లంఘించువా రీశ్వరశత్రువు లని భక్తులు వ్రాయు చున్నారు.

సోదరా, వైరాగ్యమునకై స్వాస్థ్యభంగము వాటి ల్లునట్లు నే నేనియమములనైన నుల్లంఘించితినా? నాయా రోగ్యము బాల్యమునుండియు ఇటులనే యున్నది. అందు వలన నే నీశ్వరశత్రురాలను గాను. కేవల మందుకయిన నన్ను దూషింపవచ్చును. పూర్వజన్మకర్మఫలంబును వివిధ ముగ నే ననుభవించుచున్నాను. అయినను నా దేహము అనారోగ్యదశయం దుండుటకుఁ గొంత నానిర్లక్ష్యభావ మున్న దని యంగీకరించుటకు నేను వెనుదీయను. తత్ఫల మిపు డనుభవించుచున్నాను. ఆరోగ్యలాభమునకుఁ బ్రయత్నించుచున్నాను. ఇక్కారణమున నేను ప్రేమ మయునిక్రృపకు దూరముగ నున్నానా? అందువలననే భగవంతుఁడు దన్నుఁ దెలిసికొననీయుట లేదా? నన్నిన్ని విధముల కష్టపెట్టుచుఁ దన్నుఁ దెలిసికొననీయకుండు టలో నుద్దేశ్య మేమి? ప్రియసోదరా! ఆసుదిన మేనాటి

కైన లభించునా? మీసోదరికిఁ గలుగునా? సోదరి యానందమునకు సోదరుఁ డానంద పరవశుఁడుఁగాఁడా? సోదరి యాత్మవిరాగిణి కాగలందులకు భగవంతుని ప్రార్థింపుము. మిత్రమా అనుపదముకన్న సోదరా యను పదమునందు మాధుర్య మెక్కువగ నున్నది. సోదరా యని పిలుచుటకు, వ్రాయుటకు నా కెక్కు డానందముగ నుండును. కాని చెల్లె లన్నగారి కుపదేశించు టంత భావ్యము గాదు. మిత్రమా యని వ్రాసిననే కొలఁదిగ నుపదేశించుటకైన నవకాశ ముండును. నిక్కము గాదా? చెల్లె లపుడపుడు సోదరు నుత్సాహవంతుని జేయవలసియుండును. హితోపదేశము గాక పరస్పర సహాయ మని భావింపనచ్చును.

ఈశ్వరధ్యాన మనఁగా నేమి?

ఈశ్వరప్రీతికి వ్యతిరేకము లగుభావముల మన మనములయందుఁ జొరనీయక సర్వదా భగవంతుని కృపకుఁ బాత్రులమై యతనిని సమీపించుటకుఁ బ్రయత్నించవలెను. సాధారణముగా సచ్చరిత్రు లగు జననీ జనకులు గల సత్సంతానము సర్వదా వారిసద్గుణముల నలవడఁజేసికొనుటకుఁ బ్రయత్నింతురు. ఆవిధముగనే ఈశ్వరసంతానము తమ తండ్రిగుణముల నలవడఁజేసికొను

టకుఁ బ్రయత్నింతురు. అతనికల్యాణగుణములను మన మలవరచుకొని సద్గుణవంతులమై నిత్యానందపదవి నొందు టయే భగవంతునియభీష్టము. ప్రపంచోద్ధారకుఁడు సృష్టి స్థితిలయ కారకుఁడునగు భగవానుఁ డెక్కడ? ఆయనగుణ ముల నలవరచుకొనుట మానవులకు సాధ్యమా, సంభ వమా? అని మీరు పరిహాసింపవచ్చును. మనజనకుని గుణ ములు మన కేల లేకపోవలయును? ప్రియజనకుఁడుగాఁడా? తండ్రి, బిడ్డ లున్నతదశయం దుండవలయు నని కోరి య ట్లుండుటకు వారికి సాహాయ్యముఁ జేయుచుండును. సత్సంతానమును జూచి సంతసించక తానే గొప్పవాఁ డయి గౌరవ మంతయుఁ బొందవలయు నని యుండునా? లేదు, లేదు. మనతండ్రి యట్టిస్వభావము కలవాఁడు గాఁడు. జనకున కున్నశక్తి మనకు లేకపోవచ్చును. ఆతనివలె సృష్టించి యద్భుతకార్యములఁ జేయుశక్తి మనము పొందక పోవచ్చును. కాని యతని గుణములఁ బొందుట కేయాటంకమును లేదు. మన కతని శక్తి సామర్థ్యములు వలదు. ఆయద్భుతసృష్టి కతఁడే నాయ కుఁడుగ నుండి మనల రక్షించుభారము ఆయనది. ఆ మహానుభావునిగుణముల నలవఱచుకొని తృప్తిపరచి యతని ప్రేమపాత్రుల మగుట మనవిధి. తన సంకల్ప సిద్ధికై మనలను దననుండి దూరముఁ జేసినాడు. మరల

మన మాతనిపాదపద్మయుగళమును బట్టి సేవించుచు నతనిని విడువకుండుటయే మనకర్తవ్యము. సోదరా! వ్రాయఁజాలకున్నాను. రేపటిజాబులో దీనితరువాత విషయమును వ్రాసెదను. ధ్యానమునుగూర్చి మొదలిడుటయే రేపు వ్రాసెదను. ఈయుత్తరము నుంచి రాబోవులేఖతోఁ గలిపి చదువుకొనుఁడు. నే నేదోవిధముగ వ్రాసెదను గాని మీసూపరింటెండెంటుగారి కీజాబులు చదివి యిచ్చుట కష్టముగ నుండునేమో! ప్రతిదినము మీకు జాబు లందఁజేయవలయు ననుభావముతోఁ నెంతవఱకు పూర్తియయిన నంతవఱకే పోస్టు చేయవలయు ననుకొన్నాను. రేపు పోస్టుచేయువలయు ననుకొంటిని. రేపటికన్న నీదినమయిన మీకు సంతోషముగ నుండు నని పోస్టుచేయుచున్నాను. మీ రేవిధముగ నున్నారు? భగవద్గీత యెంతవరకుఁ జదివినారు? పోస్టు వేళ అయినది. మఱియొకపర్యాయము చూచుటకేని యవకాశము లేదు. పొరపాట్లున్నవి. మన్నింపుఁడు. ఈదినమునకు సెలవు.

ఇట్లు,
సోదరి, అన్నపూర్ణాదేవి.

# కడమాట

తెలుగుభాషలో ఇటువంటి ఉత్తరాలు ప్రకటించడానికి ఇది మొదలు. రెంటాల వెంకటసుబ్బారావు పంతులుగారు కమల తనభర్తకు వ్రాసిన ఉత్తరములను కల్పితలేఖలను ఇంగ్లీషులో వ్రాశారు. అవి తెలుగులోకి కూడా వచ్చినవి. కాని కల్పితములు గనుక వీని కున్న విలువ వానికి లేదు. స్వచరిత్రములను వీనికి బోల్పదగదు. స్వచరిత్రకారు లెంత సత్యవంతు లయినను తమజీవితములలో తమకు యుక్తము లని తోచినవిషయములనుమాత్రమే వెల్లడిస్తారు. అందువలన వానికి ప్రాణము కొంత తీసిన ట్టవుతుంది. దేవిగారి ఉత్తరములు చాలమట్టుకు ఉన్నవి ఉన్నట్టు ప్రకటించడముచేత ఆమె అంతర్భావములును, సమకాలికవిషయములును మరుగు లేక వెల్లడియైనవి.

ఈ యుత్తరములు వ్రాసి లోకమునకు తనవిషయములు వెల్లడించవలెనని దేవి ఉద్దేశించకపోయినను మహాత్ముని సత్యాగ్రహోద్యమము మనుష్యుల జీవితములను, ఆదర్శములను ఎట్లు తలక్రిందులుచేసినదో మెతుకు పట్టి చూచినట్లు ఈయుత్తరములవలన చక్కగా తెలు

స్తుంది. దేవి బ్రహ్మసమాజవాతావరణములో పెరిగిన పిల్ల. సంస్కరణబీజములు మనసున చిన్నతనముననే నాటుకొన్నవి. పాశ్చాత్యాదర్శములు కొంతవఱకు కామె నాకర్షించినవి. పెద్దపరీక్షలిచ్చి విశేషముగా ధనాకర్షణ చేసి, ఒకరికి పెట్టి తా ననుభవించి దేశసేవ చేసి కీర్తి గణించవలె నని బాగుగా సంకల్పించినది. వలచి వివాహ మాడినది. తనవలెనే తనభర్తయును పెద్దపరీక్షలిచ్చి వేలాది గణించి దేశసేవ యొనర్చి ధీరుడు, వీరుడు, కీర్తి మంతుఁడు కావలె నని ఆశించినది. విద్యార్జనకై పరదేశ ములకుఁ బోవ భర్తను ప్రోత్సహించినది. తన యిరు వైపులవారును భాగ్యవంతులు కారని విచారించినది. తాను విదేశములకు పోవలె నని విశ్వప్రయత్నములు కావించినది. భర్త విదేశమునకు వెళ్లిన మొదటిరోజు లలో వ్రాసిన ఉత్తరము లన్నియు తాను విదేశమునకు పోఁగలందులకు విద్యార్థివేతనములు సమకూర్చుకొను నిమిత్తము చేసినప్రయత్నములతో నిండియున్నవి. వేత నము దొరకనిమెడల అధమము ఆంధ్రభాషా పాండిత్య మైనను సంపాదించవలయు నని అల్లాడిపోయినది. ప్రయ త్నములు విఫలమయినవి.

ఇంతలో మహాత్మునిసందేశము వచ్చినది. పడు చున్న ఆవేదన అంతట నుపశమించినది. పరుగు లిడు

చున్న కోర్కె లన్నియు ఆగినవి. అత్యాశ, అతృప్తి, తొలగి ఆత్మనిగ్రహ మేర్పడినది. విదేశపరీతులు, ఆంగ్ల భాషాపాండిత్యము, విదేశపద్ధతులు. పేరు చెప్పినంత మాత్రాన ఏవగింపు పుట్టించినవి. విదేశసంచారములో ఉపయోగించుటకై కుట్టించిన విలువగల పట్టు, ఉన్ని దుస్తు లన్న కంటగింపు కలిగినది. ధనతృష్ణ వైరాగ్య మునకు చోటిచ్చినది. జాతీయపాఠశాలలు వెలయుచున్న వని ఆనందించినది. ఇంగ్లీషుచదు వన్నను, విదేశముల చదు వన్నను ద్వేషము కలిగినది. సంస్కృతము, ఆంధ్రము చదువవలయు నన్న కోర్కె చిగురెత్తినది. చదువునిమిత్తము మొదట ప్రోత్సహించి విదేశములకు పంపి, యిప్పుడు చదువు మాని ఇంటికి వచ్చి తన సరసన దేశసేవచేయుమని, మొదట తాము భాగ్యవంతులు కా రని పడినవిచారము మాని, తమఆస్తి జాతీయపాఠ శాల కిచ్చి, దారిద్ర్య మనుభవించుట ఉత్తమ మని తన భర్తకు సలహా చెప్పినది. దేశసేవ చేయుటకు భర్తకు అవకాశము లేకపోయెనే అని ఆవేదనపడ్డది.

ఈమె రాజకీయభావములు మిక్కిలి తీవ్ర మయి నవి. జైదుకు పోవుట స్వల్పత్యాగముగా కనఁబడి నది. దేశమునకై ప్రాణములు సమర్పించి వీరవనిత అని పించుకోవలె నని అభిలషించినది. సత్యాగ్రహోద్యమ

మును దేశమోక్షమునకే గాక ఆత్మమోక్షమునకును సాధనముగా గ్రహించినది. సత్యాగ్రహమును ధర్మసాధన ముగా గ్రహించినవా రరుదు. ఈసాధన ఆమె ఆత్మోన్నప లబ్ధికి మిక్కిలి తోడ్పడినది. ఉద్యమములో ప్రవేశించిన మొదటిరోజులలో తన పేరు పత్రికలలో బాగుగా ప్రకటింప లేదని కోపించినను, త్వరలో కీర్తికాంక్షగాక నిరపేక్షతో ధర్మము నిర్వహించుటయే సాధుమార్గ మని గ్రహించి, దృష్టిపథము మార్చుకొన్నది. గాంధిగారి మెప్పు పడసినది.

తీవ్రమైన సంఘసంస్కరణాభిలాషిణి. హిందూ సంఘమునందు స్త్రీలకు అర్హస్థానము సంపాదింపవలయు నని ఆశించినది. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అనే సిద్ధాంతము ఆమెకు నచ్చలేదు. పర్దా పోద్రోసి, బహి రంగముగా ఉపన్యాసము లిచ్చి, యిండ్లిండ్లు తిరిగి ఖద్దరమ్మి నది. ఘోషాపద్ధతియం దాదరముగల యీమె బంధుజాల మున కామె చర్య ఘోరముగా దోచి ఆమె నపనిందల పాలు గావించినారు. ఈసంబంధమున ఆమె వ్రాసిన యుత్తరములలో సింహమువలె గర్జించినది. స్వాతంత్ర్యము కోల్పోవుట కామె యిసుమంతయు నంగీకరింపలేదు. ఈమె స్వేచ్ఛావర్తనమువలన తమకు తలవంపులుగా నున్న వని బంధువులు భర్తకెరిగించిరి కాంబోలు. ఆసం దర్భమున వ్రాసిన ఉత్తరములు మిక్కిలి హృదయరంజక

ములుగా నున్నవి. విస్తరభీతిచేత ఒక్క భాగముమాత్రము ఎత్తి చూపెదను:—

"నామూలమున వీరికి తలవంపు లేల? నేను వీరి యిచ్ఛానుసారముగా నడచుట యేమి? అటువంటిదుర్దశ నాకు సంభవించిన ఆత్మహత్య చేసికొనుట నిశ్చయము."

"నేను జనులకు భయపడను. ఎవ రేమనుకొన్నను నాకు కష్టము లేదు. మీరుమాత్రము దయగా నున్న చాలు......నే నీభువిపై నెవరికి భయపడను. కేవల మొక్క పరమేశ్వరునకే భయపడుదును."

"నాది చపలచిత్తమో వజ్రహృదయమో మీకింకను దెలియకుండునుగాక." మరియొకసందర్భమున గూడ నిట్టిభావము వెల్లడించినది.

"నే నింటిలో నున్నను ప్రపంచమును వదలినను తమకు భయపడి ఉద్యమమునకు విముఖరాల నైతి నని గవర్నమెంటువారు ఏనాటికిని అనుకొనరు. వారికి నాపై సందేహ మెల్లకాల ముండును."

ఇట్టి ఉత్తమభావములచే ఉత్తేజితమైన యావ్యక్తి ధన్యురాలు!

వలచి వివాహము చేసికొన్నను ఆమెజీవితములో దానికి ప్రధానస్థాన మియ్యలేదు. ఆమె పలుచోట్ల క్లిష్ట పరిస్థితులు గలిగినపట్ల మీరు నాచెంత నుండిన బాగుం

డునుగదా! యని భర్తయొక్క సహధర్మచరత్వమును మాత్రమే అభిలషించినది. తన జీవితవికాసమునకు, ఆత్మోపలబ్ధికి సాధనముగామాత్రమే గ్రహించెను; కాని భర్తకు సాధన మగుటయే స్త్రీ జన్మసాఫల్య మని విశ్వసించలేదు. స్త్రీయొక్క ప్రత్యేకవ్యక్తిత్వమునందు ఆమెకు విశ్వాసము గలదు. దానికి ప్రతిబంధక మైనచో భర్త కొఱకై తనస్వాతంత్ర్యమును గోల్పోవజాలదు. భార్యా భర్తలు ఏకవ్యక్తి యనిగాని, ఏకవ్యక్తియొక్క భిన్న చ్ఛాయలనిగాని, అవి రెండును ఎప్పటి కయినను ఏకత్వ మునుపొందు నని గాని ఆమె విశ్వాస మయినట్టు కన బడదు. ఆమె రాంబోవు స్త్రీత్వమునకు మాత్ర్కాయేమి? పై నుదాహరించిన తీవ్రభావములు కలిగియున్న యా వీరవనితయొక్క హృదయము మిక్కిలి కోమలముకూడ నయినది. కొన్నిచోట్ల పట్టి ఆడుదానివలె వర్తించి నది. అదియెంతయు రమ్యముగా నున్నది. అమెరికా నుండి రాంబోవు తన భర్త కిట్లు వ్రాసినది:—

“ఫలాహారము తొమ్మిదిమాసములనుండి తీసు కొనుటవలన లావు తగ్గినాను. లావుగా నున్న బాగుం డునా? బాల్యమునుండియు నేను లావుగా నున్నానా?”

భర్తకు అమెరికాలో యోగ్యవర్తనుడవై నడు చుకొమ్మని వ్రాసినవ్రాతలు అసందర్భవిషయమును గూర్చి యైనను నిర్వికారముగా శాస్త్రవాక్యులవలె సభ్యతను పొంద ప్రకటింప నర్హ మైయున్నవి.

ఈ లేఖలు ప్రత్యేకించి శ్రీ దేవిగారియొక్క ఆశయములను, వ్యక్తిత్వమును, జీవితసముదారలక్ష్యమును ఆంధ్రలోకమునకు వ్యక్తీకరించునిమిత్తమే ప్రచురింపఁబడినవి. వీని ప్రచురణమునకయి శ్రీ బాపినీడుగారు చూపిన ధైర్యస్థైర్యములు, త్యాగము, సతియందలి శ్రద్ధ స్తవనీయములు. పాఠకులు ఈలేఖలను చదివి అంతమాత్రమున శ్రీ బాపినీడుగారి యాశయములను, లక్ష్యములను, వ్యక్తిత్వమును ఊహించుట సాధ్యము కానిపని. కాన చదువరులు ఈలేఖలు ఒకదేవిగారినిగూర్చి తెలియుటకే ఉపయోగించుకొందురు గాక అని మనవి.

ఇక బాపినీడుగారినిగూర్చి ఒకమాట చెప్పి విరమిస్తాను. ఆయన వ్రాసిన వుత్తరము లిందు ప్రకటింపఁబడకపోవుటచేత వారిభావములు పూర్తిగా వెల్లడిగాక కొన్నిచోట్ల సంకుచితముగా కనపడవచ్చును. నిజముగా అట్టిదాని కవకాశము లేదు. వారి స్వాభావిక విశాలభావములకుతోడు సతీమణియొక్క ధర్మాచరణము, దేశభక్తి ఆత్మసమర్పణము ప్రేరేపించుటచే తోడి యువకులు పైవారి నాశ్రయించి ఉద్యోగములు సంపాదించుకొని ఆత్మలాభపరాయణులై ఉండఁగా, దేశసేవ యనునది యొకటిచుట్టుకొని జయిళ్లపాలయియుండుట చూచి స్వర్గవాసిని అయిన సతీమణి ఆనందించియుండును.

వేలూరు,
జనవరి 3-౧౯3౧.

వున్నవ లక్ష్మీనారాయణ

# అనుబంధము

---

ఈ 'లేఖల'యందు వచ్చు కొందరి గూర్చిన వివరణము

**యమ్. యస్. చౌదరి**

దెందులూరు కాపురస్థులు. ఇంగ్లాండులో ఏడుసంవత్సరములు ఉన్నతవిద్యకై యుండిరి.

**రాఘవచంద్రయ్య**

ఇప్పుడు సచ్ఛాస్త్రి యనబడు దుగ్గిరాల రాఘవచంద్రయ గారు. గ్రంథకర్త. దేవిగారి ఆంధ్రభాషాభివృద్ధికి తోడ్పడిన మిత్రులు.

**ముట్నూరి కృష్ణారావుగారు**

కృష్ణాపత్రికా సంపాదకులు.

**రవి బాబు**

రవీంద్రనాథ ఠాకూరుగారు.

**నాయుడుగారు**

సర్. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు.

**కే. గోపాలరావు**

కాళ్లకూరి గోపాలరావుగారు. కవులు. గ్రంథకర్త. శ్రీ అన్నపూర్ణాదేవిగారి ప్రథమగ్రంథము 'సీతారామ' ప్రచురణకర్తలు.

శ్రీమతి యెస్తరుకన్య లేక ఫేరింగుకన్య

డెన్మార్కు దేశము. మదరాసు వేపేరి బాలికాపాఠశాలలో దేవిగారికి పరిచయమై ఆప్తురాలయ్యెను. సబర్మతీ ఆశ్రమములో కొంతకాల ముండెను. మీనను అను భారతీయుని పెండ్లాడెను. సబర్మతియం దున్నప్పుడు అన్నపూర్ణ వలన సహాయము పొందెను.

డాక్టర్ ముల్లరు

మదనపల్లి క్షయరోగనివారణచికిత్సాలయాధికారి. డెన్మార్కు దేశస్థుడు.

కమల

దేవిగారికి ప్రజాసేవయందు తోడ్పడుచుండిన పినతల్లికూతురు.

విధుశేఖరశాస్త్రి

పాళీ, సంస్కృతము, బెంగాలి, హిందీ మున్నగుభాషల యందు పాండిత్యముగల్గి ప్రఖ్యాతికెక్కిన శాంతినికేతనమునందలి ప్రధానపండితులు. వీరి 'వివాహమంగళము'ను బెంగాలీలోనుండి ఆంధ్రమునకు దేవిగా రనువదించిరి.

సరళాదేవి

స్వర్ణకుమారి దేవిగారి కూతురు. గ్రంథములు రచియించిన నాయకురాలు. బెంగాలీలో రచించిన 'నవవర్ష స్వప్నము'ను దేవిగా రాంధ్రమున ననువదించిరి.

రాణీగారు

కీ. శే. లైన పిఠాపురము మహారాణీగారు.

హారిశ్చంద్రుడు

వర్తకులు. కాకినాడ. బాపినీడుగారి బాల్యస్నేహితులు. ఆప్తమిత్రులు. ఇప్పుడు శాసనసభాసభ్యులు.

సర్కారుగారు

ఆంధ్రులకు చిరపరిచయులైన బ్రహ్మసమాజ ప్రసిద్ధ మత వ్యాపకులు. 1911 సంవత్సరములో దేవి చదువుకొనుటకు కలకత్తాకు వెళ్లినప్పుడు వీరి గృహముందే యుండెను.

ని బారన్ చంద్రరాయి

బాపినీడుగారి బెంగాలీ స్నేహితులు.

పద్మజ

సరోజనీదేవిగారి పెద్దకూతురు.

డాక్టర్ కుర్లర్

ఆంధ్రదేశమునందు ప్రసిద్ధికెక్కిన గుంటూరు కుర్లరాస్పత్రి స్థాపకురాలు.

ఫారు దొరసాని

కుర్లరాస్పత్రిలో పనిజేసిన డాక్టర్. ఫారుకుట్టి.

పి. వి. సుబ్బారావు

బారిష్టరు ప్యాసై ఇంగ్లీషు కన్యను పెండ్లాడిన గుంటూరుజిల్లా కమ్మవారు. ఇప్పుడు ఇంగ్లాండులో న్యాయవాదవృత్తి జేయు చున్నారు.

శేషగిరిరావుగారు

ర్యాలి శేషగిరిరావు. బి. ఎ. యల్. టి., ఏలూరు. దేవి యున్నతవిద్యాభివృద్ధికై తోడ్పడిన కుటుంబస్నేహితులు

మాణిక్యాంబ

గడ్డిపాటి మాణిక్యాంబగారు. కమ్మవారిలో ప్రథమః పునర్వివాహము జేసుకొన్న యువతీమణి. మదరాసు.

